తెలిసిన దాని కన్నా తెలుసుకోవలసిందే అధికంగా ఉండే టప్పుడు, వినడం లేదా తెలుసుకోవడం వల్ల ప్రయోజన మేమిటి? అనేది *కిం* పదం సంధించే ప్రశ్న.

విభూతు లన్నీ జగత్తు లోనే ఉన్నాయి. జగత్తు తనలో ఒక అంశమే నట. ***పాదోఽ స్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి*** అని కదా వేదం లోని పురుష సూక్తము! ఎంత తెలిసినా సశేషమే మిగిలే టప్పుడు తెలుసుకొని ప్రయోజన మేమిటి? ***(కిమ్?).*** సశేషం కనుక తెలుసుకో నవసరం లేదు అనేదే గనుక భగవంతుని అభిమత మైతే, విభూతి యోగాన్ని ఎందుకు చెబుతాడు? ***(కిమ్?).*** ఎంత తెలిసినా సశేషమే కనుక, నిశ్శేషంగా తెలుసుకొనే మార్గం చెబుతాను అంటున్నాడు. ఏమిటది? ఈ జగత్తు నా ఒక్క అంశమే. కనుక ఇవన్నీ దేని విభూతులో, దేనిలో జగత్తు కేవలం ఒక భాగమో, దాని నొక్క దానిని తెలుసుకోవడమే నిశ్శేషంగా తెలుసు కోవడము అవుతుంది అంటున్నాడు.

అనంతమైన ఆ పరమాత్మ స్వరూపము తెలిసి నపుడు, ఏకాంశమైన ఈ విభూతులను తెలుసుకొని ప్రయోజన మేముంది? ***(కిమ్?).*** అనంత పరబ్రహ్మము తెలియ నపుడు ఇవన్నీ తెలుసుకొని మాత్రం ప్రయోజన మేమిటి? ***(కిమ్?).*** కనుక, తెలియ వలసింది, తెలియదగింది ఒక్క నిర్విశేష పరబ్రహ్మమే అనేది విభూతియోగ సారము.

బ్రహ్మాత్మ జ్ఞానము బుద్ధి యందు స్థిరపడాలి. మనస్సు బాహ్యంలో చరించ వలసి వచ్చినా, చలించకుండా ఉండేందుకు, కేవలం పరమాత్మ జ్ఞానమే, పరమాత్మ దృష్టియే ముముక్షువులో నిలిచి ఉండేందుకు, ప్రత్యేకించి ఈ విభూతి యోగము చెప్పబడింది.

***శ్లో॥ ఇంద్రియ ద్వారత శ్చిత్తే బహిర్ధావతి సత్యపి ।***
***ఈశ దృష్టి విధానాయ విభూతీ ర్దశమేఽ బ్రవీత్ ॥***

చంచలమైన చిత్తము ఇంద్రియాల ద్వారా బహిర్ముఖమైనా, ఆయా బాహ్య విషయాల యందు కూడా ఈశ్వర భావననే స్థిరపరచు కొనేందుకు ఈ విభూతి యోగము అనే పదవ అధ్యాయము చెప్పడం జరిగింది అని శ్రీధరీయం.

**ఓం నమో భగవతే వాసుదేవాయ**

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విభూతి యోగో నామ దశమోఽ ధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు విభూతి యోగ మనే పదవ అధ్యాయము.**





# చైతన్య భగవద్గీత

## అథ ఏకాదశోఽ ధ్యాయః - పదకొండవ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగః - విశ్వరూప సందర్శన యోగము

**విశ్వ - రూప - సందర్శన - యోగము**

విశ్వమును విశ్వరూపునిగా దర్శించే ఉపాయమే విశ్వరూప సందర్శన యోగము. ఈ అధ్యాయం పేరులో నాలుగు పదాలున్నాయి. ఈ నాలుగు పదాలూ మనకు అర్థం కావలసి ఉంది.

ఇక్కడ ప్రధానంగా జరిగే 'సందర్శనము' అనే అనుభవము రూప దర్శనమా? లేక స్వరూప దర్శనమా? ఇక్కడ 'విశ్వరూపము'ను దర్శించడం అంటే, విశ్వము యొక్క రూపమును దర్శించడమా? లేక విశ్వములో విశ్వేశ్వరుని దర్శించడమా? లేక విశ్వేశ్వరునిలో విశ్వమును దర్శించడమా?

**విశ్వము - విశ్వరూపము**

***వివిధ ప్రత్యయ గమ్యం విశ్వమ్*** - అనేక విషయాలను కలిగి ఉన్నది, ఆ విషయాలకు సంబంధించిన పరిజ్ఞానంతో అర్థ మయ్యేదే విశ్వము. ప్రపంచ మంతా కలిస్తేనే విశ్వము. విశ్వమే అలా ఉండే టప్పుడు ఇక విశ్వం కన్నా వేరుగా వ్యక్తి లేడు, ఉండలేడు అని ప్రత్యేకించి చెప్ప నవసరం లేదు.

ఇంతవరకు, విశ్వాన్ని అర్థం చేసుకొనే ప్రయత్నంలో విశ్వాన్ని నిర్వచించి చెప్పుకున్నాం. ఇకపోతే, విశ్వం యొక్క అర్థం విశ్వం లోనే ఉందా? విశ్వము యొక్క పరమార్థం విశ్వమేనా? అనే సందేహం ఉదయించి నపుడు విశ్వం యొక్క అర్థం విశ్వంలో లేదేమో అనిపిస్తుంది.

***ఐతదాత్మ్యం ఇదం సర్వం*** - నాయనా! శ్వేతకేతూ! ఈ సమస్త ప్రపంచము యొక్క అర్థము, లేక సత్యరూపము సద్వస్తువు లోనే, అంటే పరమాత్మ లోనే ఉంది అంటూ, అద్భుతమైన విషయాన్ని ఆవిష్కరించాడు ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి *(ఛాం : 6 - 9 - 4).* మట్టిపాత్రలు ఎన్నున్నా, వాటి యొక్క అర్థం మట్టి లోనే ఉన్నట్లు, వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వం యొక్క అర్థం విశ్వరూపుని లోనే ఉంది. విరాడ్రూపుని లోనే ఉంది. విరాట్పురుషుని లోనే ఉంది.

***వివిధం రాజతే ఇతి విరాట్*** - వివిధ రూపాలలో గోచరించే వాడు కావడం చేత ఆయన విరాట్పురుషుడు. రూపాన్ని, కాలాన్ని, దేశాన్ని, దేనినీ వదలకుండా ఆయన విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు ***(విశ్వతః వృత్వా వ్యాప్య).*** మట్టి పాత్రలలో ఉన్నదంతా మట్టే అయినా, అవి వివిధములైన నామరూపాలతో తెలుస్తున్నాయే గాని, అద్వయమైన మట్టిగా అర్థం కావడం లేదు. భిన్నత్వం లోని ఏకత్వం అనుభవానికి అందడం లేదు. భిన్నత్వాన్ని చూడటం దర్శన మైతే, భిన్నత్వంలో ఏకత్వాన్ని వీక్షించడం సందర్శనము ***(సందర్శనం, సమ్యక్ దర్శనం).*** అనేక రూపాలతో గోచరించే ఈ విశ్వమును ఏకరూపుడైన విశ్వమూర్తిలో దర్శించాలనే ఆశ అర్జునునిలో కలిగింది. ఆ ఆశే అద్భుతమైన ఒక అధ్యాయానికి శ్రీకారం చుట్టింది.

ఆశ అయితే బాగానే ఉంది. కానీ వివిధ ప్రత్యయ గమ్యమైన విశ్వము అర్జునునికి కనిపిస్తూనే ఉంది కదా! ఒక వైపు విశ్వం కళ్ళెదుట కదుల్తూ ఉండినా, ప్రత్యేకంగా విశ్వరూపాన్ని చూడా లంటాడు ఎందుకని?

విశ్వం కనిపిస్తూ ఉండినా, విశ్వంలో విశ్వరూపుని దర్శించా లనేది అర్జునుని అభిలాష అనుకుందామా? మరి, ఎదురుగా నిలబడి ప్రత్యక్షంగా గీతను బోధిస్తున్న వాడు ఎవడు? విశ్వనాథుడు కాడా? జగన్నాథుడు కళ్ళ ముందే ఉన్నాడు. జగత్తు కళ్ళెదుటే కనిపిస్తూ ఉంది. జగత్తు లోనే జగదీశ్వరుడు గోచరిస్తున్నాడు. ఇంకేమి దర్శించాలని అర్జునుడు ఆరాట పడుతున్నాడు? నిజమే. విశ్వము కనిపిస్తూనే ఉంది. విశ్వంలో వాసుదేవుడు ప్రత్యక్షం గానే ఉన్నాడు. కానీ, కాల భేదం, దేశ భేదం ఏమైనా అతనిని కలత పెడుతున్నా యేమో, అంటారా?

వివిధ రూపాలలో విశ్వం గోచరిస్తూ ఉంది కనుక, అన్ని రూపాలను ఒకే కాలంలో దర్శించడం కుదరదు. కనుక, ఒక వస్తువు తరువాత మరొక వస్తువును చూస్తాం. అలా చూడటంలో దేశాంతరం ఉంది. కాలాంతరం ఉంది. ఒక రూపాన్ని చూచినపుడు మరొక రూపాన్ని చూడలేము. ఒకే ప్రదేశంలో అన్నిటినీ చూడలేము. ఒకే కాలంలో సమస్తాన్ని చూడలేము. విశ్వమును చూస్తున్నా విశ్వ మంతటిని మన కళ్ళతో ఏక కాలంలో చూడలేము.

పోనీ, అభిముఖంగా నిలబడి బోధిస్తున్న గీతాచార్యుని అయినా పూర్ణంగా ఏక కాలంలో దర్శించడం జరుగుతూ ఉందా? అదీ లేదు. దేవాలయంలో దేవతామూర్తిని దర్శించినట్లే, జగదాలయంలో జగదీశ్వరుని చూడటం జరుగుతూ ఉంది.

ఆలయం లోని మూర్తి యొక్క ముఖారవిందాన్ని దర్శిస్తే, చరణ కమలాలు కనిపించవు. పాదాలను దర్శిస్తే నేత్రాలు కనిపించవు. నేత్రాలను అవలోకిస్తే శ్రోత్రాలు కనిపించవు.

ఒక ప్రదేశంలో, ఒక కాలంలో మన ఎదుట నిలబడి ఉన్న వ్యక్తినే సంపూర్ణంగా దర్శించ లేనపుడు, అన్ని కాలాలలో ఉండే వాటిని, అన్ని ప్రదేశాలలో ఉండే వాటిని, ఒకే కాలంలో, ఒకే చోట, ఒక్కటి గానే దర్శించడము సాధ్యమా? సాధ్యము కాదు. అసాధ్యము. ఆ అసాధ్యాన్ని సాధ్యం చేసుకొనే ప్రయత్నమే అర్జునుని ఆరాటం లోని అంతరార్థం. ఇంద్రియ గోచరం కాని దానిని, మనోగోచరం కాని దానిని దర్శించాలనే కుతూహలమే కుంతీ తనయునిలో ప్రస్తుతం ప్రగాఢంగా ఉంది. అన్ని రూపాలు ఒకే చోట, ఒకే కాలంలో, ఒకే రూపంలో గోచరించడమే విశ్వరూపం.

## ప్రేరణ - ప్రయత్నము

అసలు విశ్వరూపమును సందర్శించాలి అనే ఆలోచన అర్జునునికి ఎందుకు కలిగింది? పరమేశ్వరుడు పదవ అధ్యాయంలో దివ్యమైన ఆత్మ విభూతుల్ని వైభవోపేతంగా వర్ణించి ***(భగవతః విభూతయః ఉక్తాః)***. చివరి శ్లోకంలో ఈ సమస్తమైన విశ్వము తనలో ఏకాంశమే అనే సత్యాన్ని ప్రవచించాడు. దానిని ఆలకించిన తరువాత ***(శ్రుత్వా)***, ఏ ప్రపంచము ఆత్మ రూపమై ఉందో, ఆద్యుడైన ఈశ్వరునికి సంబంధించి ఉందో, అట్టి ఈశ్వరాంశ అయిన విశ్వాన్ని ప్రత్యక్షంగా వీక్షించాలని అర్జునుడు ఆశ పడ్డాడు ***(యత్ జగత్ ఆత్మరూపం ఆద్యమ్ ఐశ్వర్యం తత్ సాక్షాత్కార్తు మిచ్ఛన్)***.

## పూర్వ స్మృతులు

అర్జునుని చిత్తము స్మృతి పుటలను తెరిచింది. గతాలు గుర్తు కొస్తున్నాయి. బాల్యం నుండి వింటూ వస్తున్న శ్రీకృష్ణుని లీలలు వీనులలో సవ్వడి చేస్తున్నాయి.

'కన్నా! నువ్వు మన్ను తింటున్నా వని గోపబాలురు, మీ అన్నయ్య కూడా చెబుతున్నారు. నువ్వు తినడానికి ఇంట్లో తినుబండారాలే లేవా? మన్ను తిన వలసిన కర్మ నీ కేమిటి?' అని యశోద ప్రశ్నించి నపుడు,

'అమ్మా! నేను మన్నెందుకు తింటాను? నన్ను నీ చేత కొట్టించాలని వాళ్ళు అలా చెబుతున్నారు. వాళ్ళ





మాటలు వినకు. నా మాట మీద నీకు నమ్మకం లేకపోతే, ***మదీయాస్య గంధ మాఘ్రాణము సేసి నా వచనముల్ దప్పిన దండింపవే!*** అంటూ వాసన చూడమని కృష్ణయ్య నోరు తెరిచాడు. అంతే.

కన్నయ్య నోటిలో సాగర పర్వతాలు, భూగోళ సూర్యగోళాలు, చంద్రతారకలు, దిక్పాలకులు, ఈ యావద్విశ్వం వెలుగులు చిమ్ముతూ గోచరించింది.

**ఇ॥ బాల మాత్రుడగు సలీలుని ముఖమందు విశ్వ మెల్ల నెట్లు వెలసి యుండు**
**బాలు భంగి నితడు భాసిల్లు గాని సర్వాత్ముడాది విష్ణు డగుట నిజము ॥**

ఎంత చిన్న పిల్లవాడు! విశ్వమంతా ఈ చిన్ని నోటిలో ఎలా ఇమిడి ఉంది? బాలుడిలా కనిపిస్తూ ఉన్నా, ఇతడు సర్వాత్ముడైన విష్ణుదేవుడే అని భావించింది యశోద.

పరమేశ్వరుడు పదవ అధ్యాయములో తన విభూతి వైభవమును వర్ణించిన తరువాత, అర్జునుని మనస్సులో ఏకాంశమైన జగత్తును భగవంతునిలో దర్శించాలనే కుతూహలం ఒక వైపు పెరుగుతూ ఉంటే, మరో వైపు అతని చిత్తము బాలకృష్ణుని లీలా ప్రదర్శనములో చిక్కుకొని బయట పడలేక ఉక్కిరిబిక్కిరి అవుతూ ఉంది. యశోదకు కలిగిన భాగ్యము తనకూ ప్రాప్తిస్తే బాగుండు నని ఉవ్విళ్ళూరుతోంది.

**మన్ను తింటివని నోరు చూప మనగా**
**తెరచి చూపితి వట నోట త్రిభువనములు**
**మా కళ్ళకు ఆ భాగ్య మెపుడు కలుగు?**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

యశోదను అనుగ్రహించి విశ్వరూపాన్ని దర్శింప చేసిన జగన్నాథుడు, మహాభారతము - ఉద్యోగ పర్వంలో ధృతరాష్ట్రునికి దివ్య దృష్టిని ప్రసాదించి తన విశ్వరూపాన్ని దర్శించే భాగ్యాన్ని కల్పించాడు. ఎన్నో దుష్ట కార్యాలకు పరోక్షంగా శ్రీకారం చుట్టిన ధృతరాష్ట్రుని కూడా కరుణించి దివ్య దర్శనాన్ని అనుగ్రహించాడు. ఎంత అద్భుత దర్శనమో! కాకపోతే, నిన్ను దర్శించిన నేత్రాలతో మరొకరిని చూడలేను. నా దృష్టిని ఉపసంహరించు! అని ధృతరాష్ట్రుడు ప్రార్థిస్తాడా?

***నిను గంటి గృతార్థుడ నైతి నింకనొల్ల నొరుల***
***జూడ, లోచనములం బురుషోత్తమ సంహరింపవే,*** అని ధృతరాష్ట్రుడు ప్రార్థించి నపుడు, పరమేశ్వరుడు అతని దృష్టిని అంతర్ముఖం చేశాడు.

వారిలో ఏమి చూశాడో! ఏ విద్యాగంధము లేని యశోదకు నోరు తెరిచి విశ్వరూప దర్శనాన్ని అనుగ్రహించాడు. ధృతరాష్ట్రుని కళ్ళు తెరిపించి, విశ్వరూపాన్ని దర్శించే భాగ్యాన్ని ప్రసాదించాడు. వారిలో అర్హత లేమిటో తనకు తెలియదు. తనకూ అర్హత ఉంటే, ఆ భాగ్యాన్ని పరమాత్మ తనకు కూడా అనుగ్రహిస్తాడు కదా! అడగనిదే అనుగ్రహం ఎలా ప్రాప్తిస్తుంది? కనుక, అర్థించడమే తన వంతు. ప్రార్థించడమే తన కర్తవ్యం అని ఒక నిర్ణయానికి వచ్చిన అర్జునుడు, 'కృష్ణా! ఆ దివ్య రూపాన్ని చూడటానికి నేను తగుదు నని నువ్వు భావిస్తే **(మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో)**. ఆ దివ్య దర్శనాన్ని నాకు అనుగ్రహించు! అని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు అనుగ్రహించాడు. అర్జునునికి అచ్యుతుడు అనుగ్రహించిన దివ్యానుభవమే విశ్వరూప సందర్శనము. యశోదకు నోరు తెరిచి చూపాడు. ధృతరాష్ట్రునికి కళ్ళు తెరిపించి చూపించాడు. అర్జునునికి హృదయ కవాటాలు తెరుచుకొనేలా దివ్య దృష్టిని ప్రసాదించి చూపుతున్నాడు.

## అద్భుత దర్శనం

విశ్వరూప దర్శనము అనేది అద్భుతమైన దివ్య సందర్శనము. అద్భుత మైనది భగవంతుడి రూపమే అయినా, వాస్తవానికి 'రూపం భగవంతుడే, కాని భగవంతుడు రూపం కాదు' అనే సత్యావగాహనే అద్భుతం. దృక్చైతన్య మైన భగవంతుడు భక్తుడైన అర్జునుని కొరకు దృశ్యంగా అగుపించిన దర్శనమే పరమాద్భుతం. సర్వాత్మకము, సర్వ కారణము, సర్వైశ్వర్య సంపన్నమైన స్వరూపము ఉపాస్యంగా కళ్ళ ముందు నిలబడటం మహాద్భుతం. ఈ మహాద్భుత దర్శనము వీక్షణార్థమా? ఉపాసనార్థమా? అనే విషయాన్ని అధ్యాయం ముగిసే సరికి మీరే నిర్ణయిస్తారు. సర్వ మంగళ స్వరూపమైన ఈ దివ్య దర్శనం ఉపాసనార్థం కాకపోతే - ***నిమిత్తమాత్రం భవ!*** - 'ఓ సవ్యసాచీ! అర్జునా! విశ్వమంతా నా అధీనం లోనే ఉంది. నువ్వు నిమిత్తమాత్రంగా ఉండు' అని భగవంతుడు ఎందుకు చెబుతాడు?

ఇది విశ్వరూప సందర్శన యోగము. గీతలో ఏకాదశాధ్యాయము. నా అదృష్ట మేమో! ఈ రోజు కూడా ఏకాదశే. ఏకాదశి నాడు ఏకాదశాధ్యాయాన్ని ప్రారంభిస్తున్నా!

అద్భుతమైన, అలౌకిక మైన రూపాన్ని దర్శింప చేసే ఈ అధ్యాయము అన్నిటికి విలక్షణంగా శోభిస్తుంది. ఈ అధ్యాయంలో యాభై ఐదు శ్లోకా లున్నాయి. సంజయుని ప్రవేశం కూడా ఉంది. ఈ అధ్యాయం స్తోత్ర ప్రధానంగా నడుస్తుంది. ఉపాసనా యుక్తంగా ఉంటుంది. ఆరాధనా యుతంగా సాగుతుంది. వర్ణనా విశేషము ఒక వైపు మనస్సును ప్రభావితం చేస్తూ ఉంటే, ప్రార్థనా వైభవము మరో వైపు హృదయాన్ని పరవశింప చేస్తూ ఉంటుంది. ఇప్పటి వరకు మనం చూచినట్లు, తాత్త్విక విషయ చర్చ ఇందులో పెద్దగా లేకపోయినా, తత్త్వాల లాగా పాడుకోవలసిన విషయం, భగవంతుని దివ్య క్రీడను ఆనందంగా వీక్షించ వలసిన విషయం ఎంతైనా ఉంది. తత్త్వ ప్రధానమైన భగవద్గీతా గ్రంథంలో వ్యాసుని కలం, ముఖ్యంగా ఈ అధ్యాయంలో, మహిత కవితా విభూతిని ఆవిష్కరించింది. లలిత శబ్దాలంకార సౌందర్యంతో, శ్రవణ మనోహర లయాత్మక పద సొబగులతో, ఆనంద పారవశ్యాన్ని రసరమ్యంగా మధుర భక్తిలో రంగరించి, హృదయాలను తన్మయత్వంలో ఓల లాడిస్తుంది. ఇక నే నంటారా! నిమిత్తమాత్రంగా నివేదిస్తూ ముందుకు సాగుతుంటాను. ప్రస్తుతానికి కాస్త ఆగుతాను. అర్జునుడు ప్రవేశిస్తున్నాడు.

**అర్జున ఉవాచ :**

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మ సంజ్ఞితమ్ ।
యత్త్వయోక్తం వచ స్తేన మోహోఽయం విగతో మమ ॥ 1

*మదనుగ్రహాయ-పరమం-గుహ్యం-అధ్యాత్మసంజ్ఞితం*
*యత్-త్వయా-ఉక్తం-వచః-తేన-మోహః-అయం-విగతః-మమ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మదనుగ్రహాయ | = | నన్ను అనుగ్రహించుటకు | ఉక్తం | = | చెప్పబడిందో |
| త్వయా | = | నీ చేత | తేన | = | దాని చేత |
| పరమం | = | ఉత్కృష్టమైన | మమ | = | నా యొక్క |
| గుహ్యం | = | రహస్యమైన | అయం | = | ఈ |
| అధ్యాత్మసంజ్ఞితం | = | అధ్యాత్మ మైన | మోహః | = | మోహము |
| యత్ | = | ఏ | విగతః | = | పోయింది |
| వచః | = | వాక్యము | | | |





**పార్థుడు ప్రార్థిస్తున్నాడు :**

**భగవంతా! నన్ను అనుగ్రహించడానికి ఉత్కృష్టమైన, రహస్యమైన అధ్యాత్మ జ్ఞానాన్ని నాకు బోధించావు. నీ ఉపదేశంతో నా మోహము నశించింది.**

**వ్యాఖ్య**

కురుక్షేత్ర సంగ్రామంలో మోహ జాడ్యంలో కూరుకుపోయి, విషాదంతో కుమిలిపోతూ, కర్తవ్య విముఖుడై, యుద్ధం చేయలేని స్థితిలో కూలబడి, తనకు ఏది శ్రేయస్సో బోధించి కర్తవ్యమును నిర్దేశించ మని శ్రీకృష్ణ దేవుని గురువుగా ఎన్నుకొని, ఆయన ముందు చేతులు జోడించాడు శిష్యుడుగా అర్జునుడు. అర్జునుడు గీతాబోధను ఆలకించ డానికి అర్హుడని భావించిన తరువాత, శిక్షణ యోగ్యుడైన పార్థునికి గీతాబోధను వినిపిస్తూ పది అధ్యాయాలను సమాప్తం చేశాడు అచ్యుతుడు. ఇంతవరకు సాగిన గీతా ప్రవచన ప్రభావము ఏపాటిది? శ్రీకృష్ణార్జునుల మధ్య జరిగిన ఈ సంవాదములో శ్రీకృష్ణుడు గురువుగా చేసిం దేమిటి? అర్జునుడు శిష్యుడుగా చూచిం దేమిటి? అదేమిటో, అర్జునుని మాటల్లోనే విందాం.

**వక్త చేసిం దేమిటి?**

వక్తగా కురుక్షేత్రంలో వాసుదేవుడు చేసింది ఉత్తమము, రహస్యము, ఆత్మవిద్యా విషయమైన జ్ఞానమును బోధించడమే ***(పరమం, గుహ్యం, అధ్యాత్మ సంజ్ఞితం యత్ ఉక్తం వచః).*** ఈ విధమైన జ్ఞానాన్ని భగవంతుడు ఎందుకు బోధించాడు? అర్జునుని అనుగ్రహించేందుకే నని అర్జునుడే చెబుతున్నాడు ***(మదనుగ్రహాయ మమ అనుగ్రహార్థం).*** అర్జునుని అనుగ్రహించ వలసిన అవసర మేమిటి? మోహం వలన ఏర్పడిన శోకమును నివారించి, ఉపకారము చేయాలి అనే భావనే భగవంతుడి అనుగ్రహానికి హేతువు.

నేను చంపేవాణ్ణి, భీష్మద్రోణాదులు చచ్చేవారు అనే మోహం అర్జునుని కృంగ దీసింది. ఆత్మానాత్మ వివేకం లోపించడం చేత కర్తృత్వ భోక్తృత్వాలు ఆత్మకు ఆపాదించ బడ్డాయి. ఈ విధమైన మోహాన్ని తొలగించే ప్రయత్నంలో శ్రీకృష్ణుడు బోధను ప్రసాదించి అర్జుననిపై అనుగ్రహాన్ని కురిపించాడు.

తనపై అనుగ్రహాన్ని చిందిస్తూ శ్రీకృష్ణుడు అందించిన బోధను మూడు విశేషణాలతో అర్జునుడు వర్ణిస్తున్నాడు. (1) పరమం (2) గుహ్యం (3) అధ్యాత్మ సంజ్ఞితం - ఈ విధమైన విశిష్ట జ్ఞానబోధను శ్రీకృష్ణుడు అర్జుననికి అనుగ్రహించాడు.

**పరమం** అంటే ఉత్తమ మైనది, చాలా గొప్పది, నిరతిశయ మైనది అని అర్థం ***(పరమం నిరతిశయం).*** భగవంతుడు బోధించిన పరమ వాక్యం ప్రమాణ సహితం. అది విశ్వాసానికి సంబంధించింది కాదు. జ్ఞానమును ప్రసాదించేది. రెండవ అధ్యాయంలో ***అశోచ్యా నన్వ శోచస్త్వం*** అనే శ్లోకము నుండి ఆరవ అధ్యాయం సమాప్తం వరకు గీతాచార్యుడు బోధించిన వచనము ***(ఉక్తం వచః).*** 'త్వం' పద వ్యాఖ్యానము, అర్జునుని లోని అవివేకాన్ని నిర్మూలించి ***(అవివేక బుద్ధిః అపగతా),*** వివేకాన్ని ప్రసాదించింది.

గీతాచార్యుడు బోధించిన ఈ పరమ వచనానికి **గుహ్యం** అనే రెండవ విశేషణాన్ని జోడించాడు పార్థుడు. 'గుహ్యము' అంటే రహస్య మైనది అని అర్థం ***(గుహ్యం గోప్యం).*** రహస్యము అంటే అందుబాటులో లేనిది, దాచబడినది అని అర్థం కాదు. బహిరంగంగా ప్రవచించినా అర్థం కానిది, శిక్షణ యోగ్యులైన అధికారులకు మాత్రమే అర్థ మయ్యేది అని భావం.

పరమము, గుహ్యము అయిన శ్రీకృష్ణ వచనానికి **అధ్యాత్మ సంజ్ఞితం** అనేది అర్జునుడు జోడించిన మూడవ విశేషణము. 'అధ్యాత్మ సంజ్ఞితము' అంటే ఆత్మజ్ఞాన విషయము. ఆత్మానాత్మ వివేకానికి సంబంధించిన

విషయ మని అర్థము ***(అధ్యాత్మ సంజ్ఞితమ్ ఆత్మానాత్మ వివేక విషయం).*** ఈ విధమైన ఆత్మవిద్యా విషయాన్ని బోధించి శ్రోతమైన అర్జునుని అనుగ్రహించాడు వక్త యైన వాసుదేవుడు. ఇంతవరకు సాగిన గీతాబోధ ఫల మేమిటి?

### శ్రోత చూసిం దేమిటి?

శ్రీకృష్ణుని బోధ వల్ల అర్జునునికి ఒరిగిం దేమిటి? భగవద్వచన ప్రభావం చేత ***(యత్ త్వయా ఉక్తం వచః వాక్యం తేన వచసా)*** నా మోహం నశించింది అంటున్నాడు అర్జునుడు ***(మోహః అయం విగతః మమ అవివేక బుద్ధిః అపగతా ఇత్యర్థః).*** ఇది అర్జునుడు చూచిన ఫలితం. అందుకున్న ఫలం. ఆత్మానాత్మ వివేక జ్ఞానం స్థిర పడటం చేత, అనాత్మ సంబంధంతో ఏర్పడిన మోహం తొలగి పోయింది.

నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖిని, నేను దుఃఖిని అనే మోహం నశించింది. ఈ ప్రపంచం సత్యము, స్వతంత్ర మనుగడ కలది అనే అవివేకము అంతరించింది. ఈ ప్రపంచములో ఉన్న వన్నీ పరమేశ్వరుని కన్నా అన్యంగా ఉన్నాయి అనే మోహాంధకారం పటాపంచ లైంది. ఇదే మోహ నాశము. శ్రోతకు లభించిన ప్రమాణ ఫలం.

### మోహం సమూలంగా నశించినట్లేనా?

మోహం పోయింది ***(విగతః)*** అంటున్నాడు అర్జునుడు. ఇంతకీ అర్జునుని మోహము సమూలంగా నశించినట్లేనా? మోహం నశిస్తే, గీత ఇక్కడ సమాప్తం కావాలి కదా? మోహ క్షయమే కదా మోక్షము!

మోహం పోయింది అని అర్జునుడు చెబుతున్న మాటల్లో సత్యము లేక పోలేదు. అలాగని పూర్ణ సత్యం ఆవిష్కరింప బడిందని నేను భావించడం లేదు. మోహం కొంత వరకు తొలగిన మాట వాస్తవమే. అంత మాత్రాన పూర్ణజ్ఞానం కలిగిందని భావించ లేము. పూర్ణ జ్ఞానికి విశ్వరూపాన్ని దర్శించాలనే కోరిక పుడుతుందా? విశ్వరూపాన్ని సందర్శించే సమయంలో భయం కలుగుతుందా? ఈ కోరిక, భయం - వీటిని ఎలా అర్థం చేసుకోవాలి?

భగవద్గీత పూర్వార్థం సమాప్తమైన ఈ సందర్భంలో మోహం తొలగింది అంటున్నాడు. బాగుంది. కాని, గీత సంపూర్ణ మైనపుడు కూడా ఇదే మాట అన్నాడు అర్జునుడు *(18 వ అ - 73 వ శ్లో).*

ఇంతకీ మోహం ఇక్కడ పోయిందా? లేక, అక్కడ పోయిందా? ఇక్కడే పోయి ఉంటే, గీత అక్కడి దాకా ఎందుకు కొనసాగుతుంది? పైగా ఇక్కడ అర్జునుడు 'మోహం తొలగింది' అని మాత్రమే అన్నాడు. అక్కడేమో, 'మోహం నశించింది' ***(నష్టో మోహః),*** 'స్మృతి కలిగింది' ***(స్మృతి లబ్ధా),*** 'సందేహాలు తొలగి పోయాయి' ***(గత సందేహః)*** అని అన్నాడు. ముఖ్యంగా, 'నీ మాటను ఆచరిస్తాను' ***(కరిష్యే వచనం తవ)*** అని కూడా అన్నాడు.

దీనిని బట్టి చూస్తే, పదకొండవ అధ్యాయం లోని ప్రస్తుత శ్లోకంలో మోహం పోయినట్లు అర్జునుడు చెబుతున్నా, సంపూర్ణంగా పోయినట్లు కాదని అర్థమౌతూ ఉంది. దీనికి ఇంతగా వ్యాఖ్యానం అవసరం లేదు. మోహం పూర్ణంగా నశించి ఉంటే, గీతాచార్యుడే సమాప్తంలో ప్రశ్నించినట్లు ఇక్కడ కూడా ప్రశ్నించి ఉండేవాడు.

అర్జునా! గీతను చక్కగా విన్నావు కదా! అజ్ఞానం చేత ఏర్పడిన నీ మోహం నశించిందా? అని గీతను సమాప్తం చేస్తూ అక్కడ స్పష్టంగా అడిగాడు ***(కచ్చి దజ్ఞాన సమ్మోహః ప్రణష్టస్తే ధనంజయ!).*** కానీ ఇక్కడ శ్రీకృష్ణుడు అలా ప్రశ్నించ లేదు అంటే, ఆయనకు తెలుసు, అర్జునునిలో మోహం ఇంకా సమూలంగా నశించ లేదని.





వ్యాధిగ్రస్తుడైన వ్యక్తికి వైద్యుడు సరియైన చికిత్సను చేస్తూ ఉంటే, రోజు రోజుకీ రోగిలో అనారోగ్య చిహ్నాలు తగ్గుతూ ఆరోగ్య లక్షణాలు వృద్ధి చెందుతూ ఉంటాయి. అంతమాత్రాన, రోగి సంపూర్ణ ఆరోగ్యవంతుడని చెప్పలేము. చికిత్స పూర్తి అయిన తరువాతే రోగి సంపూర్ణ ఆరోగ్యవంతు డవుతాడు.

అరుణోదయానికి ముందు నుండే కొద్ది కొద్దిగా వెలుగులు తొంగి చూస్తూ ఉంటాయి. సూర్యోదయం కాబోతోంది అనే సందేశ కిరణాలు కదుల్తాయి. అంతమాత్రం చేత దానినే సూర్యోదయం అని భావించ లేము. అరుణోదయంలో చీకట్లు పలచ బడుతూ ఉంటాయి కనుక, కొంత స్పష్టత ఏర్పడుతుంది. అలాగని అస్పష్టత పూర్తిగా లేకుండా పోదు. ఎక్కడ అస్పష్టత అనేదే ఉండదో, దివ్య వెలుగులతో స్పష్టత గోచరిస్తూ ఉంటుందో, అదే సంపూర్ణ సూర్యోదయము. మోహ నాశము అనేది అర్జునునిలో ప్రస్తుతం పాక్షికంగా జరిగినా, ముమ్ముందు సంపూర్ణ జ్ఞానోదయం కలుగుతుంది అనడానికి ఇది సుస్పష్టమైన సంకేతము.

**భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా ।**
**త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్ ॥** 2

**భవాప్యయౌ-హి-భూతానాం-శ్రుతౌ-విస్తరశః-మయా**
**త్వత్తః-కమలపత్రాక్ష-మాహాత్మ్యం-అపి-చ-అవ్యయం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| కమలపత్రాక్ష | = | శ్రీకృష్ణా! | అవ్యయం | = | నాశరహితమైన |
| త్వత్తః | = | నీ వలన | మాహాత్మ్యం అపి చ | = | మాహాత్మ్యము గూడ |
| భూతానాం | = | భూతముల | విస్తరశః | = | విస్తారముగా |
| భవాప్యయౌ | = | ఉత్పత్తి నాశములు | మయా | = | నా చేత |
| తే | = | నీ యొక్క | శ్రుతౌహి | = | ఆలకించ బడింది కదా! |

**కమలదళ లోచనా! కృష్ణా! భూతముల ఉత్పత్తి ప్రళయాలు సవిస్తరంగా నీ నుండి విన్నాను. అక్షయమైన నీ మాహాత్మ్యాన్ని కూడా ఆలకించాను.**

**వ్యాఖ్య**

'త్వం' పదాన్ని నిర్ణయిస్తూ ఆరవ అధ్యాయం చివరి వరకు భగవానుడు ప్రవచించిన గుహ్యమైన, పరమోత్తమ మైన వాక్యాన్ని ఆలకించి, మోహాన్ని పోగొట్టుకున్నట్లు ఈ అధ్యాయం మొదటి శ్లోకంలో చెప్పిన పార్థుడు, ఏడవ అధ్యాయం నుండి పదవ అధ్యాయం వరకు 'తత్' పదాన్ని నిర్దేశిస్తూ, జీవుల ఉత్పత్తి స్థితి లయాలు, మరియు అక్షయమైన భగవ దైశ్వర్యమును గూర్చి పరమేశ్వరుడు విస్తరించి ప్రవచించిన విషయమును కూడా ఆలకించినట్లు ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు. అంతేకాదు, తాను సవిస్తరంగా విన్నట్లు చెప్పిన విషయా న్నంతా సంక్షేపంగా ఈ రెండు శ్లోకాల లోనే చెప్పేశాడు కూడా.

అవ్యక్తాన్ని గూర్చి, వ్యక్తాన్ని గూర్చి తాను సంగ్రహంగా శ్రవణం చేసినట్లు చెబుతున్నాడు. పరమాత్మ యొక్క పరిమితమైన రూపం వ్యక్తమైన విశ్వమైతే, విశ్వము యొక్క అవ్యయమైన తత్త్వమే అవ్యక్త పరబ్రహ్మము.

ఉత్పత్తి ప్రళయాలు జరుగుతున్నా, పరమాత్మ యందు ఏ విధమైన వికారము లేదు. సర్వ కర్మలు పరమేశ్వరుని కారణం గానే జరుగుతూ వున్నా, తాను వాటికి అంటకుండా అసంగుడై శోభిస్తున్నాడు. కర్మఫల ప్రదాత తానే అయినా, రాగద్వేషాలకు అతీతంగా భాసిస్తూ, అందరి విషయంలో సముడై ఉన్నాడు. ఇదంతా ఆయన మాహాత్మ్యము. అక్షయ వైభవము. ఈ వైభవ విషయాన్ని కూడా సంగ్రహంగా పరమేశ్వరుని నుండి

ఆలకించినట్లు అర్జునుడు చెబుతున్నాడు. పరమేశ్వరుడు ప్రబోధించిన అసమాన అద్భుత జ్ఞానవైభవాన్ని తలచుకొని పులకాంకితుడై, పరమేశ్వరుని **కమల పత్రాక్ష!** అని భావ స్పందనతో, జ్ఞాన స్పృహతో సంబోధిస్తున్నాడు.

కమలపత్రము అంటే కమలము యొక్క రేకు ***(కమలస్య పత్రం కమల పత్రం).*** అటువంటి నేత్రాలు కల వాడు కమల పత్రాక్షుడు. కమలదళ లోచనుడు. పుండరీకాక్షుడు. పరమేశ్వరుడు.

కమలదళాలు విశాలంగా ఉంటాయి. అతిశయించిన సౌందర్యముతో శోభిస్తూ ఉంటాయి. కనుక, పరమేశ్వరుడు బోధించిన విషయం కూడా నిరతిశయ మైన జ్ఞానంతో విస్తారంగా ఉంది అనే ధ్వని కూడా ఇక్కడ వినపడుతోంది. **కమల పత్రాక్ష** అనే సంబోధనలో ప్రస్తుత కమల పత్రము విరజిమ్మే విలక్షణమైన సంస్కృత పరిమళాన్ని శ్రీశంకరానందీయ తాత్పర్యబోధిని ఉటంకించింది. ఆ పరిమళాలను కూడా ఆఘ్రాణిద్దాం.

***కం బ్రహ్మ సుఖం స్వరూపానంద స్తం అలతి ప్రకాశయతీతి కమలం ఆత్మజ్ఞానం, త దేవ పతనాత్త్రాయత ఇతి పత్రం, కమలం చ త త్పత్రం చ కమల పత్రం తేన అక్ష్యతే ప్రాప్యత ఇతి కమల పత్రాక్షః!***

***కం*** అంటే బ్రహ్మ సుఖము. స్వరూపానందము. దానిని ***అలతి.*** అంటే ప్రకాశింప చేసేది కమలము, అంటే ఆత్మజ్ఞానము లేదా బ్రహ్మజ్ఞానము.

***పత్రం*** అంటే పతనం కాకుండా రక్షించేది అని అర్థం ***(పతనాత్ త్రాయతే).*** అంటే, సంసారములో పడకుండా రక్షించేది. అదే ఆత్మజ్ఞానము. ఆత్మజ్ఞాన మనే కమలము యొక్క పత్రము జీవుణ్ణి సంసారంలో పడకుండా కాపాడుతుంది. అట్టి కమల పత్రము, అంటే ఆత్మజ్ఞానము చేత పొందబడే వాడు ***(తేన అక్ష్యతే)*** కనుక భగవంతుడు కమల పత్రాక్షుడు. ఆత్మజ్ఞానము చేతనే పొందబడే వాడు. అట్టి జ్ఞానాన్ని 'త్వం' పద 'తత్' పద నిర్ణయ వాక్యాల ద్వారా శ్రీకృష్ణుడు సవిస్తరంగా ప్రవచిస్తే, తాను శ్రవణం చేసినట్లు ఆనందాన్ని వ్యక్తం చేశాడు అర్జునుడు.

*ఒక వైపు తన మోహం తొలగింది అని చెబుతూనే, మరో వైపు తనలో ఏదో కోరిక కదులుతూ ఉన్నట్లు కూడా విన్నవించుకుంటున్నాడు. అదేమిటో విందాం!*

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర ।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ ॥ 3

***ఏవం-ఏతత్-యథా-ఆత్థ-త్వం-ఆత్మానం-పరమేశ్వర***
***ద్రష్టుం-ఇచ్ఛామి-తే-రూపం-ఐశ్వరం-పురుషోత్తమ***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరమేశ్వర | = | కృష్ణా! | పురుషోత్తమ | = | కృష్ణా! |
| ఆత్మానం | = | నిన్ను గురించి | తే | = | నీ యొక్క |
| యథా | = | ఏ ప్రకారముగ | ఐశ్వరం | = | ఈశ్వర సంబంధమైన |
| త్వం | = | నీవు | రూపం | = | రూపమును |
| ఆత్థ | = | చెప్పితివో | ద్రష్టుం | = | చూచుటకు |
| ఏవం ఏతత్ | = | ఇదంతా | ఇచ్ఛామి | = | కోరుకుంటున్నా |

**పరమేశ్వరా! పురుషోత్తమా! నిన్ను గూర్చి నువ్వు చెప్పిన దంతా విన్నాను. నీ స్వరూపాన్ని అలాగే చూడాలని కోరుకుంటున్నాను.**





**వ్యాఖ్య**

ఈ సమస్త జగత్తు యొక్క ఉత్పత్తి స్థితులకు పరమేశ్వరుడే కారణ మని *(10 వ అ - 8 వ శ్లో)*, ఈ విశ్వమంతా పరమేశ్వరుని ఒక అంశము చేతనే నిలిచి ఉందని *(10 వ అ - 42 వ శ్లో)*, ఏ జ్ఞానము నైతే గీతాచార్యుని నుండి శ్రవణం చేశాడో, దానిని చూడాలని అర్జునుడు ప్రస్తుతం ఉత్సాహ పడుతున్నాడు.

చూడాలి అని అర్జునుడు ఎందుకు అనుకుంటున్నాడు? శ్రీకృష్ణుడు చెప్పిన విషయంపై నమ్మకం లేక చూచి నిర్ధారణ చేసుకోవాలి అనుకుంటున్నాడా? అలా కాదని తానే చెబుతున్నాడు.

'పరమేశ్వరా! నిన్ను గూర్చి ఏదైతే నువ్వు ప్రవచించావో, అది అలాగే ఉంటుంది గాని, మరొక విధంగా ఉండదు ***(ఏవమ్ ఏతత్, న అన్యథా).*** ఈశ్వరుడు, ఈశ్వరజ్ఞానం వేరు కావు. స్వరూపము, స్వరూపజ్ఞానము భిన్నం కావు. నిన్ను గూర్చి అద్భుతంగా ఆలకించాను. ఇప్పుడు ఆ అద్భుత రూపాన్ని చూడాలని ఆశ పడుతున్నా. అంతేగాని, నీ మాటపై శ్రద్ధ లేక కాదు'.

మనం కూడా ఏదైనా ఒక విషయాన్ని గూర్చి గొప్పగా విన్నప్పుడు, దానిని చూడాలి అనుకుంటాం. ప్రదేశాన్ని గూర్చి వింటాం. ఆ తరువాత ఆ ప్రదేశానికి వెళ్ళి చూస్తాం. రుచిని గూర్చి వింటాం. ఆ తరువాత రుచి చూస్తాం. బదరీనాథ్‌ను గూర్చి వింటాం. తరువాత ఆసక్తితో వెళ్ళి చూస్తాం. ఇదీ అంతే.

***ఏకాంశేన స్థితో జగత్*** అని దేని నైతే పరమేశ్వరుడు బోధించాడో, దానిని అలాగే, ఉన్న దున్నట్లుగా పరమేశ్వరునిలో దర్శించాలి అనేది అర్జునుని ఆకాంక్ష ***(ద్రష్టుం ఇచ్ఛామి).*** అంతేగాని, భగవంతుని మాటపై విశ్వాసం లేక కాదు.

ఎవరు దేనిని అర్థం చేసుకున్నా, తమ అనుభవం నుండే అర్థం చేసుకుంటారు. నా దగ్గర అది ఉంది, ఇది ఉంది, లేదా నా జేబులో ఇంత డబ్బు ఉంది అని మిత్రుడు చెప్పి నపుడు, ఏదీ చూపించు! అని మనం నమ్మకం లేక అడుగుతూ ఉంటాం.

ప్రేమ గల కుటుంబాలలో ఇప్పటికీ, భార్య భర్తకు భోజనం వడ్డిస్తూ, చివరగా రుచికర మైన తీపి పదార్థాన్ని మరి కొంచెము ఆరగించమని ఒత్తిడి చేస్తుంది. అప్పుడు భర్త 'అంతా నాకే పెట్టేస్తే, మరి నీకో?' అంటాడు. 'నాకూ ఉంది లెండి!' అంటుంది భార్య. 'ఏదీ, తెచ్చి చూపించు!' అంటాడు భర్త ఆప్యాయతతో.

ఇలాంటి సన్నివేశాలలో, అది ప్రేమ కావచ్చు, లేక చనువు కావచ్చు, ఏదో కొంత నమ్మలేని తనము చోటు చేసుకొని ఉంటుంది. అలాగే, భగవంతుడు బోధించిన తత్త్వాన్ని చూడాలని భావించడం వెనుక అర్జునునిలో కూడా ఏదో ఓ మూల కొంత అపనమ్మకం ఒదిగి ఉందేమో అని మన అనుభవాలు శంకిస్తాయి. అంతేగాని, అర్జునునికి మాత్రం ఏ విధమైన సందేహమూ లేదు.

'పురుషోత్తమా! నీ మాట సత్యము. ఆ విషయంలో నాకు అశ్రద్ధ లేదు. నీ మాటను పరీక్షించే సామర్థ్యం నాకు ఉంటుందా? నేను నీ భక్తుణ్ణి. ఈ సృష్టికి ఉత్పత్తి స్థానం నీవే నని, ఈ సమస్త జగత్తు నీ వల్లనే నడుస్తూ ఉందని, ఈ విధంగా తెలుసుకున్న భక్తులు నిన్నే భజిస్తూ ఉంటారని చెప్పావు కదా *(10 వ అ - 8 వ శ్లో)*! నేనూ అలాగే భక్తి చేయాలి అనుకుంటున్నా! కనుకనే, నీ దివ్య రూపాన్ని దర్శించాలని ఆశ పడుతున్నా! నా అదృష్టానికి పొంగిపోతూ, నా బ్రతుకును కడతేర్చుకోవా లని అడుగుతున్నా! నీ లాంటి దైవం దొరికి నందుకు పరవశిస్తూ ప్రార్థిస్తున్నా!' అంటున్నాడు. నిజమే. ఇదే అర్జునుని ఆంతర్యం.

అవ్యక్తమైన పరమేశ్వర స్వరూపాన్ని అర్థం చేసుకోవడానికి వ్యక్తమైన రూపమే కదా ఆధారం! శ్రీకృష్ణుడు బోధించిన సత్యజ్ఞానానంద స్వరూపమైన పరతత్త్వాన్ని పార్థుడు ఆలకించాడు. అలాగే సృష్టి స్థితి లయాలలో

శోభిస్తున్న ఈశ్వర వైభవాన్ని కూడా అర్జునుడు శ్రవణం చేశాడు. శ్రవణం చేశాడు అంటే, అర్థం చేసుకున్నాడు అని భావం. అందుకే పరమేశ్వరుని మాట సత్యమని భావిస్తున్నాడు ***(ఏవమ్ ఏతత్).*** ఈ విషయంలో ఇక విశ్వాస అవిశ్వాసాలకు చోటెక్కడుంది? అర్థమైంది కనుకనే సత్యంగా అభివర్ణిస్తున్నాడు. అర్జునుడు అర్థం చేసుకున్నాడు. అచ్యుతుడు అర్జునునికి అర్థ మయ్యేలా బోధించాడు. ఇది కేవలం జ్ఞానానికి సంబంధించిన విషయం. కనుకనే, ప్రస్తుత శ్లోకంలో శ్రీకృష్ణుని ***పరమేశ్వరా! పురుషోత్తమా!*** అంటూ భావగర్భితమైన పలుకులతో సంబోధించాడు విజయుడు.

'హే పరమేశ్వరా! ఏ విధంగా ***(యథా)*** నీవు ***(త్వం)*** చెబుతున్నావో, ***(ఆత్థ)*** అది అలాగే ఉంటుంది ***(ఏవమ్ ఏతత్)'*** అంటూ జ్ఞానం విషయంలో తన కున్న స్పష్టతను విశదం చేశాడు. నిరుపాధికమైన బ్రహ్మ స్వరూపము, సోపాధిక మైన ఈశ్వర వైభవము అంటూ భగవంతుడు బోధించిన విషయమును సమగ్రంగా తాను అర్థం చేసు కున్నట్లు **పరమేశ్వర** సంబోధనము ద్వారా వ్యక్తం చేస్తున్నాడు.

***పరమశ్చ అసౌ ఈశ్వరశ్చ పరమేశ్వరః.*** ఇక్కడ 'పరమః' అంటే స్వరూప వైభవము ***(సర్వాతిశయ మహత్వాత్ పరమః).*** 'ఈశ్వరః' అంటే సర్వజ్ఞత్వ సర్వ వ్యాపకత్వాదులు గల సోపాధిక ఈశ్వర తత్త్వము ***(సర్వ వ్యాపృతి హేతుత్వాత్ ఈశ్వరః).*** కనుక, ***పరమేశ్వర*** అని సంబోధిస్తూ 'నిరుపాధిక స్వరూప వైభవము, సోపాధిక ఈశ్వర వ్యాపకత్వము, రెండూ కలిగిన ఓ స్వామీ!' అంటూ తనకు అర్థమైన జ్ఞానాన్ని సంబోధనము లోనే వ్యక్తపరచాడు సవ్యసాచి. అలాగే **పురుషోత్తమ** సంబోధన కూడా.

***పురుషశ్చ అసౌ ఉత్తమశ్చ పురుషోత్తమః. పురుషః*** అంటే, ఈ ప్రపంచ మంతా పూరించి యున్న సోపాధిక మైన ఈశ్వరుడు. ***ఉత్తమః*** అంటే, క్షరాక్షరములకు అతీతుడైన నిరుపాధిక పరబ్రహ్మము *(15 వ అ -18 వ శ్లో).* ఈ విధంగా సోపాధిక నిరుపాధిక స్వరూపాలను భగవంతుని ద్వారా ఆలకించి, అర్థం చేసుకున్న అర్జునుడు, పరమేశ్వరునిలో ఏకాంశమై నిలిచి యున్న విశ్వాన్ని వీక్షించాలని భక్తితో అర్థిస్తున్నాడు. ప్రార్థిస్తున్నాడు.

*అర్థించడ మైతే చేశాడు. మరి అచ్యుతుడు అనుగ్రహిస్తాడా? అడగడానికి అర్హత ఎందుకు? అనుగ్రహాన్ని పొందడానికే అర్హత ఉండి తీరాలి. ఇంతకీ, తనకు అర్హత ఉందా? అచ్యుతుడు విశ్వరూప దర్శనాన్ని అనుగ్రహిస్తాడా? ఏమో! ఏదో ఓ మూల అర్జునుని హృదయంలో సందేహం ఉన్నట్లు అనిపిస్తోంది. అదే తరువాత శ్లోకం.*

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో ।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్ ॥ 4

***మన్యసే-యది-తత్-శక్యం-మయా-ద్రష్టుం-ఇతి-ప్రభో***
***యోగేశ్వర-తతః-మే-త్వం-దర్శయ-ఆత్మానం-అవ్యయం***

ప్రభో = ప్రభూ!
మయా = నా చేత
తత్ = ఆ స్వరూపము
ద్రష్టుం = గాంచుటకు
శక్యం ఇతి = సాధ్యమని
మన్యసే యది = నీకు అనిపిస్తే
యోగేశ్వర = యోగేశ్వరా!
తతః = ఆ కారణంగా
త్వం = నీవు
మే = నా కొరకు
అవ్యయం = నిత్యమైన
ఆత్మానం = ఆత్మస్వరూపమును
దర్శయ = చూపించు





**ప్రభూ! నీ స్వరూపాన్ని చూడటం నాకు సాధ్యమని నీ కనిపిస్తే, యోగేశ్వరా, అక్షయమైన నీ రూపాన్ని నాకు చూపించు.**

**వ్యాఖ్య**

విశ్వంలో అనేక విషయా లున్నాయి. అనేకానేక రూపా లున్నాయి. సమస్త విషయాలతో, రూపాలతో కూడిన విశ్వము ఒకే రూపంలో ఎలా ఒదిగి ఉందో గీతాచార్యుడు బోధించగా అర్జునుడు శ్రద్ధతో శ్రవణం చేశాడు. తాను శ్రవణం చేసిన విషయం సత్యమని నిర్ధారణ చేసుకున్నాడు. ఏదయితే విని తృప్తి చెందాడో, దానిని చూచి సంతృప్తి చెందా లనుకున్నాడు. శ్రవణం కన్నా దృశ్యం యొక్క ప్రభావము గొప్పది కదా! ఆడియో కన్నా వీడియో ప్రాధాన్యతే ఎక్కువ కదా! అందుకనే, సమస్త విశ్వాన్ని ఈశ్వరునిలో దర్శించాలని అభిలషించి అచ్యుతుని అర్థించాడు.

**ఆశలు - అర్హతలు**

ఆశలు అందరికీ ఉంటాయి. కాని, అర్హతలే అందల మెక్కిస్తాయి. ఎవరైనా దేనినైనా ఆశించవచ్చు. అలాగని ఆశించిన వారందరు అందుకోగల రని చెప్పలేము. కాని, అర్హత ఉన్న వారికి ఆశించినది అందకుండా ఎవ్వరూ దూరం చెయ్యలేరు.

కృష్ణా! నీ విశ్వరూపాన్ని నాకు చూపించు! అని అర్జునుడు అర్థించాడు. ఇది ఆశ. తప్పు లేదు. కాని, దానిని చూడటానికి తాను అర్హుడేనా? ఈ సందేహం అర్జునునికే కలిగింది.

స్వామీ! నీ కృప అపారము. నీ దయ అనంతము. నువ్వు నీ నిర్హేతుక కటాక్షంతో నన్ను అనుగ్రహించ వచ్చు. అలాగని దానిని అందుకొని నిలబెట్టుకొనే సామర్థ్యం నాకు ఉండాలి కదా! విశేష కృపను చూపి సముద్ర జలాలు వచ్చి చెరువులో పడినా, చెరువు సాగర జలాలను నిలుపుకోగలదా!

భగవాన్! దివ్యమైన నీ రూప వైభవాన్ని నువ్వు చూపించ వచ్చు. అలాగని చూచే సామర్థ్యం నాకు ఉండాలి కదా! అంత శక్తి నా కుందా? నీ రూపాన్ని దర్శించే అర్హత నా కుందా? అర్జునుడు ఏదో అవుతున్నాడు.

నిజమే. అర్జునుడికి ఆ శక్తి లేదు. చూచే సామర్థ్యం లేదు. తన అర్హత ఏపాటిదో అర్జునునికి తెలియనిది కాదు. తనలో ఉన్న వాటినే తాను చూడలేడు. ఇక భగవంతునిలో ఉన్న సమస్తాన్ని ఎలా చూడగలడు?

తన గుండెను తాను చూడలేడు. తన కాలేయం ఎలా ఉందో తనకు తెలియదు. తన మనస్సులో ఏం జరుగుతూ ఉందో తనకే అర్థం కాదు. అలాంటి వాడు పరమేశ్వరునిలో ఉన్న సమస్తాన్ని ఎలా వీక్షించగలడు? తన కళ్ళు ఎంత దూరం చూడగలవు? తన చెవులు ఎంత శబ్దాన్ని వినగలవు? తన మనస్సు యొక్క ఊహాశక్తి ఏపాటిది? తమ పరిమితాలు తమకు తెలియని వారెవరు? ఈ విషయంలో అర్జునుడు విలక్షణు డెలా అవుతాడు? అందుకే, తలెత్తి నడవలేని చోట, తల వంచి ముందుకు సాగడం యుక్త మని భావించాడు అర్జునుడు. వినయం తోనే విజయం సాధ్యం అనే సత్యాన్ని గుర్తించిన విజయుడు, వాసుదేవుని వినమ్రుడై ప్రార్థిస్తున్నాడు.

ప్రభో! ***తత్ మయా ద్రష్టుం శక్య మితి మన్యసే యది*** - నీ స్వరూపమును దర్శించే సామర్థ్యం నాకు ఉందని నీ కనిపిస్తే హే, యోగేశ్వరా! ***తే ఐశ్వరం రూపం ద్రష్టు మిచ్ఛామి*** - ఈశ్వర సంబంధమైన నీ దివ్య రూపాన్ని దర్శించాలని నేను అభిలషిస్తున్నాను అన్నాడు అర్జునుడు.

అర్జునుడు అభ్యర్థించి నంత మాత్రాన శ్రీకృష్ణుడు చూపాలని ఎక్కడుంది? విషయాన్ని మార్చి, ప్రవచనాన్ని

విస్తరించుకుంటూ పోవచ్చు కదా! తనకు ఇష్ట మైనదే అయినా, అది కృష్ణుడికి ఇష్ట మైనపుడే తనకు సిద్ధిస్తుందనేది అర్జునునికి తెలుసు.

ఇక్కడ మరొక ఆసక్తికర మైన విషయ ముంది. అర్జునుడికి అర్హత ఉందనే అనుకుందాం. అంత మాత్రాన శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని ప్రదర్శించాలనే నియమ మెక్కడుంది? తన స్వరూపాన్ని చూపించడం లేదా చూపించక పోవడం అనేది శ్రీకృష్ణుని ఇష్టంపై ఆధారపడి ఉంది.

శ్రీకృష్ణుడు చూపించ కూడదు అనుకుంటే, అర్జునుని అర్హత అడవి కాసిన వెన్నెలే అవుతుంది. ఒకవేళ అర్జునుని అనుగ్రహించి, అతని చేత దర్శింప చేయించాలని శ్రీకృష్ణుడు భావిస్తే, ఆ తరువాత దానిని నివారించే శక్తి ఎవ్వరికీ లేదు. ఆ స్థితిలో శోభించేది శ్రీకృష్ణుని అనుగ్రహమే గాని అర్జునుని అర్హత కాదు. అర్హత లేకపోయినా, అర్జునుణ్ణి అదృష్టం వరించ వచ్చు. కనుకనే, ఈ రహస్య మెరిగిన విజయుడు వినమ్రుడై తల వంచాడు. ప్రభూ! అంటూ శరణాగతు డయ్యాడు. యోగేశ్వరా! అంటూ భారాన్నంతా భగవంతుని భుజాలపై మోపాడు.

కృష్ణా! నువ్వు ప్రభువు. నేను సేవకుణ్ణి. నువ్వు నా స్వామివి. నేను నీ దాసుణ్ణి. దాసుణ్ణి ప్రభువు కరుణించక పోతే మరెవరు కరుణిస్తారు? నేను నీ వాణ్ణి. నన్ను కరుణించి నీ దివ్య రూపాన్ని దర్శింప చెయ్యి. అర్హతలను మరచిపో!

*పల్లవి:* **గానలోల! కరుణాలవాల!**
**గాచి బ్రోవు నిరుపమ గుణశీల** ॥ గాన ॥

*చరణము:* **ఉపచారములు నేర్వని వారము**
**అపచారములే ఎరిగిన వారము**
**అర్హత లేవియు పొందని వారము**
**సారము లేని మేము నీ వారము** ॥ గాన ॥

అని అర్జునుని ఆంతర్యానికి అద్దం పట్టింది చైతన్య గీతిక.

కృష్ణా! ఒకవేళ, అదేం కుదరదు, అర్హత లేని వారికి సాధ్యం కాదు అంటావేమో! చూచే శక్తి నాకు లేకపోతే పోనీ. చూడగల సమర్థుణ్ణి కాకపోతే పోనీ. నన్ను సమర్థుణ్ణి చేసి చూపించ గల సామర్థ్యం నీకు ఉంది కదా! అది చాలు. నేను సామాన్యుణ్ణే కావచ్చు. ప్రభూ! నువ్వు సర్వ శక్తిమంతుడివి. అసమాన తేజోవంతుడివి. యోగేశ్వరుడివి ***(యోగానాం ఈశ్వరః యోగేశ్వరః).*** నిన్ను దర్శించడానికి యోగులే అర్హులని నువ్వు భావిస్తే, అలాగే కానీ, ఏమైంది? నీ దాసుణ్ణైన నన్ను నీ యోగబలం చేత యోగిగా మార్చి నీ దివ్య రూపాన్ని దర్శించే బలాన్ని, భాగ్యాన్ని నాకు ప్రసాదించు!

*ఏమో! చెప్పవలసిందంతా పార్థుడు బుద్ధిగా చెప్పేశాడు. ఇక పార్థసారథి ఏం చెబుతాడో చూడాలి.*

**శ్రీ భగవానువాచ :**

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః । 5
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ ॥

***పశ్య-మే-పార్థ-రూపాణి-శతశః-అథ-సహస్రశః***
***నానావిధాని-దివ్యాని-నానావర్ణాకృతీని-చ***





| | | | |
|---|---|---|---|
| పార్థ | = అర్జునా! | శతశః | = వందల కొలది |
| మే | = నా యొక్క | అథ | = ఇంకను |
| నానావిధాని | = అనేక విధములైన | సహస్రశః | = వేలకొలది |
| నానావర్ణాకృతీని | = అనేకములైన రంగులు, రూపములు గల | రూపాణి | = రూపాలను |
| దివ్యాని చ | = దివ్యములైన | పశ్య | = చూడు! |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**పార్థా! చూడు! శతవిధాల, సహస్ర విధాల శోభించే నా రూపాలు చూడు! ఆ రూపాలు అనేక విధాలు. దివ్యమైన రూపాలు. అనేక రంగులతో ఉంటాయి. అనేక ఆకారాలలో ఉంటాయి. అవన్నీ చూడు!**

**వ్యాఖ్య**

భగవంతుని విశ్వరూపాన్ని దర్శించే అదృష్టం తనకు ఉందో లేదో అనే సంశయాన్ని హృదయంలో దాచుకొని, ఈశ్వర సంబంధమైన దివ్యరూప దర్శనాన్ని అనుగ్రహించి తనను కృతార్థుణ్ణి చేయవలసిందిగా వినమ్రుడై గీతాచార్యుని ప్రార్థించాడు పార్థుడు.

అర్జునుడి సంశయాన్ని సమూలంగా తుడిచి పెట్టేస్తూ, హృదయానందంతో అర్జునుడు ఉప్పొంగి పోయేటట్లు, 'పార్థా! చూడు!' అంటూ భగవంతుడు తన దివ్యవాణిని వినిపించాడు.

**పశ్య** అనే పదంతో శ్లోకం ఆరంభమైంది. **పశ్య** అంటే 'చూడు' అని అర్థం. అర్జునుడు విశ్వరూపాన్ని దర్శించడానికి అర్హుడే నని అచ్యుతుడు ఈ మాటలో చెప్పకనే చెప్పేశాడు.

ప్రస్తుతం 'చూడు' అంటూ ఉన్నాడే గాని ఇంకా చూపడం లేదు. 'చూడు' అంటే, ఇక చూడబోతావు అని అర్థం. అర్జునుడు ఏవేవి చూడబోతాడో చెబుతూ, అర్జునుని ఉత్సాహాన్ని వృద్ధి చేస్తున్నాడు.

***శతశః సహస్రశః మే రూపాణి పశ్య!*** - 'అర్జునా! వందల కొలది, వేల కొలదిగా ఉన్న నా రూపాలను చూడు!' అంటున్నాడు. విశ్వరూపంలో అర్జునుడు అసంఖ్యాకము లైన రూపాలను చూడబోతాడు అని ముందే తెలిసి పోయింది. అవి కూడా ఒక విధంగా ఉండేవి కావు. అనేక విధాలుగా ఉంటాయట **(నానా విధాని).** కేవలం ఈ లోకంలో కనిపించే ప్రాకృతములే కావు. ఇతర లోకాలలో ఉండే అప్రాకృతాలను **(దివ్యాని)** కూడా చూడబోతాడట అర్జునుడు. వివిధ వర్ణాలలో శోభిస్తూ ఉండేవాటిని వీక్షిస్తాడట **(నానా వర్ణా కృతీని).** వివిధ ఆకృతులు, వివిధ రంగులలో గోచరించడము అంటే, ఆశ్చర్యకర మైన రంగులలో గోచరించే రూపాలను చూడబోతాడని అర్థం. అవి ఈ లోకంలో ఉండేవి కావచ్చు. ఇతర లోకాలలో ఉండేవి కూడా కావచ్చు.

పశ్యాదిత్యాన్వసూన్రుద్రానశ్వినౌ మరుతస్తథా । 6
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత ॥

***పశ్య-ఆదిత్యాన్-వసూన్-రుద్రాన్-అశ్వినౌ-మరుతః-తథా***
***బహూని-అదృష్టపూర్వాణి-పశ్య-ఆశ్చర్యాణి-భారత***

| | | | | | |
|---|---|---|---|---|---|
| భారత | = | అర్జునా! | అశ్వినౌ | = | అశ్వినీదేవతలను |
| ఆదిత్యాన్ | = | ఆదిత్యులను | మరుతః | = | మరుత్తులను |
| వసూన్ | = | వసువులను | పశ్య | = | చూడు |
| రుద్రాన్ | = | రుద్రులను | తథా | = | అలాగే |

| | | | | | |
|---|---|---|---|---|---|
| అదృష్టపూర్వాణి | = | ఇంతవరకు చూడనివి | ఆశ్చర్యాణి | = | వింతలను |
| బహూని | = | అనేకములైన | పశ్య | = | చూడు! |

**భారతా! అర్జునా! అవలోకించు. ఆదిత్యుల్ని, వసువుల్ని, రుద్రులను, అశ్వినీ దేవతలను, మరుత్తులను చూడు! పూర్వం నువ్వు చూడని వన్నీ చూడు! ఆశ్చర్యాలను దర్శించు.**

**వ్యాఖ్య**

అర్జునుడు వీక్షించబోయే విశ్వయంత్రాంగా న్నంతా ముందే పరిచయం చేస్తున్నాడు భగవంతుడు. పన్నెండు మంది ఆదిత్యులను, ఎనిమిది మంది వసువులను, పదకొండు మంది రుద్రులను, ఇద్దరు అశ్వినీ దేవతలను, అలాగే నలభై తొమ్మిది మంది మరుత్తులను చూడ మంటున్నాడు. ఈ పేర్లను అర్జునుడు ఇదివరకే శాస్త్రంలో విని ఉండవచ్చు. కానీ, సూక్ష్మరూపంతో ఉండి ఈ లోక వ్యవహారాన్నంతా నడుపుతున్న ఈ దేవగణాన్ని ఇప్పుడు కళ్ళారా చూడబోతాడు. అందుకనే గతంలో మానవ లోకంలో చూడనివి ***(అదృష్ట పూర్వాణి మనుష్యలోకే)***, ఆశ్చర్యకర మైనవి ***(ఆశ్చర్యాణి అద్భుతాని)*** అంటున్నాడు భగవానుడు. అంటే, అలౌకికమైన అద్భుతాలన్నీ తెర మీదికి రాబోతున్నాయి అని అర్థము. వాటన్నిటినీ చూడటం ఒక అద్భుత మైతే, ఆ అద్భుతాల నన్నిటినీ ఒకే రూపంలో దర్శించడం పరమాద్భుతం.

**ఇ హైకస్థం జగ త్కృత్స్నం పశ్యా ద్య సచరాచరమ్ ।**
**మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి ॥** 7

***ఇహ-ఏకస్థం-జగత్-కృత్స్నం-పశ్య-అద్య-సచరాచరం***
***మమ-దేహే-గుడాకేశ-యత్-చ-అన్యత్-ద్రష్టుం ఇఛ్ఛసి***

| | | | | | |
|---|---|---|---|---|---|
| గుడాకేశ | = | అర్జునా! | జగత్ | = | విశ్వమును |
| యత్ | = | ఏ | అద్య | = | ఇప్పుడు |
| అన్యత్ | = | ఇతరమైన దానిని | మమ | = | నా యొక్క |
| ద్రష్టుం | = | చూచుటకు | ఇహ | = | ఈ |
| ఇచ్ఛసి చ | = | ఇష్టపడు తున్నావో | దేహే | = | దేహము నందు |
| సచరాచరం | = | ఆ చరాచర స్వరూపమైన | ఏకస్థం | = | ఒకే చోట ఉన్న దానిని |
| కృత్స్నం | = | సమస్తమైన | పశ్య | = | చూడు |

**గుడాకేశా! అర్జునా! ఇక్కడే, ఒకే చోట, నా దేహంలో ఉన్న చరాచర ప్రపంచాన్నంతా ఇప్పుడే చూడు! మరేదైనా చూడాలి అనుకుంటే, అది కూడా చూసేయ్!**

**వ్యాఖ్య**

ఈ శ్లోకం లోనే ఒక అద్భుతమైన రహస్యాన్ని బుద్ధికి పట్టిస్తున్నాడు భగవంతుడు. సమస్తాన్ని తన దేహంలో ఇక్కడే, ఇప్పుడే చూడ మంటున్నాడు. ఇది జాగ్రత్తగా అర్థం చేసుకోవలసిన విషయం.

అన్నిటినీ ఇక్కడే, ఇప్పుడే చూడ మంటున్నాడు. అన్నీ అంటే ఉన్న వన్నీ. ఉన్న వన్నీ అంటే, ఇప్పుడున్నవే కావు. గతంలో ఉన్నవి, భవిష్యత్తులో ఉండబోయేవి కూడా అని అర్థము. భూత భవిష్య ద్వర్తమానాలలో ఉన్నవాటి నన్నిటినీ ఒకే చోట చూచే దెలా? ఒకే కాలంలో వీక్షించే దెలా? అలా వీక్షించాలంటే అన్ని కాలాలు ఒక కాలం లోకి రావాలి. అన్ని కాలాలు ఒక కాలమైతే, ఆ కాలాన్ని ఏమని పిలవాలి? భవిష్యత్తు వర్తమాన మెలా అవుతుంది? వర్తమానం గత మెలా అవుతుంది? గతం భవిష్యత్తు అయ్యే దెలా? కనుక, భగవంతుడు ప్రదర్శించబోయే





విశ్వరూపం కాలానికి, దేశానికి అతీతమైంది. దానిని దర్శించడం కూడా, సాధారణంగా మనం ప్రపంచంలో ఒక దాని తరువాత మరొక దానిని దేశకాలాదులలో కదుల్తూ దర్శించినట్లు దర్శించడము కాదని స్పష్టమైంది. అన్నిటినీ ఒకే చోట, ఒకే కాలంలో, ఒకే రూపంలో దర్శించడము అంటే, చూడటానికి అన్నీ సిద్ధమై, కాలం గాని కాలంలో, దేశం గాని దేశంలో కళకళ లాడుతున్నాయి అని అర్థం. కనుకనే, తాను స్వేచ్ఛగా ప్రదర్శించడమే గాక, తనకు అవసరమైంది దర్శించే స్వేచ్ఛను అర్జునునికి కూడా అనుగ్రహించాడు భగవంతుడు ***(యచ్చ అన్యత్ ద్రష్టుం ఇచ్ఛసి తదపి పశ్య)***. అంటే, తాను చూపేవే కాకుండా, అర్జునుడు చూడాలి అనుకున్నవి కూడా చూడవచ్చు అని అర్థము. ఇంతకన్నా అద్భుత మేముంటుంది?

మరి, సమస్తము విశ్వరూపం లోనే దర్శనీయమై నపుడు, వాటి కన్నా అన్యమైనవి ఏమున్నాయని అర్జునుడు దర్శించాలని అభిలషిస్తాడు? కానీ, అలా అభిలషించే అవకాశమే లేకపోతే, అన్యములను చూడా లనుకుంటే చూడవచ్చు అని భగవంతుడు మాత్రం ఎందుకు చెబుతాడు? కనుక, ఉంది. దర్శించాల్సింది ఉంది. దర్శించాలనే కోరిక అర్జునునిలో అందుకే ఉంది. కాకపోతే, అది అర్జునుని మనస్సులో సంశయ రూపంలో ఉంది. ఏమిటా సంశయం? కురుక్షేత్ర సంగ్రామంలో విజయానికి సంబంధించిన సంశయం. ఈ విషయాన్ని రెండవ అధ్యాయం లోనే అర్జునుడు అచ్యుతునికి విన్నవించు కున్నాడు.

***యద్వాజయేమ యది వా నో జయేయుః న విద్మః*** - కృష్ణా! మనం కౌరవులను జయిస్తామో, లేక కౌరవులే మనల్ని జయిస్తారో తెలియదు అని సమరానికి సంబంధించిన విజయ విషయాన్ని ముందుగానే ప్రస్తావించాడు పార్థుడు (2 వ అ - 6 వ శ్లో). విశ్వరూప దర్శనంలో ఒకవేళ అర్జునుడు అభిలషిస్తే, ఆ సంశయాన్ని కూడా తీర్చుకోవచ్చు. అదెలా సాధ్యం? యుద్ధం ఇంకా ఆరంభం కానేలేదు కదా! అదే విచిత్రం. అదే అద్భుతం. అద్భుత దర్శనం లోని పరమాద్భుతం. సమరము - సమర విజయము భవిష్యత్తుకు సంబంధించినవి అని మనకు అనిపించ వచ్చు. కానీ, కాలాతీత స్థితిలో ఏ కాలమూ లేదు కాబట్టి, అన్ని కాలాలూ అందులో ఒదిగి ఉంటాయి. కనుక, అక్కడ దేనిని చూడట మైనా సాధ్యమే. కురుక్షేత్ర సంగ్రామం ముగిసిన తరువాత, మరణించిన వారి నందరినీ గంగాతీరంలో వ్యాస భగవానుడు దర్శింప చేసింది కూడా అది ఇలా సాధ్యం కాబట్టే. ఇవన్నీ సూక్ష్మంగా అర్థం చేసుకోవలసిన విషయాలు. ఉన్న స్థాయి నుండి కాకుండా, ఉన్నత స్థాయిలో మేల్కొని దర్శించ వలసిన సత్యాలు. అందుకనే, అర్జునుని **గుడాకేశా!** అని సంబోధించాడు భగవంతుడు.

**న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా ।** 8
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్ ॥**

***న-తు-మాం-శక్యసే-ద్రష్టుం-అనేన-ఏవ-స్వచక్షుషా***
***దివ్యం-దదామి-తే-చక్షుః-పశ్య-మే-యోగం-ఐశ్వరం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాం | = | నన్ను | చక్షుః | = | నేత్రమును |
| అనేన | = | ఈ | దదామి | = | ఇస్తున్నాను |
| స్వచక్షుషా ఏవ | = | నీ కళ్ళతో | మే | = | నా యొక్క |
| ద్రష్టుం | = | చూడటం | ఐశ్వరం | = | దివ్యమైన |
| న శక్యసే తు | = | సాధ్యపడదు | యోగం | = | యోగమును |
| తే | = | నీ కొరకు | పశ్య | = | చూడు! |
| దివ్యం | = | దివ్యమైన | | | |

**అర్జునా! నీ నేత్రాలతో నన్ను దర్శించడము సాధ్యపడదు. నీకు దివ్య చక్షువులను ప్రసాదిస్తున్నా! ఈశ్వర సంబంధమైన నా యోగ వైభవాన్ని దర్శించు!**

**వ్యాఖ్య**

చూడటానికి అర్జునుడు సిద్ధంగా ఉన్నాడు. చూపించడానికి శ్రీకృష్ణుడు సిద్ధపడే ఉన్నాడు. అయినా, దర్శనానికి ఏదో అవరోధం ఏర్పడుతోంది. ప్రతిబంధకము అడ్డు నిలుస్తోంది. ఆ ప్రతిబంధకం ఏదో కాదు. అర్జునుని నేత్ర ద్వయం. చూచే వాని చక్షువులు. మహిమను దర్శించే శక్తి లేని మాంస చక్షువులు. అందుకనే, నీ కళ్ళతో నా వైభవాన్ని చూడలేవు అర్జునా! అంటున్నాడు భగవంతుడు.

దేశకాలాదులలో కదిలే వాటిని పరిమిత స్థాయి నుండి వీక్షించే మానవుని మాంస చక్షువులు, కాలాతీత మైన దివ్య కళాత్మక దర్శనాన్ని ఎలా వీక్షించ గలవు? భగవదైశ్వర్యాన్ని దర్శించడము అనేది భగవంతుడి నేత్రాలతో దర్శించి నపుడే సాధ్య పడుతుంది. అందుకనే, ఈశ్వర వైభవాన్ని దర్శించ డానికి దివ్య చక్షువులను ఇస్తున్నాడు భగవంతుడు ***(దదామి తే దివ్యం చక్షుః)***. రాయబార సమయంలో కూడా కౌరవ సభ లోని వారికి దివ్య దృష్టిని ప్రసాదించిన తరువాతే తన విశ్వరూపాన్ని దర్శింప చేశాడు.

*మరొక అద్భుతం. ఇంతవరకు, కురుక్షేత్రంలో కృష్ణార్జునుల రథం ప్రక్కన నిలబడి మనం భగవద్గీతను వింటూ వచ్చాం. రెప్పపాటులో మనల్ని అక్కడి నుండి ఎక్కడికో పట్టుకు పోయాడు వ్యాస భగవానుడు. ఎక్కడ మనకు గీత మొదలైందో అక్కడికి మనల్ని చేర్చేశాడు. ఇప్పుడు మనం కురుక్షేత్రంలో లేము. ధృతరాష్ట్రుని శయన మందిరంలో ఉన్నాం. ఇప్పుడు మన ముందు కృష్ణార్జునులు లేరు. సంజయ ధృతరాష్ట్రులు ఉన్నారు. చదవండి.*

**సంజయ ఉవాచ :**

ఏవ ముక్త్వా తతో రాజ న్మహా యోగేశ్వరో హరిః ।
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్ ॥ 9

***ఏవం-ఉక్త్వా-తతః-రాజన్-మహాయోగేశ్వరః-హరిః***
***దర్శయామాస-పార్థాయ-పరమం-రూపం-ఐశ్వరం***

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజన్ | = | రాజా! | పరమం | = | ఉత్తమమైన |
| ఏవం | = | ఈ విధంగా | ఐశ్వరం | = | ఈశ్వర సంబంధమైన |
| ఉక్త్వా | = | పలికి | రూపం | = | విశ్వరూపమును |
| తతః | = | ఆ తరువాత | పార్థాయ | = | పార్థుని కొరకు |
| మహాయోగేశ్వరః | = | గొప్ప యోగేశ్వరుడైన | దర్శయామాస | = | చూపించాడు |
| హరిః | = | శ్రీహరి | | | |

**సంజయుడు అంటున్నాడు :**

**రాజా! ధృతరాష్ట్రా! శ్రీకృష్ణుడు అలా భాషించాడు. అంతే. ఈశ్వర సంబంధమైన తన దివ్య రూపాన్ని ప్రదర్శించి అర్జునుని అనుగ్రహించాడు మహా యేగేశ్వరుడైన శ్రీహరి.**

**వ్యాఖ్య**

అర్జునుడు తన దివ్య రూపాన్ని దర్శించడానికి దివ్య చక్షువులను అనుగ్రహిస్తానని శ్రీకృష్ణుడు అనడం





మనం విన్నాం. ఈ లోగా మనం అక్కడ లేకుండా, ధృతరాష్ట్రుని మందిరానికి చేర్చబడ్డాం. కురుక్షేత్రంలో ఏం జరుగుతూ ఉందో! శ్రీకృష్ణుడు విశ్వరూపాన్ని చూపిం చేస్తున్నా డేమో! అనే ఉత్సుకత మనందరిలో ఉంది. ఫరవాలేదు. ఇక్కడ కూడా మన ముందు సంజయు డున్నాడు. మనం చూడలేని దానిని ఆయన చూడ గలడు. వ్యాస ప్రసాదంగా ఆయనకు ప్రాప్తించిన దివ్య దృష్టితో కురుక్షేత్రంలో జరిగే దంతా చూడ గలడు. చూచిన దంతా ప్రత్యక్ష వ్యాఖ్యానంగా ధృతరాష్ట్రునికి వినిపిస్తూ ఉంటాడు. మనం కూడా శ్రవణానందంగా ఆలకించ వచ్చు. కాకపోతే, ధృతరాష్ట్రునికి కళ్ళు లేక పోయినా, మనకు ఉన్నా, ప్రస్తుతం అందరమూ చూడ లేని వాళ్ళమే. కానీ, వీను లున్న పుణ్యానికి, బధిరత్వము లేని భాగ్యానికి సంజయుని అమృత భాషణాన్ని వినగలుగుతాము.

ఈ సందర్భంలో అర్థం చేసుకోవలసిన అద్భుతం మరొకటి ఉంది. ఒకవేళ మనం ఇక్కడ ఉండలేక తొందరపడి కురుక్షేత్రానికి పరుగులు తీసినా, అక్కడ కూడా విన గలమే గాని చూడ లేము. ఇక్కడ ఉంటే సంజయుని ద్వారా వినాలి. అక్కడి కెళ్తే అర్జునుని ద్వారా వినాలి. ఎందుకని? భగవంతుని విశ్వరూపాన్ని వాళ్ళిద్దరే చూస్తున్నారు. వారిద్దరికే దివ్యదృష్టి ప్రసాదింప బడింది. విశ్వరూపాన్ని దర్శించ డానికి మనకు దివ్యదృష్టి ఎక్కడుంది? తగుదునమ్మా అని కళ్ళజోడు పెట్టుకొని చూసినా విశ్వరూప దర్శనం జరుగుతుందా? కళ్ళున్నా ఆ రూపం మనకు కనిపించదు. చెవులున్నా ఆ నాదం మనకు వినిపించదు. ఈ విషయాన్ని ఉపనిషత్తు అద్భుతంగా వినిపించింది.

***శృణ్వతోఽపి న శృణ్వన్తి జానతోఽపి న జానతే ।***
***పశ్యన్తోఽపి న పశ్యన్తి పశ్యన్తి జ్ఞాన చక్షుషః ॥***

దానిని వింటూ వినలేరు. తెలుసుకుంటూ తెలుసుకో లేరు. కంటూ కన లేరు. జ్ఞాననేత్రము తోనే దర్శించ గలరు.

ఇక వెలి తెందుకు? సంజయుడు చెబుతూ ఉంటాడు. మనం బుద్ధిలో దర్శిస్తూ ధన్యుల మవుదాం. శ్రీకృష్ణుడు అర్జునునికి విశ్వరూపాన్ని దర్శింప చేశాడని సంజయుడు చెబుతున్నాడు ***(పరం రూపం పార్థాయ దర్శయామాస)***.

ఈ సందర్భంలో గీతాచార్యుని **మహాయోగేశ్వరః** అని, **హరిః** అని రెండు నామాలతో సంజయుడు వర్ణించాడు. అక్కడ జరుగుతున్నది విశ్వరూప ప్రదర్శనం కనుక, యోగమాయను తన అధీనంలో ఉంచుకొని తన దివ్య రూపమును సందర్శింప చేస్తున్న వాసుదేవ మూర్తిని 'మహాయోగేశ్వరుడు' అంటున్నాడు. ఆ మహాయోగేశ్వ రేశ్వరునే 'హరి'గా కూడా అభివర్ణిస్తున్నాడు.

***హరిః సహేతుక సంసారం హరతి ఇతి హరిః -*** హరించే వాడు హరి. దేనిని హరిస్తాడు? సంసారాన్ని, సంసార హేతువైన అవిద్యను హరించే వాడు కనుక ఆయన హరి భగవానుడు. విశ్వరూప ప్రదర్శన ప్రభావం చేత కార్యరూప ప్రపంచ వ్యామోహాన్ని, కారణరూప అజ్ఞానాన్ని సమూలంగా హరిస్తున్నాడు అనే భావంతో భగవానుని 'హరి' అని వర్ణించాడు.

*విశ్వరూప ప్రదర్శనాన్ని చూస్తూ ఇలా చెబుతున్నాడు సంజయుడు.*

అనేక వక్త్రనయన మనే కాద్భుత దర్శనమ్ । 10
అనేక దివ్యాభరణం దివ్యా నేకోద్యతాయుధమ్ ॥

***అనేక వక్త్రనయనం-అనేకాద్భుత దర్శనం***
***అనేక దివ్యాభరణం-దివ్యా నేకోద్యతాయుధం***

| | | |
|---|---|---|
| అనేక వక్త్రనయనం | = | అనేకమైన ముఖములు కన్నులు గలది |
| అనేకాద్భుత దర్శనం | = | అనేకములైన అద్భుతదర్శనములు గలది |
| అనేక దివ్యాభరణం | = | అనేకములైన దివ్య ఆభరణములు గలది |
| దివ్యా నేకోద్యతాయుధం | = | దివ్యములు, అనేకములు నైన ఎత్తబడిన ఆయుధములు గలది |

**అదిగో! విశ్వరూపం అదిగో! అనేక ముఖాలు, అనేక నేత్రాలతో ఉంది. అద్భుత దృశ్యాలతో అలరారుతోంది. దివ్యాభరణాలతో శోభిస్తోంది. అనేక దివ్యమైన ఆయుధాలను ఎత్తి పట్టుకొని ఉంది.**

దివ్య మాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్ ।
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ ॥ 11

***దివ్య మాల్యాంబరధరం-దివ్య గంధానులేపనం***
***సర్వాశ్చర్యమయం-దేవం-అనంతం-విశ్వతోముఖం***

| | | |
|---|---|---|
| దివ్యమాల్యాంబరధరం | = | దివ్యములైన హారములు, వస్త్రములు గలది |
| దివ్యగంధానులేపనం | = | దివ్యమైన గంధపు లేపనము గలది |
| సర్వాశ్చర్య మయం | = | అన్ని వింతలతో కూడినది |
| అనంతం | = | అనంతమైనది |
| విశ్వతోముఖం | = | అంతటను ముఖములు గలది |
| దేవం | = | ప్రకాశవంత మైనది |

**ఆ విశ్వరూపము దివ్యమైన మాలలను, వస్త్రాలను ధరించి ఉంది. దివ్యమైన గంధమును పూసికొని ఉంది. సమస్త ఆశ్చర్యాలతో ప్రకాశిస్తోంది. అన్ని వైపుల ముఖాలు కలిగి అనంతంగా గోచరిస్తోంది.**

**వ్యాఖ్య**

ఏకము, అఖండము అయిన పరమేశ్వరుని రూపంలో దృశ్యాలన్నీ అనేకంగా గోచరిస్తున్నాయి. అనేకంగా నోళ్ళు, అనేకంగా నేత్రాలు ఉన్నాయి. ఆ నోళ్ళన్నీ పరమేశ్వరునివే. ఆ నేత్రాలన్నీ ఆయనవే. అంటే నోళ్ళు ఆరగిస్తున్నాయి. నేత్రాలు అవలోకిస్తున్నాయి. అన్నిటినీ ఆరగించడం, అన్నిటినీ అవలోకించడం జరుగుతూ ఉంది. ఆ రూపము వీక్షించని రూపము లేదు, దృశ్యము లేదు. అది మ్రింగని చరాచరములు ఉండవు. ***సర్వ తోఽ క్షి శిరోముఖమ్*** - అతని కళ్ళు, శిరస్సు, ముఖము సర్వత్ర వ్యాపించి ఉన్నాయి అని పదమూడవ అధ్యాయంలో కూడా చూడబోతాము.

పరమేశ్వరుని విశ్వరూపమే ఒక అద్భుతం ***(అద్భుతవత్ అద్భుతః).*** అద్భుతమైన ఆ మహారూపంలో ఇంకా అనేక అద్భుతాలు గోచరిస్తున్నాయి. అంతా ఆశ్చర్యమే. అన్నీ ఆశ్చర్యాలే. ఆ దివ్య రూపంలో ప్రకాశవంతమైన ఆభరణాలు అసంఖ్యాకంగా అలంకరింపబడి ఉన్నాయి. అలాంటి అద్భుతమైన ఆభరణాలు గతంలో ఎవ్వరూ చూచి ఉండరు. అవి ఈ లోకంలో కనిపించేవి కావు. దివ్యము లైనవి. పరలోకాలలో ప్రకాశవంతంగా శోభించేవి.

ఆ విశ్వమూర్తిలో శక్తివంతము లైన ఆయుధాలు ఎన్నో ఉన్నాయి. పైగా అవి ఎత్తబడి ఉన్నాయి ***(దివ్యాని అనేకాని ఉద్యతాని ఆయుధాని).*** ఆయుధాలను ధరించడం వేరు. ఆయుధాలను పైకి ఎత్తడము వేరు. ఖడ్గము పైకి లేచింది అంటే, ఏదో ఖండింప బడుతూ ఉందని అర్థము. ఒక వైపు ప్రభవ స్థానాలు కనిపిస్తూ ఉంటే, ఆ రూపం లోనే మరో వైపు లయం కూడా సాగిపోతూ ఉందని అర్థము.





దివ్యగంధ లేపనంతో, దివ్య వస్త్ర మాలలతో అలంకరింప బడి దివ్యసౌరభాలను విరజిమ్ముతూ, పరిమళ భరితంగా ఉన్న ఆ విశ్వరూపము పరమాశ్చర్యంగా ఉంది. సర్వాశ్చర్యంగా ఉంది. అనంతంగా ప్రకాశిస్తూ విశ్వతోముఖంగా విరాజిల్లుతోంది. సర్వతోముఖంగా వర్ధిల్లుతోంది **(విశ్వతః ముఖాని అస్యేతి విశ్వతోముఖః).** విశ్వం లోని ముఖాలన్నీ ఆయన లోనే ఉన్నాయి కనుక ఆయన విశ్వతోముఖుడు. విశ్వమూర్తి, విశ్వరూప మూర్తి కాని, విశ్వం లోని రూపాలన్నీ ఏకరూపు దైన తన యందే భాసించడం చేత ఆయన మహామూర్తి ***(అస్య మహతీ మూర్తిః ఇతి).***

*విశ్వరూపమూర్తి అయిన పరమేశ్వరుని ప్రకాశానికి ఉపమానాన్ని ఉదహరిస్తున్నాడు.*

దివి సూర్య సహస్రస్య భవే ద్యుగప దుత్థితా ।
యది భాః సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః ॥ 12

***దివి-సూర్యసహస్రస్య-భవేత్-యుగపత్-ఉత్థితా***
***యది-భాః-సదృశీ-సా-స్యాత్-భాసః-తస్య-మహాత్మనః***

| | | | | | |
|---|---|---|---|---|---|
| దివి | = | ఆకాశము నందు | తస్య | = | ఆ |
| సూర్య సహస్రస్య | = | వేయి మంది సూర్యుల | మహాత్మనః | = | మహాత్ముని యొక్క |
| యుగపదుత్థితా | = | ఏకకాలమందు కదిలిన | భాసః | = | కాంతికి |
| భాః | = | కాంతి | సదృశీ | = | సమాన మైనది |
| భవేత్ యది | = | సంభవించేనేని | స్యాత్ | = | అవుతుంది |
| సా | = | ఆ కాంతి | | | |

**వేయి మంది సూర్యులు ఆకాశంలో ఒకేసారి ఉదయిస్తే ఆ కాంతి ఎలా ఉంటుందో, విశ్వరూపుని ప్రకాశం అలా ఉందనుకో!**

**వ్యాఖ్య**

విశ్వరూప చైతన్య జ్యోతి వైభవాన్ని వర్ణిస్తున్నాడు. విషయ సౌలభ్యం కోసం మ్రింగుడు పడని ఉపమానాన్ని అలంకారంగా జోడిస్తున్నాడు.

సాధారణంగా పోలిక అనేది రెండు తెలిసిన విషయాల మధ్యే సాధ్య పడుతుంది. కనుక, ఇక్కడ ఉపమను అలంకరించడం క్లిష్టంగా మారింది.

ఆకాశంలో సూర్య ప్రకాశాన్ని మనం చూచి ఉన్నాము. విశ్వరూపుడు అలాంటి ప్రకాశము కలవాడు అంటే అర్థం చేసుకోవచ్చు. కాని, వెయ్యి మంది సూర్యులు **(సూర్యాణాం సహస్రం సూర్య సహస్రం)** ఒకే కాలంలో ఒకే చోట ప్రకాశించడం అనేది మనం ఎప్పుడూ చూడ లేదు. చూడని దానిని చూస్తున్న దానితో ఉపమించి అలంకరించడం ఏమిటో! అందుకే మ్రింగుడు పడని ఉపమానం అంటున్నాను. అలాగని, అసలే చూడని, అసలే తెలియని విషయం అని చెప్పడానికి వీలు లేదు. సూర్యుణ్ణి మనం చూచి ఉన్నాం. సూర్యప్రకాశం మన అనుభవంలో ఉంది. కాకపోతే, తలెత్తి చూడలేని ఒక సూర్య ప్రకాశాన్ని సహస్రంతో ఎచ్చ వేసి చూడా లంటేనే ఆ వెచ్చదనం దుర్భర మవుతూ ఉంది. పైగా సహస్రం అంటే పది వందలు మాత్రమే కాదు కదా! సహస్ర మనేది అనంతానికి ఉపలక్షణం అనేది మనకు తెలుసు.

ఉపమను చక్కగా ఆవిష్కరించాలి అంటే, వేయి మంది సూర్యులు ఒకేసారి ఆకాశంలో ప్రకాశిస్తూ

ఉండటాన్ని గతంలో మనం ఎప్పుడూ చూడక పోయినా, ఒక్క సూర్యుని చూచిన అనుభవం ఉంది కనుక, దానిని ఆధారం చేసుకొని అందని అలంకారాన్ని అందుకునే ప్రయత్నం మనం చెయ్యాలి. దీనినే 'అభూత ఉపమాలంకారము' అంటారు. అంటే, గతంలో అనుభవములో లేనిది అని అర్థము. అనుభవంలో లేని దానిని భావించడమే ప్రధానం కావడం చేత దీనిని 'సంభావిత ఉపమాలంకారము' అని కూడా అంటారు.

**త త్రైకస్థం జగ త్కృత్స్నం ప్రవిభక్త మనేకధా ।**
**అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా ॥** 13

*తత్ర-ఏకస్థం-జగత్-కృత్స్నం-ప్రవిభక్తం-అనేకధా*
*అపశ్యత్-దేవదేవస్య-శరీరే-పాండవః-తదా*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తదా | = | అప్పుడు | దేవదేవస్య | = | దేవదేవుని యొక్క |
| పాండవః | = | అర్జునుడు | తత్ర | = | ఆ |
| అనేకధా | = | అనేక విధాలుగా | శరీరే | = | దేహము నందు |
| ప్రవిభక్తం | = | విభజింప బడిన | ఏకస్థం | = | ఒక్కచోటనే |
| జగత్ | = | జగత్తును | అపశ్యత్ | = | దర్శించాడు |
| కృత్స్నం | = | సమస్తాన్ని | | | |

**అప్పుడు అర్జునుడు దేవదేవుని శరీరంలో సమస్త ప్రపంచాన్ని వీక్షించాడు. ఆ ప్రపంచం ఒకే చోట అనేక విధాలుగా, వేరువేరుగా కనిపించింది.**

**తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః ।**
**ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత ॥** 14

*తతః-సః-విస్మయావిష్టః-హృష్టరోమా-ధనంజయః*
*ప్రణమ్య-శిరసా-దేవం-కృతాంజలిః-అభాషత*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తతః | = | తరువాత | దేవం | = | దేవుని |
| సః | = | ఆ | శిరసా | = | శిరస్సుతో |
| ధనంజయః | = | అర్జునుడు | ప్రణమ్య | = | నమస్కరించి |
| విస్మయావిష్టః | = | ఆశ్చర్యచకితుడై | కృతాంజలిః | = | చేతులు జోడించి |
| హృష్టరోమా | = | పులకాంకితుడై | అభాషత | = | భాషించాడు |

**ఆ తరువాత, అర్జునుడు ఆశ్చర్యచకితు డయ్యాడు. గగుర్పాటు చెందాడు. శిరస్సు వంచి ఆ దివ్య పురుషునికి నమస్కరించాడు. దోసి లొగ్గి పలికాడు.**

**వ్యాఖ్య**

విశ్వరూప మూర్తి దివ్య దేహంలో సమస్త జగత్తును వీక్షించాడు అర్జునుడు. ఆ రూపాలు అనేక విధాలుగా ఉన్నాయి. దేవ, పితృ, మనుష్యాది భేదాలతో అనేక విధాలుగా కనిపిస్తున్నాయి. ఒక్క చోటే ఉన్నా, జాతి భేదాలను బట్టి వేరు వేరుగా తెలుస్తున్నాయి. దేవతలు దేవ జాతి. రాక్షసులు రాక్షస జాతి. గంధర్వులు గంధర్వ జాతి. కిన్నరులు కిన్నర జాతి. మానవులు మానవ జాతి. అలాగే జంతు, పక్షి, కీటకాదులు కూడా. అన్నీ ఉన్నాయి. ఒకేచోట ఉన్నాయి. అయినా, అనేక విధాలుగా, వేరువేరుగా తెలుస్తూ ఉన్నాయి.





విజయుడు విస్మయం చెందాడు. ఏదీ అర్థం గాని అలౌకి కానుభూతిలో నిమగ్న మయ్యాడు. విస్మయాలను చూచి విస్తుపోదామా అంటే, వికృతాలు తీవ్రంగా భయపెడు తున్నాయి. ఒక వైపు బీభత్సాలు గుండెను పరుగు లెత్తిస్తూ ఉంటే, మరో వైపు సౌమ్య రూపాలు మనస్సును శాంతింప చేస్తూ ఉన్నాయి. ఏ రసాన్ని మ్రింగాలో, ఏ రసాన్ని త్రేపాలో అర్థం కావడం లేదు. అలాగని అన్ని రసాలను రంగరిస్తే, అది ఏ రసమో అసలే అర్థం కావడం లేదు. రసాలన్నీ లోపల నిండుతూ ఉంటే, రోమాలు పైకి నిక్కబొడుచుకుంటూ ఉన్నాయి **(హృష్ట రోమాః).** శిరస్సు అప్రయత్నంగా భక్తి భారంతో వంగి పోతోంది. చేతులు పరస్పరం కలుసుకొని ఏక మయ్యాయి. అర్జునుడు నోరు తెరిచాడు. ఏం పలుకుతాడో విందాం.

*మనల్ని తిరిగి కురుక్షేత్రానికి చేర్చే ప్రయత్నంలో వ్యాసు డున్నాడు. మనమూ ఆరాధనా హృదయంతో అర్జునుని లాగా కొన్ని క్షణాలు ఐదు పది చేసి కళ్ళు మూద్దాం.*

**అర్జున ఉవాచ :**

**పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా భూత విశేష సంఘాన్ ।**
**బ్రహ్మాణ మీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్ ॥** 15

*పశ్యామి-దేవాన్-తవ-దేవ-దేహే-సర్వాన్-తథా-భూత విశేష సంఘాన్*
*బ్రహ్మాణం-ఈశం-కమలాసనస్థం-ఋషీన్-చ-సర్వాన్-ఉరగాన్-చ-దివ్యాన్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవ | = | దేవా! | కమలాసనస్థం | = | పద్మాసనము నందున్న |
| తవ | = | నీ యొక్క | బ్రహ్మాణం | = | బ్రహ్మను |
| దేహే | = | దేహము నందు | సర్వాన్ | = | సమస్తములైన |
| సర్వాన్ | = | సమస్తమైన | ఋషీన్ చ | = | ఋషులను |
| దేవాన్ | = | దేవతలను | దివ్యాన్ | = | దివ్యములైన |
| తథా | = | అలాగే | ఉరగాన్ చ | = | సర్పాలను |
| భూతవిశేష సంఘాన్ | = | చరాచర భూతసమూహములను | పశ్యామి | = | చూస్తున్నాను |
| ఈశం | = | ఈశ్వరుడు | | | |

**విజయుడు విన్నవించుకుంటున్నాడు :**
**దేవా! నీ దేహంలో సర్వ దేవతలను, సమస్త భూత సమూహాలను చూస్తున్నాను. కమలాసనంపై ఉన్న ప్రభువు బ్రహ్మదేవుని, సమస్త ఋషివర్యులను, దివ్యములైన సర్పాలను కూడా చూస్తున్నాను.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుడు అనుగ్రహించిన మహాద్భుతమైన విశ్వరూపాన్ని దర్శిస్తూ, **తదహం పశ్యామి** - అనూహ్యమైన ఆ రూపాన్ని నేను చూస్తున్నాను అంటూ అర్జునుడు తన అనుభవాన్ని ఆవిష్కరిస్తున్నాడు **(స్వానుభవమ్ ఆవిష్కుర్వన్).**

పరమేశ్వరుని దివ్యమయ దేహంలో ఇంద్రాది సమస్త దేవతలు, భృగ్వాది ఋషి పుంగవులు, చతుర్ముఖ బ్రహ్మ, మరియు వాసుకి, ఆదిశేషుడు మొదలైన దివ్యసర్పాలు, స్థావర జంగమాత్మకము లైన సమస్త భూత సముదాయము అర్జునునికి కనిపిస్తున్నాయి.

సమస్త దేవతలు అన్నప్పుడు బ్రహ్మదేవుడు కూడా దేవతల కోవ లోకే వస్తాడు. కనుక, ఆయనను ప్రత్యేకించి కమలాసనంపై ఉన్న ప్రభువైన బ్రహ్మదేవుడు అని చెప్పే అవసరం లేదు. కాని, అలా ప్రత్యేకించి

ప్రస్తావించడానికి బ్రహ్మ ఈ సృష్టికి ప్రధాన కారకుడు, ప్రజలను నియమించే ప్రభువు కావడమే కారణము ***(ఈశితారం ప్రజానాం).***

కమలాసనస్థుడు, ప్రభువు అయిన బ్రహ్మదేవుని అర్జునుడు చూస్తున్నాడు అంటే, పరమేశ్వరుని విశ్వరూపంలో బ్రహ్మలోకము కూడా కనిపిస్తూ ఉంది అని అర్థము. అలాగే దేవతా సమూహాన్ని ఉటంకించడం చేత, ఒక్క బ్రహ్మ లోకమే కాక, ఇంద్ర, వరుణ, పితృ దేవతాది లోకాలన్నీ గోచరిస్తున్నాయి అని అర్థము. ఇవన్నీ అర్జునుడు గతంలో చూచి ఉండనివి. అతని పూర్వానుభవంలో లేనివి.

అర్జునుని పూర్వానుభవంలో అవి లేనివి కావచ్చు. కాని, సృష్టిలో ఉన్నవే. సృష్టి అనేది కేవలం మానవ లోకానికే సంబంధించింది కాదు. సమస్త లోకాలు సృష్టి లోకే వస్తాయి. సృష్టికి ముందు ఏ లోకమూ లేదు. సర్వ లోకాలూ సృష్టి లోనివే అయి నపుడు, మనం నివసిస్తున్న ఈ విశ్వం ఎంతో, ఏ పాటిదో ఊహించుకోవడం కష్టసాధ్య మేమీ కాదు. విశ్వమే లేశ మాత్రమై నపుడు, ఆ విశ్వంలో వ్యక్తి స్థాన మెంత? ఈ విధంగా విశ్వరూప వైభవాన్ని అర్థం చేసుకోగలిగితే వ్యక్తి లోని అహంకారం మంచు లాగా కరిగి పోతుంది.

మహత్తు కలిగినవి, మహాద్భుత మైనవి అయిన అనేక రూపాలను విశ్వరూపంలో ఒకేసారి అర్జునుడు చూస్తున్నాడు. ఆ రూపాలన్నీ విశ్వంలో ఎలా నిండి ఉన్నాయో స్పష్టంగా దర్శిస్తున్నాడు.

స్థావర జంగమాత్మక మైన సమస్త భూత సముదాయాన్ని కూడా విశ్వరూపంలో వీక్షిస్తున్నాడు. కదలకుండా ఉండే పర్వత వృక్షాదులు స్థావరాలు. మానవులతో సహా, చరించే జంతుజాల మంతా కలిసి జంగమాలు. ఇవి స్థావర జంగమాలు. చరాచరాలు. ఇలా వివిధములైన జాతులు, వాటి రూపాలు, వాటి చలనాలు - జరాయుజాలు, అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, భూచరాలు, ఖేచరాలు, జలచరాలు - అన్నిటినీ దర్శిస్తున్నాడు ధనంజయుడు.

వాటితో పాటు దివ్యములైన ఉరగాలను కూడా, అంటే వాసుకి మొదలైన ఉత్తమ సర్పాలను కూడా చూస్తున్నాడు ***(సర్వాన్ ఉరగాన్ చ వాసుకీ ప్రభృతీన్ దివ్యాన్ దివి భవాన్).*** సర్పాలను ఉరగములు అంటారు. 'ఉరము' అంటే ఛాతి. ఛాతితో గమించేది, అంటే నడిచేది కనుక పాముకు 'ఉరగము' అని పేరు ***(ఉరసా గచ్ఛతి ఇతి ఉరగః).***

**అనేక బాహూదర వక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోஉనన్తరూపమ్ ।**
**నాన్తం న మధ్యం న పున స్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప ॥ 16**

***అనేక బాహూదర వక్త్రనేత్రం-పశ్యామి-త్వాం-సర్వతః-అనంతరూపం***
***న-అంతం-న-మధ్యం-న-పునః-తవ-ఆదిం-పశ్యామి-విశ్వేశ్వర-విశ్వరూప***

విశ్వేశ్వర = విశ్వేశ్వరుడా!
విశ్వరూప = విశ్వరూపుడా!
అనేక బాహూదర వక్త్రనేత్రం = అనేకములైన బాహువులు, పొట్టలు, ముఖములు, నేత్రములు కలిగి
సర్వతః = అన్నిచోట్ల
అనంతరూపం = అనంత రూపములతో
త్వాం = నిన్ను
పశ్యామి = చూస్తున్నాను
పునః = మరియు
తవ = నీ యొక్క
ఆదిం = ఆరంభమును
న పశ్యామి = చూడలేక పోతున్నాను
అంతం = అంతమును
న = చూడలేక పోతున్నాను
మధ్యం = నడుమను
న = చూడలేక పోతున్నాను





**విశ్వేశ్వరా! విశ్వరూపా! అనేక బాహువులు, ఉదరాలు, ముఖాలు, నేత్రాలు, అంతము లేని రూపాలతో శోభిస్తున్న నిన్ను అన్ని వైపుల చూస్తున్నాను. నీకు ఆది ఎక్కడో, అంత మెక్కడో నాకు కనిపించడం లేదు.**

**వ్యాఖ్య**

మన దేహంలో అగుపించే వన్నీ మనకు సంబంధించినవే అయినట్లు, విశ్వరూపునిలో గోచరించే వన్నీ విశ్వమూర్తికి సంబంధించినవే. ఆయనలో అనేక బాహువులు కనిపిస్తున్నాయి. అంటే, అందరి బాహువులూ ఆ దివ్యాత్మునివే అని అర్థం. అలాగే అందరి కడుపులు ఆయనివే **(అనేక బాహువః ఉదరాణి).**

అందరి బాహువులు, అందరి పొట్టలు ఆయనివే అయినపుడు, ఎవరి పొట్ట కొట్టినా అది విశ్వమూర్తికే తగులుతుంది. ఎవరి పొట్టకు పెట్టినా అది విశ్వరూపునే తృప్తి పరుస్తుంది. శ్రీకృష్ణునికి ద్రౌపది ఒక శాకమును అందిస్తే, దాని ఫలితంగా దుర్వాస మహర్షి పరివార మంతా, వేల సంఖ్యలో భోంచేసి, ఆకలి తీర్చుకోవడం జరిగింది అని మనం భారతములో చూచే ఉన్నాము కదా! విశ్వరూప దర్శనానుభూతి కేవలం వినోదం కాదు. అది అర్థమైతే, బ్రతుకులు జ్ఞానపూరిత మౌతాయి. జీవితాలు తాత్త్విక అవగాహనతో శోభిస్తాయి.

అన్ని బాహువులు పరమేశ్వరునివే. అన్ని ఉదరాలు పరమేశ్వరునివే. అలాగే అన్ని ముఖాలు, అన్ని నేత్రాలు భగవంతునివే. ఇది అర్థమైతే, పూర్వం కన్నా అధికంగా, అందంగా అన్యులను అర్థం చేసుకోగలం. అందరినీ ప్రసన్నంగా వీక్షించగలం.

ఇక్కడ అనేకములు అని పదే పదే చెప్పడంలో ఆ రూపాలు అసంఖ్యాకంగా గోచరిస్తున్నాయి అని అర్థం. పైగా వాటికి అంత మెక్కడో తెలియడం లేదట **(న అన్తం అన్తః అవసానం).** మధ్య మెక్కడో అర్థం కావడం లేదట. రెండు అంచులు తెలిస్తే కదా, మధ్య మెక్కడో అర్థ మయ్యేది! అంతం తెలియడం లేదు కనుక మధ్య మెక్కడో తెలిసి రావడం లేదు. మధ్యం తెలియడం లేదు కనుక ఆది అగమ్య గోచరమైంది **(న ఆదిం పశ్యామి).** ఆదిమధ్యాంతాలు అర్థం కాకుండా విశ్వరూపుడు ప్రకాశిస్తున్నాడు అంటే ఆయన అనంతంగా అలరారు తున్నాడు అని అర్థం.

**కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్ ।**
**పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తాన లార్క ద్యుతి మప్రమేయమ్ ॥ 17**

**కిరీటినం-గదినం-చక్రిణం-చ-తేజోరాశిం-సర్వతః-దీప్తిమంతం**
**పశ్యామి-త్వాం-దుర్నిరీక్ష్యం-సమంతాత్-దీప్తాన లార్క ద్యుతిం-అప్రమేయం**

కిరీటినం = కిరీటము గల వానిని
గదినం = గదాధరుని
చక్రిణం చ = చక్రధరుని
సర్వతః = అంతటా
దీప్తిమంతం = ప్రకాశించుచున్న వానిని
తేజోరాశిం = తేజోరాశిగా
దుర్నిరీక్ష్యం = చూడశక్యము గాని వానినిగా
దీప్తానలార్క ద్యుతిం = ప్రజ్వలించెడి అగ్ని సూర్యుల కాంతి గల వానినిగా
అప్రమేయం = అప్రమేయునిగా
సమంతాత్ = అంతటను
త్వాం = నిన్ను
పశ్యామి = చూస్తున్నాను

**స్వామీ! కిరీటము పెట్టుకొని, గదను పట్టుకొని, చక్రమును ధరించి తేజోరాశిగా సర్వత్ర ప్రకాశిస్తున్నావు. చూడ శక్యం గాని ప్రజ్వలిత అగ్ని సూర్య తేజము వంటి కాంతితో అప్రమేయంగా శోభిస్తున్న నిన్ను దర్శిస్తున్నాను.**

**వ్యాఖ్య**

ధ్యానమయ జీవితాన్ని కొనసాగించ డానికి, ఉపాసనా సౌలభ్యం కొరకు అసమానమైన, అలౌకికమైన అద్భుత దర్శనాన్ని ఈ శ్లోకం మన కళ్ళ ముందు ఆవిష్కరించి, హృదయంలో సుప్రతిష్ఠం చేస్తుంది.

**సగుణారాధన - సాకారోపాసన**

కిరీటధారియై, చక్రగదాహస్తుడై కనిపిస్తున్నాడు అంటే విశ్వమూర్తిలో విష్ణుమూర్తి సాకారంగా దర్శన మిస్తున్నాడు అని అర్థం. ఇది ధ్యానావేశాన్ని కలిగించే జ్ఞాన విషయము. దీనిని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఈ కిరీటధారి, చక్రగదాహస్తుడు విశ్వమూర్తి కాడు. అంతెందుకు? విశ్వమూర్తి తానే అయిన శ్రీకృష్ణ పరమాత్మ కూడా ఆ విశ్వరూపంలో దృశ్యంగా శోభిస్తున్నాడు. ఇదొక అద్భుతమైన విషయం. తనలో తాను తానుగా మన కోసం దర్శనాన్ని అనుగ్రహించడ మనేది పరమేశ్వరుని దయా విభూతి.

దివ్యమైన మకుటంతో ధ్యేయరూపుడై ధ్యానావేశమును కల్పిస్తున్న జగన్నాథుడు భక్తవత్సలుడు. ఒక చేతిలో చక్రమును, మరొక చేతిలో గదను పట్టుకొని దివ్యంగా ప్రకాశిస్తున్నాడు. అంటే చతుర్భుజుడైన శ్రీకృష్ణుని దర్శనం జరుగుతూ ఉంది. ధ్యానమూర్తి కళ్ళ ముందే కళకళ లాడుతున్నాడు. ఆ వైభవమూర్తిని మెల్లగా హృదయం లోకి దించుకోవాలి. ఇది ఉపాసనా విశేషంతో, ధ్యాన వైభవంతో శోభిస్తున్న శ్లోకం.

కిరీటాన్ని ధరించి కళకళ లాడుతున్న శ్రీకృష్ణమూర్తి, చక్రగదాధరుడై దర్శన మిస్తున్నాడు. లోక రక్షణార్థం, భక్త సంరక్షణార్థం పరమేశ్వరుడు చక్రగదాధరుడై అలరారు తున్నాడు ***(లోక రక్షణార్థం ధారయతీతి చక్ర గదాధరః).*** ఇది చతుర్భుజుడైన శోభనమూర్తి దివ్యదర్శనం. ధ్యానార్థం, ఉపాసనార్థం ప్రదర్శింప బడిన అలౌకిక రూపము. చతుర్భుజ మూర్తి దివ్యదర్శనం.

ఈ శ్లోకంలో గదాచక్రహస్తు డైన ద్విబాహుమూర్తిని అర్జునుడు వర్ణిస్తూ ఉంటే, మీరు చతుర్భుజు డని వ్యాఖ్యానిస్తా రేమిటి? అనే సందేహం మీకు రావచ్చు. గదాచక్రాలను ప్రస్తావిస్తున్నాడు అంటేనే చతుర్బాహుని దర్శిస్తున్నాడని అర్థం. చతుర్భుజాలతో శోభించే మూర్తి లోనే గదాచక్రాలు ప్రకాశిస్తూ ఉంటాయి.

***చత్వారః భుజాః అస్యేతి చతుర్భుజః -*** నాలుగు భుజాలు కలిగిన వాడు చతుర్భుజుడు. కురుక్షేత్రంలో శ్రీకృష్ణమూర్తి అలాగే దర్శన మిచ్చాడు. ఇది కేవలం ఉపాసనార్థం శోభించే రూపము. ఈ రూపంతో భక్తులు పరమేశ్వరుని ఉపాసిస్తే, లేదా ధ్యానిస్తే, పరమేశ్వరుడు భక్తుల్ని అనుగ్రహించి రక్షిస్తాడు. అదే చతుర్భుజుని భక్త సంరక్షణము.

**ఉపాసనా స్ఫూర్తి**

పవిత్ర పూజా వేళ భగవంతుని ధ్యానించడానికి ఆయన చతుర్భుజ రూపము భక్తులకు గొప్ప స్ఫూర్తి నిస్తుంది. ధ్యానావేశాన్ని, ధ్యానాసక్తిని ప్రసాదిస్తుంది. భగవంతుడు నాలుగు భుజాలతో శోభిస్తూ ఉంటాడు. పై నున్న రెండు భుజాలలో ఒక చేతిలో శంఖము, మరొక చేతిలో చక్రము ఉంటాయి. క్రింది వైపు ఉన్న రెండు భుజాలలో ఒక చేతిలో గద ఉంటే, మరో చేయి అభయ ముద్రను అభినయిస్తూ ఉంటుంది.

శంఖము శబ్ద హేతువు. శాస్త్ర హేతువు. శంఖారావ మనేది శాస్త్రం యొక్క ఘోష. ప్రమాణము యొక్క పిలుపు. ప్రమ అంటే జ్ఞానము. జ్ఞానమును ప్రసాదించేది కనుక శాస్త్రము ప్రమాణము ***(ప్రమాకరణం ప్రమాణం).*** శాస్త్రాన్ని ప్రమాణంగా స్వీకరించే వారు భ్రమ నుండి, భ్రాంతి నుండి విముక్తిని పొందుతారు. అజ్ఞానమును అంతం చేసుకొని జ్ఞానంతో శోభిస్తారు. భగవంతుని శంఖము పేరు పాంచజన్యము.





భగవంతుడు ధరించిన శంఖమును 'పాంచజన్యం' అంటారు. సముద్రములో చీకటి రూపంతో సంచరించే రాక్షసుడు పంచజనుడు. అతని ఎముక నుండి పుట్టింది కనుక అది పాంచజన్యము ***(పంచజనాఖ్యస్య అసురస్య అస్థిజత్వాత్ పాంచజన్యః).*** పంచజనుడనే చీకటి రాక్షసుని సముద్రంలో హత మార్చినట్లు, పంచభూతాలతో నిర్మితమైన దేహంపై మమకారం పెట్టుకొని అజ్ఞానాంధకారంలో అలమటిస్తూ, సంసార సముద్రంలో నిమగ్నమై ఉన్న మానవుల అజ్ఞానాన్ని భగవంతుడు అంతం చేస్తాడు. ఇదే పాంచజన్యము యొక్క సందేశము.

శాస్త్రం నిర్దేశించిన మార్గంలో పయనించే భక్తులకు అవాంతరాలు, ప్రతిబంధకాలు ఎదురై నపుడు, సాధన ముందుకు సాగదు. ఆ ప్రతిబంధకాలు కూడా పరమేశ్వరుని కృపతో నివారింప బడతాయి. ప్రతిబంధకా లనేవి బాహ్యంలో ఉంటాయనుకుంటే పొరపాటు. మన మనస్సులలో కాపుర మున్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాదులే ప్రతిబంధకాలు. వాటిని నివారించి, భక్తుల్ని రక్షించేందుకు చతుర్భుజమూర్తి రెండవ చేతిలో చక్రమును ధరించి ఉంటాడు.

భగవంతుని చేతి లోని చక్రము రాక్షసులను ఖండించింది అని పురాణాలు చెబుతాయి. కామక్రోధాది రాక్షసుల్ని కూడా హతమార్చి భక్తుల్ని కాపాడటానికే భగవంతుని చేతిలో చక్రముంది. పైగా అది 'సుదర్శన' చక్రము. భక్తులను కృప జూచి రక్షించే మంగళాయుధము. భక్తుల్ని భగవంతుడు చల్లగా చూడటమే సుదర్శనము. అంతేకాదు. సుదర్శన చక్రమును ధరించిన చతుర్భుజుడు సుదర్శనుడు. భక్తులకు సుదర్శనుడు. అంటే, భక్తుల చేత సుఖంగా, సులభంగా దర్శింప బడేవాడు ***(సుఖేన దృశ్యతే భక్తైః ఇతి సుదర్శనః).***

ఇక, క్రింది వైపుకు ఉన్న రెండు భుజాలలో, ఒక చేతిలో గద ఉంటుంది. దాని పేరు 'కౌమోదకీ'. పరమేశ్వరుని చేతి లోని ఈ గద ఆనంద ప్రదాయిని.

పాంచజన్యము ప్రమాణాన్ని ప్రసాదిస్తే, సుదర్శనము శత్రు సంహారం గావించి, పరమేశ్వరుని దర్శింప చేస్తుంది. పరమాత్మ దర్శనంలో పరితోషమే గాని, పరితాప మెక్క డుంటుంది? ఆ పరితోషమే, పరమానందమే కౌమోదకీ అనే గద.

**కౌమోదకీ - కుం భూమిం, మోదయతి హర్షయతి ఇతి కౌమోదకో విష్ణుః.** 'కుం' అంటే భూమి. 'మోదయతి' అంటే సంతోషాన్ని కలిగించేది. అదే 'కౌమోదకీ' అనే జగన్నాథుని గదాయుధం. పరమేశ్వరుని ఉపాసించే భక్తులకు ఆనందాన్ని, పరమానందాన్ని ప్రసాదించేది.

భక్తులు భగవంతుని పాదాలను ఆశ్రయించి అర్చిస్తూ ఉంటారు. చతుర్భుజమూర్తి ధరించిన శంఖచక్రాలు పైన ఉంటాయి. కాని, ఈ కౌమోదకీ అనే గద మాత్రం క్రింద వైపున భగవంతుని చరణాలకు దగ్గరగా ఉంటుంది. ఎవరు భగవంతుని పద సరోజాలను ఆరాధిస్తారో, ఉపాసిస్తారో, వారికి పరమానందాన్ని ప్రసాదించడానికి నేను ప్రక్కనే ఉంటాను అని చెప్పకనే చెబుతుంది కౌమోదకీ గద.

శంఖచక్ర గదా హస్తుని ఈ విధంగా ఆశ్రయించిన భక్తులకు భగవంతుడు అభయాన్ని అనుగ్రహిస్తున్నాడు అనే దానికి సంకేతంగా తన నాల్గవ చేతితో అభయ ముద్రను ప్రదర్శిస్తాడు.

**జ్యోతిర్మయం**

దివ్యమైన చతుర్భుజ రూపంతో శోభిస్తున్న పరమేశ్వరుడు సర్వత్ర దీప్తిమంతుడై ఉన్నాడు ***(సర్వతో దీప్తిమంతమ్).*** చూడశక్యం కానివాడై ప్రకాశిస్తున్నాడు ***(దుర్నిరీక్ష్యం).*** దీప్తిమూర్తిగా శోభిస్తున్నాడు. ప్రకాశవంత మైన మూర్తి దీప్తిమూర్తి. అంటే జ్ఞానమయ స్వరూపము ***(దీప్తా జ్ఞానమయీ మూర్తిః యస్య ఇతి).*** మహా తేజోమయ స్వరూపము. వేయి మంది సూర్యులు ఒకేసారి ఆకాశంలో విరజిమ్మే ప్రకాశముతో సమానుడు, లేక

దానిని గూడా అతిశయించి ఉండేవాడు' అని సంజయుడు అభిప్రాయ పడటానికి ఆ దివ్య తేజస్సే కారణము. అలాంటిది జ్ఞానమయ ప్రకాశమే కనుక దీప్తిమూర్తిని **అప్రమేయమ్**గా అభివర్ణించాడు అర్జునుడు ***(అప్రమేయమ్ న ప్రమేయమ్ ఇతి).***

**అప్రమేయం**

జ్యోతిర్మయుడైన పరమేశ్వరుడు ఏ ప్రమాణాలకు అందని వాడు ***(ప్రమాణ అవిషయః)*** కావడం చేత ఆయన అప్రమేయుడు. ప్రత్యక్షాది ప్రమాణాలకు అంతుపట్టని వాడు. అగమ్య గోచరుడు. జ్యోతిర్మయుడు. ఆయన స్వప్రకాశ స్వరూపుడు కనుక తనను ప్రకాశింప చేయడానికి మరొక ప్రకాశం అవసరం లేని వాడు. మరొక ప్రకాశం చేత ప్రకాశింప బడితే, తాను స్వప్రకాశు డెలా అవుతాడు? పర ప్రకాశం చేత ప్రకాశింపబడే వాడు స్వప్రకాశం కానివాడై జడ మవుతాడు. కానీ, ప్రమాణ - ప్రమేయ - ప్రమాతలను ఒకేసారి ప్రకాశింప చేసే సాక్షీ ప్రకాశమే జ్ఞానమయ దీప్తిమూర్తి.

ఇక్కడ సందర్భము కాకపోయినా, ఈ విశ్లేషణలో అనివార్యంగా ఒక సందేహము తలెత్తుతుంది. ఏ ప్రమాణము కూడా అప్రమేయుని విషయంలో ఫలించ నపుడు శాస్త్రము మాత్రం ప్రమాణ మెలా అవుతుంది? ఆత్మ, లేదా పరమాత్మ విషయంలో శాస్త్ర ప్రమాణము కూడా నిష్ఫలమే కదా! అని పూర్వపక్షము తప్పక ఎదు రవుతుంది.

శాస్త్రము అప్రమాణం కానే కాదు. శాస్త్రము ప్రమాణమే. కాకపోతే, ప్రత్యక్షాది ప్రమాణాల వలె కాకుండా, శాస్త్ర ప్రమాణంగా, విలక్షణ లక్షణంగా ప్రమాణ మవుతుంది. దీప్తిమంతు డైన పరమేశ్వరుని ప్రకాశింప చేసే ప్రమాణంగా కాకుండా, అజ్ఞానం వల్ల ఆరోపించ బడిన వాటిని తొలగించడం అనే కార్యం వల్ల శాస్త్రం ప్రమాణ మవుతుంది ***(అధ్యస్త అతద్రూప నివర్తకత్వేన).*** ఆరోపాలు తొలగితే అప్రమేయ జ్యోతిర్మయ స్వరూపము స్వప్రకాశమై భాసిస్తుంది. కనుక, దీప్తిమూర్తి జ్ఞానమూర్తియే. ఈ జ్ఞానమూర్తియే ఉపాసనా వేళలో ధ్యానమూర్తి.

***కళ్ళు తెరచినపు డెల్ల కాంతులు కానరావు***
***కళ్ళు మూసిన క్షణాన తిమిరాలు లేకపోవు***
***కళ్ళు మూసి కొందును సదా ఉన్న దాని కొరకు***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*విశ్వరూపము సప్రపంచంగా, సాకారంగా, సోపాధికంగా ఈశ్వర వైభవాన్ని ప్రదర్శించడం చూచి, నిరుపాధిక మైన అక్షర పరబ్రహ్మ స్వరూపాన్ని అర్జునుడు ఊహిస్తున్నాడు.*

**త్వ మక్షరం పరమం వేదితవ్యం త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్ ।**
**త్వ మవ్యయః శాశ్వత ధర్మగోప్తా సనాతన స్త్వం పురుషో మతో మే ॥** 18

***త్వం-అక్షరం-పరమం-వేదితవ్యం-త్వం-అస్య-విశ్వస్య-పరం-నిధానం***
***త్వం-అవ్యయః-శాశ్వత ధర్మగోప్తా-సనాతనః-త్వం-పురుషః-మతః-మే***

| | | | | | |
|---|---|---|---|---|---|
| త్వం | = | నీవు | వేదితవ్యం | = | తెలియదగిన వాడవు |
| అక్షరం | = | అవినాశివి | త్వం | = | నీవు |
| పరమం | = | పరమాత్మవు | అస్య | = | ఈ |





| | | | | | |
|---|---|---|---|---|---|
| విశ్వస్య | = | విశ్వమునకు | త్వం | = | నీవు |
| పరం | = | పరమైన | సనాతనః | = | సనాతనుడవైన |
| నిధానం | = | ఆశ్రయుడవు | పురుషః | = | పురుషుడవు |
| త్వం | = | నీవు | మే | = | నా యొక్క |
| శాశ్వత ధర్మగోప్తా | = | సనాతన ధర్మమును రక్షించెడి | మతః | = | అభిప్రాయము |
| అవ్యయః | = | నిత్యుడవు | | | |

**భగవాన్! నువ్వు అక్షరమైన పరబ్రహ్మవు. తెలియదగిన వాడివి నీవే. ఈ విశ్వానికి మూల కారణం నీవే. నీకు వినాశము లేదు. నీవు శాశ్వత ధర్మరక్షకుడివి. సనాతనుడైన పురుషుడు నీవే అని నా భావము.**

**వ్యాఖ్య**

**వర్తనము - పరివర్తనము**

బాహ్యంలో ఏది కనిపిస్తూ ఉందో, అది అంతర్యంలో కనువిప్పును కలిగిస్తూ ఉంది. బాహ్యంలో ప్రత్యక్షంగా ఉన్న రూపము అంతర్యం లోని స్వరూప వైభవాన్ని ఊహించేలా చేస్తూ ఉంది. కృష్ణా! నీ యోగైశ్వర్యమును వీక్షించి నేను ఊహిస్తున్నాను ***(తే యోగశక్తి దర్శనాత్ అనుమినోమి)*** అంటున్నాడు అర్జునుడు.

కళ్ళెదుట దీప్తిమంత మైన విశ్వరూపము కమనీయంగా కదుల్తూ ఉంది. అక్షరంగా ఉంది. అక్షములు అంటే ఇంద్రియాలు అని కూడా అర్థం. అవే నేత్రాలు. నేత్రాలకు రమణీయంగా గోచరం కావడం చేత విశ్వరూపుని సాకార రూపము అక్షరంగా ఉంది. ఈ భావము అంతర్యంలో అంతరీక్షణను ప్రేరేపించి, అక్షర రూపుడైన ఏ పరబ్రహ్మమును గూర్చి శాస్త్రం ద్వారా అర్జునుడు శ్రవణం చేశాడో, అట్టి నిరుపాధిక సాక్షీ చైతన్యం వైపుకు అతని బుద్ధిని మరలిస్తూ ఉంది. వర్తనమును ఆధారం చేసుకొని పరివర్తనం జరుగుతూ ఉంది.

**ఏతేన సగుణ రూపస్య నిర్గుణ జ్ఞాపకత్వం ఉక్తమ్**

'సాకారము నిరాకారమును జ్ఞాపకం చేస్తూ ఉంది అని చెప్పబడింది' అని నీలకంఠ వ్యాఖ్య.

సాకారము ఏదో కాదు, నిరాకారము యొక్క రూపమే. మట్టి ద్రవ్యమైతే, కుండ దాని రూపము. స్వర్ణము ద్రవ్యమైతే, ఆభరణము దాని రూపము. అలాగే విశ్వరూపంలో గోచరిస్తున్న సమస్త రూపాలు ఏవో కావు. అక్షరమైన అవ్యక్త పరబ్రహ్మము యొక్క వ్యక్తరూపాలు. అవి విశ్వవ్యాప్తంగా గోచరించడం చేత అది విశ్వరూప మైంది. హే భగవాన్! ఈ వ్యక్తమైన విశ్వరూపానికి ***(అస్య విశ్వస్య)*** పరమాశ్రయము ***(పరమం నిధానమ్),*** అక్షర రూపుడవైన నీవే ***(త్వమక్షరం).*** కనుక, వ్యక్తమయ్యే ఈ విశ్వరూపం ద్వారా కూడా తెలియ దగిన వాడివి నీవే ***(వేదితవ్యం జ్ఞాతవ్యం ముముక్షుభిః)*** అంటున్నాడు అర్జునుడు.

ఇంతకీ, అర్జునుడు దర్శిస్తున్న విశ్వరూపంలో ఏది విశ్వము? విశ్వము ఎక్కడ? బ్రహ్మము కన్నా విలక్షణంగా, అన్యంగా ఏది ఉందని దానిని విశ్వమని పిలవాలి? ఉన్నది అద్వయ సత్తా స్వరూపమైన పరబ్రహ్మమే. ఆ పరబ్రహ్మము యొక్క వ్యక్త రూపమునే విశ్వం అంటున్నాం. అది రూపం కనుక విశ్వరూపం.

మట్టికుండలో కుండ ఎక్కడుంది? ఉన్నదంతా మట్టే. కుండ రూపంలో ఉన్నది మట్టే. మట్టే ఉంది, మట్టే ఉంటుంది. మట్టి యొక్క రూపమే కుండ. మట్టికి విలక్షణంగా, మట్టి కన్నా అన్యంగా కుండ లేనే లేదు. కుండ క్షరం. మట్టి అక్షరం. కనుక, తెలియదగింది మట్టే కాని కుండ కాదు. కుండ కనిపించినా అది మట్టినే

జ్ఞాపకం చెయ్యాలి. విశ్వం కనిపించినా అది విశ్వనాథునే దర్శింప చేయాలి. అదే జరిగింది అర్జునునికి ప్రస్తుత శ్లోకంలో. ఉన్న దొక్కటే. దానికి అన్యంగా ఏదీ లేదు అని భగవానువాచ *(మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి - 7 వ అ - 7 వ శ్లో).*

విశ్వము గోచరించినా, అది శాశ్వతము లైన వేద ధర్మముల చేతనే సాగుతూ ఉంది. వేదము ఏదో కాదు. జ్ఞానమే. బ్రహ్మ జ్ఞానమే. బ్రహ్మము, జ్ఞానము వేరు కావు కనుక బ్రహ్మము శాశ్వతము. వేద ధర్మము శాశ్వతము. అందుచేత బ్రహ్మము శాశ్వతమైన ధర్మ రక్షకుడు *(శాశ్వత ధర్మ గోప్తా, శశ్వత్ భవః శాశ్వతః నిత్యః ధర్మః తస్య గోప్తా శాశ్వత ధర్మగోప్తా).* కనుక, 'హే కృష్ణా! నువ్వే సనాతన పురుషుడవు అని నా అభిప్రాయము' అంటున్నాడు అర్జునుడు *(చిరంతనః త్వం పురుషః మతః అభిప్రేతః మే మమ).*

**అనాదిమధ్యాన్త మనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్య నేత్రమ్ ।**
**పశ్యామి త్వాం దీప్తహుతాశ వక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్ ॥** 19

*అనాదిమధ్యాంతం-అనంతవీర్యం-అనంతబాహుం-శశిసూర్యనేత్రం*
*పశ్యామి-త్వాం-దీప్తహుతాశవక్త్రం-స్వతేజసా-విశ్వం-ఇదం-తపంతం*

| | | | |
|---|---|---|---|
| త్వాం | = నిన్ను | స్వతేజసా | = స్వీయమైన తేజస్సు చేత |
| అనాదిమధ్యాంతం | = ఆదిమధ్యాంత రహితుడుగా | ఇదం | = ఈ |
| అనంతవీర్యం | = అంతములేని తేజోవంతుడుగా | విశ్వం | = విశ్వమును |
| అనంతబాహుం | = అనంతమైన బాహువులు గల వానినిగా | తపంతం | = తపింపజేయు వానినిగా |
| శశిసూర్యనేత్రం | = చంద్రసూర్యులు కన్నులుగా గల వానినిగా | పశ్యామి | = చూస్తున్నాను |
| దీప్తహుతాశ వక్త్రం | = ప్రజ్వలించుచున్న అగ్ని ముఖముల యందు గల వానినిగా | | |

**ప్రభూ! నీకు ఆది మధ్యాంతాలు లేవు. నీ పరాక్రమానికి అంతం లేదు. నీ బాహువులు అనంతములు. చంద్రాదిత్యులు నీ నేత్రాలు. ప్రజ్వలిస్తున్న అగ్ని నీ ముఖం. నీ ప్రకాశం చేత ఈ ప్రపంచాన్నంతా తపింప చేస్తున్న నిన్ను నేను దర్శిస్తున్నాను.**

**వ్యాఖ్య**

పరిచ్ఛేద శూన్యమైన రూపం కావడం చేత ఆయన ఆదిమధ్యాంత రహితుడు. అనంతుడు. కాని, ఇది విశ్వరూపము. అందుచేత అపరిచ్ఛిన్నుడే అయినా, అన్ని రూపాలు తానే కావడం చేత, అన్ని రూపాలు తన లోనే ఉండటం చేత, ఆ దివ్యరూపంలో ఎక్కడ చూచినా విశ్వమే గోచరిస్తూ ఉన్నందున, ఏది మొదలో, ఏది మధ్యమో, ఏది చివరో అర్థం కాదు. అందుచేత, ఆయన అనాది మధ్యాంతుడు *(ఆదిశ్చ మధ్యం చ అన్తశ్చ న విద్యతే యస్య).*

వీర్యం అంటే శక్తి, లేదా పరాక్రమము. ఆయన పరాక్రమము అంతము లేనిది కనుక ఆయన అనంతవీర్యుడు. అపరిమిత మైన శక్తివంతుడు. విశ్వంలో ఎక్కడ ఏ విధమైన శక్తి గోచరించినా అది భగవంతుని శక్తియే. అందుచేత ఆయనిది అనంతమైన శక్తి. సృష్టి కార్యానికి ఆధారమైన శక్తి.

అందరి బాహువులు తనవే కావడం చేత ఆయన అనంత బాహువులు కలవాడు. అందరి లోని బాహు బలము భగవంతునిదే. అందుచేతనే బలవంతులలో బలము తానే నని విభూతిగా అభివర్ణించుకున్నాడు.





చంద్రసూర్యులు ఆయన నేత్రాలు. అంతరిక్షము ఆ దివ్యాత్ముని దేహము కాగా, చంద్రసూర్యులు నేత్రాలుగా, నేత్రాలపై ఉన్న ఫాల భాగము స్వర్గ లోకంగా, పృథివి పాదముగా మనస్సుకు అందుతూ ఉంటుంది. దీనినే అవలోకించి ఓ వెన్నముద్దను అర్పించుకుంది చిన్నికృష్ణ శతకం.

**ఉరమును శ్రీదేవి ఆశ్రయించె**
**శశిసూర్యులు కళ్ళలో కదలుచుండె**
**నాభి కమలమున బ్రహ్మ చేరిపోయె**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణ ॥**

అని శశిసూర్యనేత్రుని భావించి పులకరించింది చైతన్య హృదయం.

భగవంతుడు ప్రజ్వలిస్తున్న అగ్నియే ముఖంగా కలవాడు **(దీప్త హుతాశ వక్త్రమ్).** 'హుతము' అంటే సమర్పించడము అని అర్థము. యజ్ఞయాగాదులలో మనం ఇంద్రాది దేవతలకు ఏది సమర్పించినా, దానిని అగ్ని ద్వారానే సమర్పిస్తాము. మనం అర్పించే హుతమును ఆరగించి, ఆ తరువాత ఆయా దేవతలకు అందించే వాడు కావడం చేత అగ్నిదేవుడు హుతాశనుడు. అర్పించిందంతా ఆరగించే వాడు **(హుతం అశ్నాతి).** అట్టి అగ్నిని ముఖంగా కలిగి ఉన్నందున విశ్వరూపుడు హుతాశవక్త్రుడు. తేజోమయుడై యావద్విశ్వమును దీప్తిమంతం చేస్తున్నాడు.

**ద్యావా పృథివ్యో రిద మన్తరం హి వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః ।**
**దృష్ట్వాద్భుతం రూప ముగ్రం త వేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ ॥** 20

**ద్యావాపృథివ్యోః-ఇదం-అంతరం-హి-వ్యాప్తం-త్వయా-ఏకేన-దిశః-చ-సర్వాః**
**దృష్ట్వా-అద్భుతం-రూపం-ఉగ్రం-తవ-ఇదం-లోకత్రయం-ప్రవ్యథితం-మహాత్మన్**

| | | | |
|---|---|---|---|
| మహాత్మన్ | = మహాత్మా! | తవ | = నీ యొక్క |
| ద్యావాపృథివ్యోః | = భూమ్యాకాశాల యొక్క | అద్భుతం | = అద్భుతమైన |
| ఇదం | = ఈ | ఉగ్రం | = భయంకరమైన |
| అంతరం | = మధ్యప్రదేశము | ఇదం | = ఈ |
| సర్వాః | = సమస్తమైన | రూపం | = రూపమును |
| దిశః చ | = దిక్కులు | దృష్ట్వా | = చూచి |
| ఏకేన | = ఒక్కడవైన | లోకత్రయం | = మూడు లోకములు |
| త్వయా | = నీ చేత | ప్రవ్యథితం | = భయపడు తున్నాయి |
| వ్యాప్తం హి | = వ్యాపింపబడి యున్నవి కదా! | | |

**మహాత్మా! భూమ్యాకాశాలు, అంతరిక్షము, సమస్తము నీ చేత వ్యాపించబడి ఉన్నాయి. అన్ని దిక్కులలో నువ్వే ప్రకాశిస్తున్నావు. భయంకరమైన నీ అద్భుత రూపాన్ని చూచి ముల్లోకాలు భీతి చెందు తున్నాయి.**

**వ్యాఖ్య**

అంతటా పరమేశ్వరుడే వ్యాపించి ఉన్నాడు. తూర్పు పశ్చిమ, ఆగ్నేయ వాయవ్యాది దిక్కు లన్నీ తానే వ్యాపించి ఉన్నాడు. అన్ని దిక్కులు ఆయన ఒక్కని చేతనే, ఆ విశ్వరూపుని చేతనే వ్యాపించబడి ఉన్నాయి **(త్వయా ఏకేన విశ్వరూప ధరేణ వ్యాప్తం).** విశ్వమంతా విశ్వరూపుని చేత వ్యాపించబడి ఉన్నపుడు, విశ్వరూపుని కన్నా అన్యమైనది విశ్వంలో ఏముంటుంది? ఇక్కడ కాస్త జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

***యేన యద్వ్యాప్తం తత్తన్మాత్ర మేవ*** - 'ఏది దేని చేత వ్యాపించబడి ఉందో అది అది మాత్రమే' అనేది న్యాయం. అంటే, మట్టికుండ మట్టి చేత వ్యాప్తమై ఉంది అంటే, మట్టికుండ అనేది మట్టి మాత్రమే అని అర్థం. ఇదే వ్యాప్య వ్యాపక ధర్మము.

ఇంతవరకు బాగుంది. ఏ బాధ లేదు. ఆ తరువాతే భయం పట్టుకుంది. అంతటా పరమేశ్వరుడే వ్యాపించి ఉన్నాడని అర్జునుడు విన్నవించడంలో వింత ఉంటే ఉండవచ్చు. విడ్డూరము ఎలా ఉంటుంది? మహాత్మా! నీ రూపాన్ని చూచి ముల్లోకాలు ***(లోకత్రయం)*** బాధ పడుతున్నాయి. భయ పడుతున్నాయి ***(ప్రవ్యథితమ్ భీతం, ప్రచలితం)*** అనేదే కాస్త మింగుడు పడని విషయంగా కనిపిస్తూ ఉంది.

నువ్వు ఒకరిని భయపెట్ట వచ్చు. నిన్ను చూచి నువ్వు భయపడతావా? విశ్వంలో వ్యాప్తమై ఉండేది విశ్వరూపు డొక్కడే అయి నపుడు, విశ్వరూపాన్ని చూచి భయపడే దెవరు? భయానికి హేతువు ఉండాలి కదా! విశ్వరూప దర్శనంలో భయహేతు వెవరు? భయ మెవరికి? దీనిని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. అర్జునుని మాట ప్రకారం భయ హేతువు విశ్వరూపుడు. భయపడేది లోకత్రయము. ఇది మరీ విడ్డూరంగా ఉంది.

విశ్వరూపాన్ని చూచి ముల్లోకాలు భీతి చెంది చలిస్తున్నాయి అంటున్నాడు అర్జునుడు. విశ్వరూపాన్ని ముల్లోకాలు ఎక్కడ చూస్తున్నాయి, భీతి చెందడానికి? ఏ దివ్య నేత్ర ముందని ముల్లోకాలు విశ్వరూపాన్ని దర్శిస్తాయి? ప్రస్తుతం విశ్వరూపాన్ని చూస్తున్నది ఇద్దరే. కురుక్షేత్రంలో అర్జునుడు, హస్తినలో సంజయుడు. ఇంతకీ వీళ్ళిద్దరిలో భయపడే దెవరు? సంజయుడు మాత్రం కానే కాదు. ఎందుకని? ఒకవేళ సంజయుడు భయపడినా, అలా సంజయుడు భయపడుతున్నాడు అని చెప్పడానికి సంజయుడు అర్జునుడి దృష్టికి అందుబాటులో లేడు.

ముల్లోకాలు విశ్వరూపాన్ని దర్శించడం లేదు కనుక, ముల్లోకాలు భీతి చెందటం లేదు. దివ్యదృష్టితో చూస్తున్నా, సంజయుడు భీతి చెందడం లేదు. మరి, ఇక్కడ అర్జునుడు ప్రస్తావించే భయం ఎవరికి సంబంధించింది? వాస్తవానికి భయ మెవరిది? భయపడే దెవరు? ఇంకెవరు! అర్జునుడే. ఆయన ఒక్కడి భయం ముల్లోకాలను చలింప చేసింది.

వాస్తవానికి అర్జునుడు భయపడు తున్నాడా? అనేది ప్రశ్న. వాస్తవానికి భయపడటం కాదు; భయపడటమే వాస్తవం అనేది సమాధానం. ఎందుకని? తాను చూచేవాడు కావడం చేత. ఇది కాస్త విశ్లేషించి తెలుసుకోవలసిన తాత్త్విక విషయం. ఆ అవకాశము ముందు శ్లోకాలలో ఉంది. కనుక అక్కడ చర్చిస్తాను. అర్జునునికి భయ హేతువు ఏమిటో అక్కడ తెలుసుకుందాం.

ప్రస్తుతం, ఈ విషయాన్ని ఈ సందర్భంలో మరో విధంగా చెప్పుకుందాం. భగవంతుడు అభయరూపుడే గాని భయరూపుడు కాడు. భయ హేతువూ కాడు. పైగా భయ నాశకుడు. అభయరూపుడు. కాని, అభయ మూర్తి ఇక్కడ భయ స్ఫూర్తిగా తెలుస్తున్నాడు.

అసలు భయ మనేది ఎందుకు కలుగుతుంది? ఎవరికి కలుగుతుంది? భయపెట్టే దెవరు? భయం అనేది అధర్మపరులకు కలుగుతుంది. వారిని భయపెట్టేది ధర్మము. ధర్మ రూపంలో ఉన్నది దైవమే కనుక, దైవమే అలాంటి వారి విషయంలో భయ హేతువు అని చెప్పుకున్నా దోషం లేదు.

***అసన్మార్గ వర్తినాం భయం కరోతి ఇతి*** - అధర్మంగా చరించే వారు కర్మఫలాలను ఊహించుకొని భీతి చెందుతారు. అలాంటి వారికి అభయరూపు డైన పరమేశ్వరుడు భయ హేతువుగా తెలుస్తాడు. భక్తులైన వారికి అభయ హేతువుగా, ప్రియరూపుడుగా దర్శన మిస్తాడు.





నరసింహ భగవానుడు హిరణ్యకశిపునికి ఉగ్రరూపంతో అగుపించి భయహేతు వయ్యాడు. ప్రహ్లాద భక్తునికి శాంతరూపంతో అగుపించి అభయరూపు డయ్యాడు. భగవంతుని రూపాన్ని సాధువులు దర్శించి తృప్తి చెందుతారు. దుష్టులు దర్శించి భీతి చెందుతారు **(ప్రీయన్తి కేచిత్ తస్య రూపస్య దృష్ట్వా బిభేతి కశ్చిత్).**

**అమీ హి త్వాం సురసంఘా విశన్తి కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।**
**స్వస్తీ త్యుక్త్వా మహర్షి సిద్ధ సంఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః ॥** 21

**అమీ-హి-త్వాం-సురసంఘాః-విశంతి కేచిత్-భీతాః-ప్రాంజలయః-గృణంతి**
**స్వస్తి-ఇతి-ఉక్త్వా-మహర్షి సిద్ధ సంఘాః-స్తువంతి-త్వాం-స్తుతిభిః-పుష్కలాభిః**

| | | | |
|---|---|---|---|
| అమీ | = ఈ | మహర్షి సిద్ధసంఘాః | = మహర్షుల, సిద్ధపురుషుల సమూహము |
| సురసంఘాః | = దేవతాసమూహములు | స్వస్తి ఇతి | = స్వస్తి అని |
| త్వాం | = నిన్ను | ఉక్త్వా | = పలుకుతూ |
| విశంతి | = ప్రవేశిస్తున్నాయి | పుష్కలాభిః | = అనేకములైన |
| కేచిత్ | = కొందరు | స్తుతిభిః | = స్తోత్రముల చేత |
| భీతాః | = భయపడి | త్వాం | = నిన్ను |
| ప్రాఞ్జలయః | = చేతులు జోడించి | స్తువంతి హి | = స్తుతిస్తున్నారు |
| గృణన్తి | = స్తుతిస్తున్నారు | | |

**భగవంతా! దేవతా సమూహాలు నీలో ప్రవేశిస్తున్నాయి. కొందరు భయంతో నమస్కరిస్తూ నిన్ను స్తుతిస్తున్నారు. మహర్షులు, సిద్ధ పురుషులు స్వస్తి పలుకుతున్నారు. స్తోత్రాలతో నిన్ను ప్రార్థిస్తున్నారు.**

**వ్యాఖ్య**

దైవ స్పృహ కలిగిన వారు దేవతలు. దైవ గుణాలతో శోభించే వారు. మహాత్ములైన వారు. అలాంటి వారు కూడా ధర్మం కొరకు యుద్ధరంగంలో ప్రవేశించి ఉన్నారు. వారందరూ ధర్మరూపంలో ఉన్న దైవాన్ని ఆశ్రయించుకున్న వారు. అలాంటి వారి హృదయాలలో దైవమే ప్రకాశిస్తూ ఉన్నందున, వారు కోవెలలో ప్రవేశించినట్లే కురుక్షేత్రంలో ప్రవేశిస్తున్నారు.

అంతటి జ్ఞానం లేనివారు, ధర్మస్పృహ మాత్రమే గల భక్తులు యుద్ధ భీతితో భగవంతునికి కైమోడ్పులు సమర్పించు కుంటున్నారు ***(తత్ర కేచిత్ భీతాః ప్రాఞ్జలయః సన్తః).***

యుద్ధ మనేది సంతతానంద సంధాయకం కాదు. ఎందరినో కన్నీటి కడలిలో ముంచేస్తుంది. లోకం కల్లోల మవుతుంది. ఆనాడైనా, ఈనాడైనా, ఏనాడైనా, సమర శకునాలు యుద్ధారంభానికి ముందే కనిపిస్తూ ఉంటాయి. ఈ విధమైన ఉత్పాతాలను, వినాశాలను ఊహించి తపోధనులైన నారదాది మహర్షులు, శక్తి సంపన్నులైన కపిలాది సిద్ధ పురుషులు జగత్తుకు శుభం కలగాలని **(స్వస్త్యస్తు జగతః ఇత్యుక్త్వా)** జయజయ అంటూ స్వస్తి వచనాలను, **రక్షరక్ష** అంటూ స్తోత్ర పాఠాలను వినిపిస్తున్నారు. అందరి హృదయాలు దగ్గర గానో, దూరం గానో పరమాత్మ చుట్టే తిరుగు తున్నాయి.

ప్రారబ్ధము పనుల లోకి దించుతుంది. కనుక పురుషార్థంతో శనిని తొలగించుకొని మునులయ్యే ప్రయత్నములో మనం చరించాలి. భగవంతునికి దూరులైన వారు చేసిన యజ్ఞాలు యుద్ధాలుగా మారాయి. పరమాత్మను స్మరిస్తూ సాగించిన సమరాలు యజ్ఞా లయ్యాయి. ఆదిదేవుని ఆశ్రయించిన వారి బ్రతుకులే ఆనంద నిలయా లవుతాయి.

**కక్ష కట్టినందుకు దక్షయజ్ఞము ధ్వంసమాయె**
**అసుర పురములు మూడును భస్మమాయె**
**నిన్ను పూజించు వారికే పరమ పదము**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వేஉ శ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ ।**
**గన్ధర్వ యక్షాసుర సిద్ధసంఘాః వీక్షన్తే త్వాం విస్మితా శ్చైవ సర్వే ॥** 22

*రుద్రాదిత్యాః-వసవః-యే-చ-సాధ్యాః-విశ్వే-అశ్వినౌ-మరుతః-చ-ఊష్మపాః-చ*
*గంధర్వయక్షాసురసిద్ధ సంఘాః-వీక్షంతే-త్వాం-విస్మితాః-చ-ఏవ-సర్వే*

| | | | |
|---|---|---|---|
| రుద్రాదిత్యాః | = రుద్రులు,ఆదిత్యులు | ఊష్మపాః చ | = పితృదేవతలు |
| వసవః | = వసువులు | గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః | = గంధర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మొదలగు వారి సమూహములు |
| యే | = ఎవరు | | |
| సాధ్యాః చ | = సాధ్యులు | సర్వే | = అందరును |
| విశ్వే | = విశ్వ దేవతలు | విస్మితాః చ ఏవ | = విస్మయమును పొందిన వారై |
| అశ్వినౌ | = అశ్వినీదేవతలు | త్వాం | = నిన్ను |
| మరుతః చ | = వాయుదేవతలు | వీక్షంతే | = చూస్తున్నారు |

**స్వామీ! రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వదేవతలు, అశ్వినీ కుమారులు, మరుత్తులు, పితృ దేవతలు, గంధర్వ, యక్ష అసుర సిద్ధ సమూహాలు - అందరూ ఆశ్చర్యంతో నిన్నే వీక్షిస్తున్నారు.**

**వ్యాఖ్య**

భగవద్రూపము, విశ్వరూప వైభవము ఎంతటి వారికైనా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది అంటున్నాడు అర్జునుడు. ఎంతటి వారు అంటే ఎలాంటి వారో చెబుతున్నాడు.

ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అష్ట వసువులు, సాధ్యులు అనే రుద్రగణాలు, విశ్వ దేవతలు, అశ్వినీ కుమారు లిద్దరు, సప్త మరుద్గణాలు, ఊష్మపులు (పితృ దేవతలు), హాహా హూహూ అనే గంధర్వులు, కుబేరాది యక్షులు, విరోచనుడు మొదలైన అసురులు, కపిలాది సిద్ధులు - వీరందరూ విశ్వరూపాన్ని విస్మయంతో వీక్షిస్తున్నారు *(వీక్షంతే పశ్యన్తి, త్వా త్వాం, విస్మితాః విస్మయం ఆపన్నాః సన్తః త ఏవ సర్వే).*

***ఊష్మపాః*** అంటే పితృదేవతలు అని అర్థము. ***ఊష్మపాః*** అంటే ఊష్మమును పానం చేసే వారు, లేదా ఊష్మ పదార్థాలను వేడి వేడిగా సేవించే వారు అని వేదార్థము *(ఊష్మభాగా హి పితరః).* పితృ శ్రాద్ధాది కర్మలను నిర్వహించే సమయంలో, భోక్తల యందు పితరులను ఆహ్వానించి తృప్తిపరచే కార్యంలో అనుసరించ వలసిన విధిని స్మృతులు ప్రవచించి ఉన్నాయి. ఆ సందర్భంలో పితృదేవతలు ఊష్మపాలుగా, ఊష్మ భాగులుగా తెలుస్తారు.

***యావ దుష్ణం భవే దన్నం యావ దశ్నన్తి వాగ్యతాః।***
***పితర స్తావ దశ్నన్తి యావన్నోక్తా హవిర్గుణాః॥***

ఎంతవరకు అన్నం వేడిగా ఉంటుందో, అంతవరకే పితరులు గ్రహిస్తారు. అన్న గుణాలను ప్రస్తావిస్తూ మాట్లాడుతూ కాకుండా, అన్నాన్ని మౌనంగా ఆరగించినంత వరకే పితృదేవతలు స్వీకరిస్తారు అని స్మృతి వాక్యము.





అంటే, శ్రాద్ధాది కర్మలలో భోక్తల యందు పితృదేవతలను ఆహ్వానించి భోజనం పెట్టి నపుడు, ఆ ఆహారము వేడిగా ఉన్నంత వరకే పితరులు స్వీకరిస్తారు. అందుకనే వారు ఊష్మపులు. ఒకవేళ చల్లబడిన ఆహారాన్ని వడ్డిస్తే, ఆరగించే వారు ఆహూతు లైన భోక్తలే గాని ఆహ్వానింపబడిన పితృదేవతలు కారు.

అలాగే శ్రాద్ధ సమయంలో పితరులకు సమర్పించే ఆహారాన్ని ఆరగించే భోక్తలు మాట్లాడకుండా తినాలి. పదార్థ గుణాలను ప్రస్తావిస్తూ సంభాషించ కూడదు. ఆరగించే వారు పితరులు కనుక భోక్తలు తటస్థులై మౌనం వహించాలి. ఇదంతా కర్మకాండకు సంబంధించిన విషయము.

**రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో బహు బాహూరు పాదమ్ ।**
**బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకాఃప్రవ్యథితా స్తథాహమ్ ॥** 23

*రూపం-మహత్-తే-బహువక్త్రనేత్రం-మహాబాహో-బహుబాహూరుపాదం*
*బహూదరం-బహుదంష్ట్రాకరాలం-దృష్ట్వా-లోకాః-ప్రవ్యథితాః-తథా-అహం*

| | | | |
|---|---|---|---|
| మహాబాహో | = కృష్ణా! | తే | = నీ యొక్క |
| బహువక్త్రనేత్రం | = అనేకములైన ముఖములు, కన్నులు గలది | రూపం | = రూపమును |
| బహుబాహూరుపాదం | = అనేకములైన బాహువులు, ఊరువులు, పాదములు గలది | దృష్ట్వా | = చూచి |
| | | లోకాః | = లోకములు |
| బహూదరం | = అనేక పొట్టలు గలది | తథా | = అలాగే |
| బహుదంష్ట్రాకరాలం | = అనేకములైన కోఱల చేత భయంకరమైనది | అహం | = నేను |
| మహత్ | = గొప్పది | ప్రవ్యథితాః | = భయపడ్డాయి |

**కృష్ణా! మహాబాహో! నీ రూపంలో ఎన్నో లెక్కలేనన్ని ముఖాలు కనిపిస్తున్నాయి. మరెన్నో నేత్రాలు, బాహువులు, ఊరువులు, పాదాలు, ఉదరాలు, కోరలు కనిపిస్తున్నాయి. భయంకరమైన నీ రూపాన్ని చూచి లోకాలన్నీ చలించి పోతున్నాయి. భయపడుతున్నాయి. నేను కూడా.**

**వ్యాఖ్య**

విశ్వరూపుని సౌమ్యమైన విస్మయాకారాన్ని పూర్వ శ్లోకంలో చూశాం. అనేక ముఖాలు, అనేక నేత్రాలు, అనేక బాహువులు, అనేక పొట్టలు, భయంకరమైన కోరలు కలిగిన రూపాన్ని ఈ శ్లోకంలో చూస్తున్నాం. ఇలాంటి రూపాన్ని గతంలో ఎవరైనా చూశారా? చూసి ఉంటారా? అసలు ఇలాంటి రూపం గల వ్యక్తి ఉన్నాడా? ఉన్నాడు. లేకపోతే, ఎలా కనిపిస్తాడు? ఎవరతను? అతడే పరబ్రహ్మము. వాస్తవానికి ఏ రూపమూ లేని శుద్ధ చైతన్యము. నిరవయవుడు. ఏ అవయవమూ లేని వాడు. అతడు అవసర మనుకుంటే, తన మాయా శక్తి చేత ఏ రూపాన్నైనా ధరించ గలడు. స్థితి రూపంలో సౌమ్యంగా కనిపించిన వాడే, ప్రస్తుతం సంహార రూపంలో భయంకరంగా గోచరిస్తున్నాడు.

**భయ హేతువులు**

తెలిసినవి హానికర మైనవి అయితే, వాటిని చూడగానే భయం వేస్తుంది. తెలియనివి వికృత రూపంతో గోచరిస్తే, అవి స్వభావతః సౌమ్య మైనవే అయినా, తెలియని కారణంగా భయాన్ని కలిగిస్తాయి.

ప్రస్తుతం మహా భయంకరంగా గోచరిస్తున్న విశ్వరూపం ముల్లోకాలను ప్రవ్యథితం చేస్తూ ఉంది.

భయపెడుతూ ఉంది అంటున్నాడు అర్జునుడు. అవే కాదు, తాను కూడా భయపడుతున్నట్లు చెబుతున్నాడు. ఈ చివరి మాటే వాస్తవం.

లోకాలు బాధ పడుతున్నాయి అనడానికి అర్జునుని వద్ద ఋజువులు లేవు. కాని, తాను భయ పడుతున్నాడు అనే దానికి ఏ సాక్ష్యాలూ అవసరం లేదు. ఇంతకీ, అర్జునుని భయానికి హేతువు లేమిటి? తెలిసినవా, తెలియనివా? లేక రెండూనా? రెండూనూ.

కోరలు చూస్తే ఎవరి కైనా భయమే. కోర లున్నాయి కనుకనే పాముల్ని చూచి మనం భయ పడతాము. కోరపళ్ళు గల పులుల్ని చూచినా భయ పడతాము. చూడక పోయినా, కోరలు గల రాక్షసుల్ని గురించి విని ఉన్నాము కనుక, రాక్షసులన్నా భయమే. మరేదైనా సముద్ర ప్రాణి కోరలు కలిగి వికృతంగా కనిపిస్తే, అది సాధు జంతువే అయినా, దానిని చూచిన క్షణంలో మనకు ముచ్చెమటలు పోయక మానవు. ఈ విధంగా భయ హేతువులు కానివి కూడా సరియైన జ్ఞానము లేని కారణంగా భయాన్ని కలిగిస్తాయి. ఇలాంటి భయాలు కేవలం వ్యక్తిగత మైనవి. వ్యక్తి మీదే కేంద్రీకరింపబడి ఉంటాయి.

అర్జునుడు దర్శిస్తున్నది విశ్వరూపం. విశ్వనాథుని యొక్క వ్యక్త రూపం. అమూర్త స్వరూప మైన భగవంతుని మూర్త రూపం. అమూర్తం అఖండము, ఏకము. మూర్తం అనేకము, భిన్నము. ఏకమైన భగవంతుని అనేకమైన వ్యక్త రూపాలలో సౌమ్యాలు ఉన్నాయి. దారుణాలూ ఉన్నాయి. కాని అవన్నీ పరమేశ్వరుని రూపాలే.

పరమేశ్వరుడంటే మనకు భక్తి ఉంది. భయ మెందుకుంటుంది? మరి వ్యక్తమయ్యే రూపాలు అవ్యక్త స్వరూపమైన పరమాత్మవే అయి నపుడు భయం ఎందుకు పుడుతుంది? భేద దృష్టి భయ కారణము. అభేద స్వరూపంలో భేదమును చూడటమే భయ కారణమైంది. భయం తనదే అయినా, తన భయాన్నే లోకా లన్నిటికీ అర్జునుడు ఆరోపిస్తున్నాడు.

**నభః స్పృశం దీప్త మనేకవర్ణం వ్యాత్తాననం దీప్త విశాలనేత్రమ్ ।**
**దృష్ట్వా హి త్వాం ప్రవ్యథి తాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో ॥** 24

*నభః స్పృశం-దీప్తం-అనేకవర్ణం-వ్యాత్తాననం-దీప్త విశాలనేత్రం*
*దృష్ట్వా-హి-త్వాం-ప్రవ్యథితాంతరాత్మా-ధృతిం-న-విందామి-శమం-చ-విష్ణో*

| | | | |
|---|---|---|---|
| విష్ణో | = కృష్ణా! | త్వాం | = నిన్ను |
| నభః స్పృశం | = ఆకాశమును తాకెడివాడవు | దృష్ట్వా | = చూచి |
| దీప్తం | = ప్రకాశమానుడవు | ప్రవ్యథితాంతరాత్మా | = భయపడిన అంతరాత్మ గలవాడనై |
| అనేక వర్ణం | = ఎన్నో రంగులు గలవాడవు | ధృతిం | = ధైర్యమును |
| వ్యాత్తాననం | = తెరచిన నోళ్ళు గలవాడవు | శమం చ | = శాంతిని |
| దీప్తవిశాల నేత్రం | = ప్రజ్వలించు విశాల నేత్రములు గలవాడవు | న విందామి హి | = పొందలేక పోతున్నాను గదా |

**హే విష్ణుదేవా! నువ్వు ఆకాశాన్ని తాకుతున్నావు. అనేక రంగులతో శోభిస్తున్నావు. జ్వలిస్తున్న విశాల నేత్రాలతో, తెరచుకొని ఉన్న నోళ్ళతో కనిపిస్తున్నావు. నిన్ను చూచి భయపడి పోతున్నాను. ధైర్యాన్ని కోల్పోతున్నాను. శాంతి లేకుండా ఉన్నాను.**





**వ్యాఖ్య**

భగవంతుని రూపం ఆకాశాన్ని తన్నేసింది **(నభః స్పృశం)**. ఆ గోడను ఇతడు తాకాడు. ఈ చెట్టును అతడు స్పృశించాడు అంటే అర్థం చేసుకోగలం. మరి, విశ్వరూపుడు ఆకాశాన్ని స్పృశించాడు అనే దానిని ఎలా అర్థం చేసుకోవాలి? ఆకాశాన్ని స్పృశించడానికి దానికి హద్దు ఎక్కడుంది? ఒకవేళ ఆకాశాన్నే గనుక స్పృశించాలి అని అనుకుంటే, విశ్వరూపుడు ద్యులోకంలో విస్తరించ వలసిన అవసర మేముంది? అర్జునుడు ఉన్నచోట కూడా ఆకాశమే కదా ఉంది! కనుక, ఆకాశాన్ని విశ్వరూపం స్పృశిస్తూ ఉంది అంటే, దానికి అంత మెక్కడో తెలియకుండా ఉంది అని అర్థము. అనంతంగా ఉంది అని భావము. అది పరమేశ్వరుని సర్వ వ్యాపకత్వాన్ని సూచిస్తూ ఉంది. ఈ కారణం గానే ప్రత్యేకించి ఈ సందర్భములో భగవంతుని 'విష్ణో' అని సంబోధించాడు అర్జునుడు. అంతటా వ్యాపించిన వాడు కావడం చేతనే భగవంతుడు 'విష్ణువు' అని వ్యాస భగవానుడు మహాభారతంలో నిర్వచించాడు **(విష్ణుః 'విష్ణుః విక్రమణాత్' ఇతి వ్యాసేన ఉక్తేః)**.

అంతటా వ్యాపించి యున్న విశ్వరూపుని నోళ్ళు అన్ని వైపుల తెరువబడి ఉన్నాయి **(వ్యాత్తాననం, వ్యాత్తాని వివృతాని ఆననాని ముఖాని)**. సాధారణంగా నోరు తెరవడము అనేది ఏదైనా మ్రింగడానికి సూచితము. నోరు తెరవకుండా ఎలా తింటాము? ఎలా త్రాగుతాము? భయంకరంగా నోళ్ళు తెరచుకొని, ప్రజ్వలిస్తున్న నేత్రాలతో భీకరముగా గోచరిస్తున్న విశ్వమూర్తి రూపాన్ని సంహార స్వరూపంగా ఊహించుకొని అర్జునుడు భీతి చెందు తున్నాడు.

అన్నీ ఊహలే. అర్జునుని ఊహలే. అందుచేత ఈ విధమైన ఊహలకు నిలయమైన తన మనస్సు ధైర్యాన్ని కోల్పోయింది **(ధృతిం న విందామి)**. అధైర్యపరుడిలో ఆనంద మేముంటుంది? అందుకనే, తన మనస్సుకు సంతోషం లేకుండా పోయింది అంటున్నాడు **(శమం చ ఉపశమం మనః తుష్టిం న లభే)**.

**దంష్ట్రా కరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని ।**
**దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస ॥** 25

*దంష్ట్రాకరాలాని-చ-తే-ముఖాని-దృష్ట్వా-ఏవ-కాలానల సన్నిభాని*
*దిశః-న-జానే-న-లభే-చ-శర్మ-ప్రసీద-దేవేశ-జగన్నివాస*

| | | | |
|---|---|---|---|
| దంష్ట్రాకరాలాని | = కోఱలచే భయంకరమైన | న జానే | = తెలిసికొనలేక పోతున్నాను |
| కాలానల సన్నిభాని | = ప్రళయాగ్నిని బోలిన | శర్మ | = సుఖమును |
| తే | = నీ యొక్క | న లభే చ | = పొందలేక పోతున్నాను |
| ముఖాని | = ముఖములను | దేవేశ | = దేవదేవా! |
| దృష్ట్వా ఏవ | = చూచియే | జగన్నివాస | = జగదాశ్రయా! |
| దిశః | = దిక్కులను | ప్రసీద | = ప్రసన్నుడవు కా! |

**దేవదేవా! జగన్నివాసా! భయంకరమైన కోరలతో, కాలాగ్ని వలె కాగుతున్న నీ ముఖాలను చూచి దిగ్భ్రాంతి చెందుతున్నా! సుఖపడలేక పోతున్నా! ప్రసన్నుడవు కా!**

**వ్యాఖ్య**

ప్రళయము భయంకర మైనది. ప్రళయాన్ని తట్టుకొని ఎవ్వరూ నిలువలేరు. ప్రళయ కాలంలో లోకాలను ప్రచండంగా దహించే అగ్నిని కాలానలం అంటారు. అదే కాలాగ్ని **(ప్రళయకాలే లోకానాం దాహకః అగ్నిః కాలా**

*నలః కాలాగ్నిః).* అందుచేతనే లయ కారకుడైన పరమేశ్వరుని రుద్రాధ్యాయంలో **కాలాగ్ని రుద్రాయ** అని ప్రార్థిస్తాము. అంటే కాలాగ్ని రూపంలో ఉండే రుద్రుడు అని అర్థము ***(కాలానల రూపేణ రుద్రః).***

ప్రళయ కాలాగ్ని రూపంలో మండుతున్న మంటలు గల విశ్వరూపుని ముఖాలను చూడగానే దిక్కులు తెలియడం లేదట. అర్జునుడు దిగ్భ్రాంతి చెందుతున్నట్లు చెబుతున్నాడు.

దిక్కులు తెలియడం లేదు అంటే, పూర్వాపర వివేకం నశించింది అని అర్థము. ఇది తూర్పు - అది పడమర అని తెలియడం లేదట ***(దిశః పూర్వాపర వివేకేన న జానే).*** దిక్కు తెలియని వాడయ్యాడట ***(దిఙ్మూఢః).*** సూర్యునకు ఉదయాస్తమయాలు ఉంటేనే దిక్కులు అర్థమౌతాయి.

సూర్యుడు ఉదయించిన దిక్కు తూర్పు అని, అస్తమించిన దిక్కు పశ్చిమ మని గుర్తిస్తాము కనుక, వాటిని ఆధారం చేసుకొని ఉత్తర దక్షిణాలను, నైరుతీ ఈశాన్యాలను గుర్తిస్తాము. విశ్వరూపంలో సూర్యోదయము లేదు. సూర్యాస్తమయమూ లేదు. ద్వాదశాదిత్యులు ఒకే రూపంలో ప్రకాశిస్తూ ఉండే టప్పుడు, ఉదయాస్తమయాలు ఎలా తెలుస్తాయి? పగలు ఏదో, రాత్రి ఏదో, ఏది ఉదయమో, ఏది సాయంత్రమో ఎలా తెలుస్తుంది? అందుచేత, ప్రళయాగ్ని రూపంతో భయంకరంగా గోచరిస్తున్న విశ్వరూపుని చూచి భీతి చెందిన అర్జునుడు, తాను 'కాందిశీకుడు' అయినట్లు అంగీకరిస్తున్నాడు. తాను ఏ దిక్కున పోతున్నాడో తెలియకుండా ప్రయాణం చేసే వాడిని కాందిశీకుడు అంటారు.

దిక్కు లేని వారికి దేవుడే దిక్కు అంటారు. కాని, ఇక్కడ విచిత్ర మేమిటంటే, దేవుడి వల్లనే దిక్కులు అర్థం కాకుండా పోయాయి. దిక్కులు తెలియడం లేదు అంటే, దిక్కుల విషయంలో వివేకం లేదు అని అర్థము. దిక్కులకు సంబంధించిన జ్ఞానం లేదు. అందుకనే, అర్జునుడు ప్రస్తుత శ్లోకంలో భగవంతుని **దేవేశ** అని సంబోధించాడు. దేవేశుడు అంటే దేవతలకు ప్రభువు ***(దేవానాం ఈశః దేవేశః).*** 'దేవ' శబ్దము ద్యోతనార్థకము కనుక, ఇంద్రియ మనస్సులు అని కూడా అర్థము. విషయాలను ప్రకాశింప చేసేవి కావడం చేత, జ్ఞానేంద్రియ అంతఃకరణాలను దేవతలుగా ముందే తెలుసుకొని ఉన్నాం. అట్టి ఇంద్రియ మనస్సు లనే దేవతలకు ఆత్మ చైతన్యంగా ప్రకాశాన్ని ప్రసాదించే వాడు తానే కనుక భగవంతుడు దేవేశుడు.

'దేవేశా! నాకు దారి చూపు! దిగ్భ్రాంతి కారణంగా నా మనస్సుకు సుఖం లేకుండా పోయింది' అంటున్నాడు పార్థుడు ***(అతః న లభే చ నోపలభే చ శర్మ సుఖమ్).*** 'శర్మ' అంటే సుఖము, లేదా శుభము అని అర్థము. అట్టి సుఖము, లేదా శుభము కలగడానికి, హే దేవేశా! ప్రసన్నుడవు కా! అని ప్రార్థిస్తున్నాడు.

ఇక్కడ చాలా ఆసక్తికరమైన, సూక్ష్మమైన అంశ మొకటి ఉంది. దిక్కు లేని వారికి దేవుడే దిక్కు. కాని, ఇక్కడ దేవుడి వల్లనే దిక్కులు తెలియకుండా పోయాయి అని చెప్పుకున్నాం. ఎవరి వల్ల దిశలు తెలియకుండా పోయాయో, అట్టి దేవేశునే ప్రార్థిస్తే దిక్కులు ఎలా తెలుస్తాయి? తెలుస్తాయి. ఎలా? దిశగా తాను లభ్యం కాకపోయినా, దిశా నిర్దేశం చేసే వివేక రూపంగా తాను సిద్ధమే. ఇలా చూచి నపుడు, దిక్కు లేని వారికి దేవుడే దిక్కు అనే వాక్యం పూర్ణజ్ఞానంతో సిద్ధిస్తుంది.

భగవంతుడికి 'దిక్కు' అనే పేరు కూడా ఉంది ***(దిశః).*** ఏది తప్పో, ఏది ఒప్పో, ఏది సక్రమమో, ఏది అక్రమమో తెలుసుకొనే వివేకాన్ని వేదజ్ఞానం ద్వారా అందించే వాడు తానే కనుక దేవేశుడు ***దిశ*** నామధేయుడు ***(సమస్తానాం ఫలాని దిశన్ వేదాత్మనా దిశః).*** వేదజ్ఞానం ద్వారా సర్వోపదేశమును సర్వహితంగా బోధించే వాడు కావడం చేత అతడు ***దిశః*** అంటే, 'దిక్కు' అనే పేరు కలిగిన వాడు.

వివేకం లోపిస్తే చిత్త స్వాస్థ్యము లేకుండా పోతుంది. చిత్త స్వాస్థ్యము లభిస్తేనే మనస్సు సుఖ పడుతుంది.





అదే 'శర్మ' శబ్దంలో చెప్పబడిన సుఖము. అశుభమును తుడిచి పెట్టే సుఖమును 'శర్మ' అంటారు ***(శృణాతి అశుభ మితి శర్మ).*** వివేకమే చిత్తానికి స్వాస్థ్యాన్ని ప్రసాదిస్తుంది.

వికృతమైన కోరలతో, కాలానలం వంటి ముఖాలతో భయభ్రాంతులను కలిగిస్తున్న విశ్వరూపాన్ని దర్శించి దిక్కులు తెలియక చిక్కులు పడుతున్న తనను కరుణించి, అనుగ్రహించ మని అర్జునుడు అచ్యుతుని ప్రార్థిస్తున్నాడు.

చరణము: **దిక్కులు తిరుగుచు చిక్కులు పడితి**
**చిక్కెద వని నీవు**
**పరితపించుచు ప్రక్కన చేరితి**
**పరిహసించకయ్యా! ॥ వినిపించలేదా ॥**
పల్లవి: **వినిపించలేదా కోనేటి దేవా!**
**కన్నీటి నా గాథ!**
అనుపల్లవి: **అడుగు అడుగుకు కొండల స్వామి**
**దండము గైకొనవా! ॥ వినిపించలేదా ॥**

అని పరితపిస్తూ భక్తితో ప్రార్థిస్తున్న అర్జునుని పవిత్ర హృదయానికి అద్దం పట్టింది చైతన్య గీతిక.

*యుద్ధభూమిలో గెలుపు మనదో, లేక కౌరవులదో అని శంకించాడు కదా! మరి, విశ్వరూప దర్శన ప్రభావంతో ఇప్పుడే మంటాడు పార్థుడు? ఆ శంక కూడా పోయిం దంటున్నాడు. చదవండి.*

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః సర్వే సహై వావనిపాల సంఘైః ।
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాసౌ స హాస్మదీయై రపి యోధముఖ్యైః ॥ 26
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రా కరాలాని భయానకాని ।
కేచి ద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః ॥ 27

**అమీ-చ-త్వాం-ధృతరాష్ట్రస్య-పుత్రాః-సర్వే-సహ-ఏవ-అవనిపాలసంఘైః**
**భీష్మః-ద్రోణః-సూతపుత్రః-తథా-అసౌ-సహ-అస్మదీయైః-అపి-యోధముఖ్యైః**
**వక్త్రాణి-తే-త్వరమాణాః-విశంతి-దంష్ట్రాకరాలాని-భయానకాని**
**కేచిత్-విలగ్నాః-దశనాంతరేషు-సందృశ్యంతే-చూర్ణితైః-ఉత్తమాంగైః**

| | | | |
|---|---|---|---|
| అమీ | = ఈ | అస్మదీయైః | =మనవారైన |
| ధృతరాష్ట్రస్య | = ధృతరాష్ట్రుని యొక్క | యోధ ముఖ్యైః సహ అపి | =యుద్ధప్రముఖులతో కూడా |
| పుత్రాః | = కుమారులును | సర్వే చ | =అందరును |
| అవనిపాల సంఘైః సహ ఏవ | = రాజసమూహముతో గూడి | త్వరమాణాః | =తొందరపడుతున్న వారై |
| తథా | = అటులే | త్వాం | =నీలో |
| భీష్మః | = భీష్ముడు | దంష్ట్రాకరాలాని | =కోఱలతో వికారమైన |
| ద్రోణః | = ద్రోణుడు | భయానకాని | =భయంకరమైన |
| అసౌ | = ఈ | తే | =నీ యొక్క |
| సూతపుత్రః | = సూతపుత్రుడు | వక్త్రాణి | =ముఖములను |

| | |
|---|---|
| విశంతి | = ప్రవేశిస్తున్నారు |
| కేచిత్ | = కొందరు |
| దశనాంతరేషు | = దంతముల మధ్య |
| విలగ్నాః | = చిక్కినవారై |
| చూర్ణితైః | = పొడి పొడి అయిన |
| ఉత్తమాంగైః | = శిరములతో |
| సంధృశ్యంతే | = కనబడు తున్నారు |

**భగవంతా! ధృతరాష్ట్రుని పుత్రులు, భూపతుల సమూహము, మా పక్షము లోని ముఖ్యులైన వీరులు, భీష్ముడు, ద్రోణుడు, అలాగే సూతపుత్రుడైన కర్ణుడు,**
**అందరూ వికారమైన కోరలతో ఉన్న, భయంకరమైన నీ ముఖాల లోకి తొందర పడుతూ ప్రవేశిస్తున్నారు. కొందరి తలలు నీ ముఖాల లోని పండ్ల సందులలో చిక్కి చూర్ణమై కనిపిస్తున్నాయి.**

**వ్యాఖ్య**

***యద్వా జయేమ యది వానో జయేయుః -*** 'మధుసూదనా! మనమే జయిస్తామో, లేక మనల్ని వాళ్ళే జయిస్తారో తెలియదు' అని ప్రారంభం లోనే రెండవ అధ్యాయంలో అర్జునుడు శ్రీకృష్ణునికి విన్నవించు కున్నాడు *(2 వ అ - 6 వ శ్లో).*

***యచ్చాన్య ద్రష్టు మిచ్ఛసి -*** అర్జునా! ఈ రూపాలే గాక, వీటికి అన్యమైనవి నువ్వు ఏవేవి చూడా లనుకుంటున్నావో, అవన్నీ నా రూపంలో చూసేయ్! అంటూ గెలుపు ఓటముల ప్రస్తావన చేయకుండానే, సూచన ప్రాయంగా ఎవరిది జయమో, ఎవరిది పరాజయమో కూడా తేల్చుకోమని భగవంతుడు అర్జునునికి ప్రస్తుత అధ్యాయం ప్రారంభం లోనే చెప్పేశాడు *(11 వ అ - 7 వ శ్లో).*

ఎవరి వల్ల తనకు అపజయం కలుగుతుందని అర్జునుడు శంకించాడో, ఆ సందేహం కూడా తీరి పోయింది ***(యేభ్యః పరాజయ శఙ్కా ఆసీత్ సా చ అపగతా).*** ఎలా తీరిపోయింది అంటే ***(యతః)***, చెబుతున్నాడు. ప్రత్యక్షంగా చూశాడు కనుక సంశయ విచ్ఛేదము జరిగి పోయింది.

**ఏం చూశాడు?**

ధృతరాష్ట్రుని కుమారులైన దుర్యోధనాదులు, భీష్ముడు, ద్రోణుడు, సూత పుత్రుడైన కర్ణుడు, సహ యోధులైన భూపతులు, తమ పక్షం వారైన ధృష్టద్యుమ్న, సాత్యకీలు కూడా పరమేశ్వరుని కాలానల ముఖాలలో ప్రవేశించి చూర్ణ మౌతున్న దృశ్యాలను అర్జునుడు చూశాడు.

**ఎక్కడ చూశాడు?**

కోరలతో వికృతమై, భయంకరంగా ఉన్న విశ్వరూపుని ముఖాల లోకి ప్రవేశించడం చూశాడు. అంతే కాదు, శిరస్సు మొదలైన ఉత్తమాంగాలు పండ్ల సందులలో పడి నలిగి చూర్ణం కావడం కళ్ళారా చూశాడు. వాస్తవానికి భవిష్యత్తులో కురుక్షేత్రంలో కనిపించబోయే భయంకర దృశ్యము ఎలా ఉంటుందో, దానిని యథాతథంగా అచ్యుతుడు అర్జునునికి దర్శింప చేశాడు.

**కాలం ఒక కల**

యుద్ధం ఇంకా ప్రారంభమే కాలేదు కదా! యుద్ధం ప్రారంభమైన తరువాత కదా, ఎవరు ఉంటారు, ఎవరు పోతారు అనేది తెలిసేది! మరి, యుద్ధానికి ముందే మరణించబోయే వారిని ఎలా చూపించాడు? అక్కడ జరగ బోయేది, అప్పుడు జరగ బోయేది ఇప్పుడే ఇక్కడే జరిగినట్లు చూపించడ మేమిటి? అనే సందేహము రావచ్చు. సందేహం రావడం కూడా సహజమే. సమంజసమే.





అప్పుడు అక్కడ కనిపించ వలసినవి, ఇప్పుడు ఇక్కడే కనిపిస్తున్నాయి అంటే, అక్కడ ఇక్కడ అనే దేశము కాని, అప్పుడు ఇప్పుడు అనే కాలము గాని సాపేక్షికాలే గాని పారమార్థికాలు కావు అని తేలిపోయింది.

దృశ్యమాన ప్రపంచము దేశకాలాదుల లోనే కనిపిస్తూ ఉంది. ప్రపంచం యొక్క అర్థం ప్రపంచంలో లేదు. ప్రపంచం కాలంలో ఉంది. కాని, కాలం పరమాత్మలో లేదు. ప్రపంచం ప్రదేశంలో ఉంది. కాని ప్రదేశం పరమాత్మలో లేదు.

దేశకాలాదులలో తెలిసే ప్రపంచం సత్యం కాదు. దానికి స్వతంత్ర మనుగడ లేదు. అది ఆత్మ చైతన్యముపై ఆధారపడి ఉంది. ఆత్మ పారమార్థిక సత్తా కలది. దేశకాలాదులు, దేశకాలాదులలో తెలిసే ప్రపంచము వ్యావహారిక సత్తా మాత్రమే కలవి.

దేశకాలాదులు మనోకల్పితాలు. స్వప్నము లాంటివి. 'రేపు' అనే దానిని ఎవ్వరూ చూడరు. చూడలేరు. ఒకవేళ చూచినా, 'నేడు' గానే చూస్తారు. 'నేడు' లేదా 'ఇప్పుడు' అని వర్తమానాన్ని గురించి పలికే లోగా అది గతం అవుతూ ఉంటుంది. ఏమిటి ఈ కాలం? ఎక్కడికి ఈ ప్రవాహం?

క్షణాన్ని యుగంగా, యుగాన్ని క్షణంగా మనస్సు మార్చుతుంది. కలలో కూడా ఇది తెలుస్తుంది. ఈ కాలం ఆ కాలం కాదు. ఆ కాలం ఈ కాలం కాదు. మనస్సు సృష్టించే కాలం కనుక, అది కలలో నైనా, మెలకువలో నైనా అసత్యమే. మనసే సత్యం కానపుడు, మనస్సు సృష్టించే కాలం సత్యం అవుతుందా?

సూర్యుడి వల్లే మనకు కాలం తెలుస్తోంది. సూర్యుడు లేకపోతే కాలం అర్థం కాదు. కాని, సూర్యునిలో కాల ముందా? ఉదయ సాయంత్రాలు ఉన్నాయా? నిన్న నేడు లున్నాయా? నేడు రేపు లున్నాయా? ఏవీ లేవు. అయినా కాల ముంది అంటారా?

సూర్యునిలో కాలం ఎలా అసంభవమో, పారమార్థిక స్వరూపంలో కూడా కాలం అనూహ్యం. అంతా వర్తమానమే. అనంత వర్తమానమే. ఈ అవగాహనే పరమేశ్వరుడు అర్జునునికి కలిగిస్తున్నాడు. భవిష్యత్తును వర్తమానంలో చూపుతూ, వర్తమానమే సత్యమని, వర్తమానంపై ఆధారపడి ఉండే భవిష్యత్తు మిథ్య అనే అవగాహనను మెల్లగా అర్జునుని బుద్ధిలో దించుతున్నాడు. ఇదే జ్ఞానదృష్టి

**నిదురించగా నేను మేలుకొంటుంది రాత్రి**
**నిదుర లేవగానే పలకరిస్తుంది పగలు**
**తోడుగా ఉంటివి మాకు పగలు రాత్రి**
**నీ అడుగుల కడ పడి ఉందు నీలకంఠా!**

అని నీలకంఠ శతకంలో ఒక విబూది పండు.

**యథా నదీనాం బహవోఽమ్బువేగాః సముద్రమేవాభిముఖా ద్రవన్తి। 28**
**తథా తవామీ నరలోకవీరాః విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి ॥**

***యథా-నదీనాం-బహవః-అంబువేగాః-సముద్రం-ఏవ-అభిముఖాః-ద్రవంతి***
***తథా-తవ-అమీ-నరలోక వీరాః-విశంతి-వక్త్రాణి-అభివిజ్వలంతి***

| | |
|---|---|
| నదీనాం | = నదుల యొక్క |
| బహవః | = బహు విధములైన |
| అంబువేగాః | = నీటి ప్రవాహములు |
| యథా | = ఏ విధంగా |
| సముద్రం ఏవ | = సముద్రమునే |
| అభిముఖాః | = ఎదురుగా చేసుకొని |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద్రవంతి | = | ప్రవహిస్తూ ఉన్నవో | తవ | = | నీ యొక్క |
| తథా | = | అలాగే | అభివిజ్వలంతి | = | ప్రజ్వలించుచున్న |
| అమీ | = | ఈ | వక్త్రాణి | = | ముఖములను |
| నరలోకవీరాః | = | రాజశ్రేష్ఠులు | విశంతి | = | ప్రవేశిస్తున్నారు |

**భగవంతా! నదీ జలాలు నానా విధాలుగా ప్రవహించి, సముద్రానికి అభిముఖంగా పయనించి అందులోకి ఎలా ప్రవేశిస్తున్నాయో, అలాగే మానవలోకం లోని వీరు లందరూ నీ లోకి ప్రవేశిస్తున్నారు.**

**వ్యాఖ్య**

కురుక్షేత్రంలో సమర యోధులైన ఉభయ పక్షాల లోని వీరులు ప్రజ్వలించుచున్న విశ్వరూపుని ముఖాల లోకి ప్రవేశిస్తున్నారని పూర్వ శ్లోకంలో తెలిపిన అర్జునుడు, వారు ఏ విధంగా ప్రవేశిస్తున్నారో ప్రస్తుత శ్లోకంలో చెబుతున్నాడు ***(కథం ప్రవిశన్తి ముఖాని ఇత్యాహ).***

నదీ జలాలు ఏ విధంగా అయితే ప్రవహించి సాగరంలో కలిసి పోతున్నాయో, అలాగే మానవ లోకం లోని వీరులు విశ్వరూపుని లోకి ప్రవేశిస్తున్నారు అంటున్నాడు.

నదుల పుట్టుక స్థానాలు వేరు వేరైనా, నదీ జలాలు అనేక మార్గాల గుండా పయనించినా, అవన్నీ సముద్రాన్నే ఏక లక్ష్యంగా కలిగి, సముద్రం లోకే ప్రవేశిస్తాయి ***(సముద్ర మేవ అభిముఖాః ద్రవన్తి ప్రవిశన్తి).***

నదీ జలాలు విరామం తెలియకుండా వేగంతో పయనిస్తాయి. అప్రయత్నంగా ప్రవహిస్తాయి. గ్రుడ్డిగా వెళ్ళి రూపు లేకుండా పోతాయి. ఇది అనివార్యమైన పయనము. తనను తాను పోగొట్టుకొనే పయనము. దూరాలను దూసుకుంటూ, భారాలను తోసుకుంటూ, అవరోధాలను నెట్టుకుంటూ వచ్చి, తనను మరచి, సాగరునిలో ప్రవేశించే ప్రస్థానము.

నదీ జలాలు అప్రయత్నంగా, అనివార్యంగా సహజ వేగంతో పయనించి, సముద్ర ముఖద్వారం వద్ద పట్టు దప్పి సాగరంలో పడి పోయినట్లు, మానవ లోకంలో భీష్మాది వీరులు కూడా త్వరత్వరగా వెళ్ళి విశ్వరూపుని కాలానల ముఖాలలో ప్రవేశిస్తున్నారు.

ఏనుగులే నిలదొక్కుకోలే నపుడు, జంబుకాలు జంభం ప్రదర్శించి ఏమి సాధిస్తాయి? మహావీరులే నిస్సహాయులై పోతున్నారు. మృత్యు ముఖంలో పడి పోతున్నారు. సామాన్యులం మనం. ఎదురీది సాధించ గలమా?

అంతా విధాత నిర్ణయమే. విధి నియమమే. జరిగే వన్నీ జరిగి పోతాయి. పతనం సమీపించి నపుడు ఉత్థాన ప్రయత్నాలన్నీ వృథా శ్రమలే అవుతాయి. వట్టి భ్రమలుగా మిగిలి పోతాయి.

ప్రవాహ వేగంలో, పయనించే మార్గాలలో, నదుల మధ్య అంతరాలు ఉండవచ్చు నేమో గాని, సముద్ర ముఖద్వారం వద్ద నదులన్నీ భేదాలు మరచి ఏకం కావలసిందే.

భేదాలన్నీ బ్రతుకు లోనే. చావులో ఏ భేదాలు లేవు. గుడిసెలు, మేడలు బ్రతికి నంత వరకే. మృత్యువు ఆసన్న మైతే, అందరికీ శ్మశానమే నివాసము. శంకరాలయంలో భేదాలు ఉండవు. ఈ సత్యం అవగత మైతే, పోయేటప్పుడు ఉండనివి ఉన్నప్పుడు కూడా లేనివే అవుతాయి.

**నీవు నేనను భేదాలు**
**ఉర్వి లోన ఉత్సవాలు**





**ఊపిరి ఆగి ఊరేగిన నాడు**
**ఉండవు కాటిలో తేడాలు**
**పోయిన నాడు ఉండనివి**
**పోనపుడు ఎందుకు ఉన్నవి?**
**రామ రామ జయ రాజారామ్**
**రామ రామ జయ సీతారామ్**

అని రామజోగి చిట్కా.

*నదులు జడాలు. అందుచేత అప్రయత్నంగా, అబుద్ధి పూర్వకంగా పరుగులెత్తి సముద్రంలో పడతాయి. మరి చేతనాలు ఎందుకు పతన మౌతున్నాయి? అనేది శంక. పతన సమయంలో పతన మవటమే గాని జడ చేతన భేదా లుండవు. మేడ మెట్లపై నుండి జారిన మనిషి క్రింద పడతాడు. చెట్టును వీడిన పండు నేల రాలుతుంది. అంతే. చదవండి అదీ తెలుస్తుంది.*

**యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గాః విశన్తి నాశాయ సమృద్ధవేగాః ।**
**తథైవ నాశాయ విశన్తి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః ॥** 29

**యథా-ప్రదీప్తం-జ్వలనం-పతంగాః-విశంతి-నాశాయ-సమృద్ధవేగాః**
**తథా-ఏవ-నాశాయ-విశంతి-లోకాః-తవ-అపి-వక్త్రాణి-సమృద్ధవేగాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పతంగాః | = | మిడుతలు | తథా ఏవ | = | ఆ విధం గానే |
| ప్రదీప్తం | = | మండుచున్న | లోకాః అపి | = | జన సమూహములు కూడా |
| జ్వలనం | = | అగ్నిని | సమృద్ధవేగాః | = | అతివేగము గలవై |
| సమృద్ధవేగాః | = | అతి వేగముతో | తవ | = | నీ యొక్క |
| యథా | = | ఏ విధంగా | వక్త్రాణి | = | ముఖములను |
| నాశాయ | = | నాశము కొరకు | నాశాయ | = | నాశము కొరకు |
| విశంతి | = | ప్రవేశిస్తున్నవో | విశంతి | = | ప్రవేశిస్తున్నాయి |

**మండుతున్న అగ్నిని మిడుతలు అతి వేగంతో సమీపించి నశించి పోతాయి. లోకంలో జీవు లందరూ పరుగు లెత్తుతూ వచ్చి నీ ముఖాలలో ప్రవేశించి నశించి పోతారు.**

**వ్యాఖ్య**

పరుగులు ప్రాణులకు కొత్తవి కావు. ప్రయాణాలు తెలియనివి కావు. బండి చిక్కదేమో అని కొందరు పరుగులు తీస్తూ ఉంటే, తిండి దక్కదేమో అని మరి కొందరు పరుగు లెత్తుతూ ఉంటారు. ఎందుకు ముందు ఉండాలని కొందరు పరుగులు తీస్తే, పరుగే పనిగా పెట్టుకొని పరుగు పందెంలో విజయం సాధించాలని కొందరు పరుగు లెడుతూ ఉంటారు. ఇలాంటి పరుగుల్ని అర్థం చేసుకోవచ్చు. కాని, ఒరిగి పోయేందుకు, తరిగి పోయేందుకు, కాలంలో కరిగి పోయేందుకు పరుగులు తీయడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? ఏమి సాధించాలని ఈ పరుగు?

చివరి పరుగులో సాధించేది ఏమీ ఉండదు. ఒకవేళ సాధించాలి అనేది ఏదైనా ఉంటే, అది చివరి పరుగులో పాల్గొనే ముందే ఉండాలి.

అదిగో, మిడుతలు పరుగులు పెడుతున్నాయి. ఎక్కడికి? మండుతున్న అగ్ని సమీపానికి **(ప్రదీప్తం అగ్నిం**

***పతంగాః పక్షిణః విశన్తి సమృద్ధ వేగాః).*** దేని కోసం పరుగు? నశించి పోవడానికి ***(వినాశాయ).*** అలాగే వినాశ కాలంలో విపరీత బుద్ధి పూర్వకంగా లోకంలో అందరూ పరుగు పరుగున వెళ్ళి పరమేశ్వరుని కాలాగ్నిలో ప్రవేశిస్తారు. ఇవన్నీ అనివార్యాలు. అర్థం గాని కర్మఫలాలు. మృత్యు ముఖ ప్రవేశ హేతువులు. శలభాల వలె కాలాగ్నిలో కాలి పోవడమే ప్రవేశ ప్రయోజనము.

అవశులై నదులు ప్రవహించి సాగరంలో పడుతున్నాయి. బుద్ధి పూర్వకంగా పరుగులెత్తి మిడుతలు అగ్నిలో దూకుతున్నాయి. మృత్యుకాలంలో నిగ్రహాలు అనూహ్యాలు.

అలా అందరూ అవశులై విశ్వరూపుని కాలానల ముఖాలలో ప్రవేశిస్తూ ఉంటే, విశ్వమూర్తి ఏం చేస్తున్నాడు?

*నదుల విషయంలో సాగరుడు ఏమి చేశాడో, శలభాల విషయంలో అగ్నిదేవుడు ఏం చేశాడో, జీవుల విషయంలో ఈశ్వరుడు అదే చేస్తాడు. అదే తరువాత ప్రసంగ విషయం.*

**లేలిహ్యసే గ్రసమానః సమన్తా ల్లోకాన్సమగ్రా న్వదనైర్జ్వలద్భిః ।**
**తేజోభి రాపూర్య జగత్సమగ్రం భాసస్తవోగ్రాః ప్రతపన్తి విష్ణో ॥** 30

***లేలిహ్యసే-గ్రసమానః-సమంతాత్-లోకాన్-సమగ్రాన్-వదనైః-జ్వలద్భిః***
***తేజోభిః-ఆపూర్య-జగత్-సమగ్రం-భాసః-తవ-ఉగ్రాః-ప్రతపంతి-విష్ణో***

| | | | | | |
|---|---|---|---|---|---|
| విష్ణో | = | విష్ణుమూర్తీ! | తవ | = | నీ యొక్క |
| జ్వలద్భిః | = | మండుచున్న | ఉగ్రాః | = | ప్రచండమైన |
| వదనైః | = | నోళ్ళ చేత | భాసః | = | కాంతులు |
| సమంతాత్ | = | అన్ని వైపుల నుండి | సమగ్రం | = | సమస్తమైన |
| సమగ్రాన్ | = | సమస్త మైన | జగత్ | = | జగత్తును |
| లోకాన్ | = | లోకములను | తేజోభిః | = | కాంతుల చేత |
| గ్రసమానః | = | మ్రింగుచు | ఆపూర్య | = | నింపి |
| లేలిహ్యసే | = | ఆస్వాదిస్తున్నావు | ప్రతపంతి | = | తపింప చేస్తున్నాయి |

**హే విష్ణుదేవా! మండుతున్న నీ నోళ్ళలో ప్రవేశిస్తున్న లోకులను నాకుతూ, చప్పరిస్తూ అమాంతం మ్రింగుతున్నావు. భయంకరమైన నీ తేజస్సు ఈ ప్రపంచాన్నంతా ప్రచండంగా ఉడికిస్తూ ఉంది.**

**వ్యాఖ్య**

సమర క్షేత్రంలో కయ్యానికి కాలు మోపిన రాజులు, విశ్వరూపుని కాలానల ముఖాలలో ప్రవేశించు విధానమును వివరించి, ప్రవేశ ప్రయోజనాన్ని కూడా పూర్వ శ్లోకంలో తెలియ జేసిన అర్జునుడు, ప్రస్తుత శ్లోకంలో ఆ సమయంలో పరమేశ్వరుడు నిర్వహించే కార్యాన్ని వివరిస్తున్నాడు.

యావ త్ప్రపంచాన్ని తేజస్సులలో ముంచి, జ్వలిస్తున్న నోళ్ళతో చప్పరిస్తూ, నాకుతూ ప్రాణుల్ని మ్రింగుతున్నాడు. సంహార కర్తగా దయా దాక్షిణ్యాలు లేకుండా ధర్మ నిర్వహణలో జాజ్వల్యమాన మవుతున్నాడు.

ఈ విధమైన సంహార కార్యాన్ని ఆచరించడంలో విశ్వమూర్తి తృప్తి చెందుతున్నాడు. బాహ్యానికి చాచిన తన కాలాగ్ని నాలుకలతో నాకుతూ, ప్రాణులను మ్రింగిన తరువాత ***(గ్రసమానః),*** అప్పటికీ తృప్తి చెందక నాలుకలతో దౌడలను మాటిమాటికీ నాకుతూ ***(లేలిహ్యసే)*** కనిపిస్తున్నాడు. తృప్తిగా భుజించిన తరువాత, ఆహారాన్ని మ్రింగి, ఆ తరువాత, దౌడలను మనం ఎలా నాకుతామో, ఆ విధంగా నాకుతూ గోచరిస్తున్నాడు





అంటే, సంహార కార్యాన్ని విశ్వమూర్తి సంతృప్తితో నిర్వహిస్తున్నాడని తెలుస్తూ ఉంది.

మండు వేసవిలో సూర్యుడు ప్రపంచాన్ని ఎలా తపింప చేస్తాడో, సంహార సమయంలో తన తేజస్సుతో విశ్వరూపుడు యావ త్ప్రపంచాన్ని అలా తపింప చేస్తున్నాడు. మృత్యు విషయంలో జీవులు అనుభవించే దుఃఖమే, పరితాపమే, సంతాపమే ఇక్కడ తాపము. ఇది మామూలు తాపము కాదు. ప్రచండమైన తాపము అంటున్నాడు అర్జునుడు.

**ప్రతపన్తి** అంటే అధికంగా తపింప చేయడము అని అర్థము. భయంకరమైన విశ్వమూర్తి యొక్క కాంతులతో ప్రపంచము యావత్తూ ఉడికి పోతూ ఉంది అంటున్నాడు **(తవ ఉగ్రాః క్రూరాః ప్రతపన్తి ప్రతాపం కుర్వన్తి).**

*ఇంతవరకు ప్రసన్నుడైన కేశవుని చూచిన అర్జునుడు, ప్రచండ ప్రతాప తేజముతో సంహారమూర్తిగా శివమెత్తి విలయ రూపమును ప్రదర్శించు విశ్వరూపుని అర్థం చేసుకోలేక అనుగ్రహించమని అర్థిస్తున్నాడు.*

**ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో నమోఽస్తు తే దేవవర ప్రసీద ।**
**విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్ ॥** 31

**ఆఖ్యాహి-మే-కః-భవాన్-ఉగ్రరూపః-నమః-అస్తు-తే-దేవవర-ప్రసీద**
**విజ్ఞాతుం-ఇచ్ఛామి-భవంతం-ఆద్యం-న-హి-ప్రజానామి-తవ-ప్రవృత్తిం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| దేవవర | = | దేవదేవా! | ప్రసీద | = | ప్రసన్నుడవు కా! |
| ఉగ్రరూపః | = | భయంకర ఆకారమైన | ఆద్యం | = | ఆద్యుడ వైన |
| భవాన్ | = | నీవు | భవంతం | = | నిన్ను |
| కః | = | ఎవరో | విజ్ఞాతుం | = | తెలిసి కొనుటకు |
| మే | = | నాకు | ఇచ్ఛామి | = | కోరుతున్నాను |
| ఆఖ్యాహి | = | చెప్పు! | తవ | = | నీ యొక్క |
| తే | = | నీకు | ప్రవృత్తిం | = | ప్రవర్తనమును |
| నమః అస్తు | = | వందనము! | న ప్రజానామి హి | = | తెలుసుకోలేక పోతున్నాను |

**దేవదేవా! నీకు నమస్కారము. నన్ను అనుగ్రహించు. భయంకరమైన రూపం కలిగిన నువ్వెవరు? నాకు చెప్పు. నీ చేష్టలు నాకు అర్థం కావడం లేదు. ఆదిదేవుడైన నిన్ను గూర్చి విశేషంగా తెలుసుకోవాలి అనుకుంటున్నాను.**

**వ్యాఖ్య**

భయంకరమైన రూపముతో ప్రళయ కాలాంతకుని లాగా మహాయోధులతో సహా సర్వులను మ్రింగుతున్న భగవానుని మహా కార్యాన్ని వీక్షించిన అర్జునుడు భీతి చెంది, ఓ దేవవరా! నన్ను అనుగ్రహించు. నీకు దండం పెడతా! నువ్వెవరో చెప్పు. నీ చేష్టలు నాకు ఏ మాత్రం అర్థం కావడం లేదు అంటున్నాడు **(న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్).**

దేవా! నువ్వెవరు? మహా మృత్యు రూపుడవా? ప్రళయ కాల రుద్రుడవా? కాలాన్తకుడవా? ప్రళయాగ్ని హోత్రుడవా? శివుడవా? కేశవుడవా? కేశవుడవై రక్షించేవాడి వని భావించాను. శివుడవై ఇలా భయంకరంగా శిక్షించే వాడవని నాకు తెలియదు.

ఆద్యుడ వైన నిన్ను తెలుసుకోవాలి అనుకుంటున్నాను **(ఆద్యం భవన్తమ్ విజ్ఞాతుమ్ ఇచ్ఛామి)** అని

ప్రార్థిస్తున్నాడు పార్థుడు. భగవంతుడు ఆద్యుడు అని అర్జునుడే చెబుతున్నాడు కదా! తెలియబట్టే కదా చెబుతున్నాడు. ***ఆదౌ భవమ్ ఆద్యం*** - ఆది యందు ఉన్నవాడు కనుక భగవంతుడు ***ఆద్యం*** అయ్యాడు. ఇది అర్జునునకు తెలియబట్టే కదా చెబుతున్నాడు. ఒక వైపు ఆద్యుడు అంటూ, మరో వైపు ఆద్యుడవైన నిన్ను తెలుసు కోవాలని ఉంది అని అంటా డేమిటి?

ఇక్కడొక అందమైన మెలిక ఉంది. సుందరమైన లంకె ఉంది. ఆదిలో ఎవడు ఉంటాడో, అతడు ఆద్యుడు ***(ఆదౌ భవ ఆద్యః).*** ఈ విధంగా భగవంతుణ్ణి గూర్చి అర్జునునికి తెలుసు. కాని, ఆద్యుడు అంటే మరొక అర్థం కూడా ఉంది. సమస్తాన్ని ఆరగించుటకు ప్రవృత్తుడు ఆద్యుడు ***(ఆసమంతా దత్తుం ప్రవృత్తః ఆద్యః).*** ఆదిదేవుడై ఆపదలలో ఆదుకొనే వాడిగా అర్జునుడికి ఆద్యుడు తెలుసు. కాని, అందరినీ అమాంతంగా, ఆనందంగా ఆరగించే ఆద్యుడుగా ఇప్పుడే చూస్తున్నాడు. ఏది ఆద్యమో, ఏది ఖాద్యమో అర్థం గాక, ఆవేదనతో, ఆరాధనా హృదయుడై అడుగు తున్నాడు అర్జునుడు.

అంతే కాదు. లయ రూపుడైన పరమేశ్వరుని ఉగ్రరూపమును చూచి తట్టుకోలేక, 'నీకు దండం పెడతా! నన్ను ప్రసన్నంగా అనుగ్రహించు ***(నమోఽ స్తుతే దేవ వర ప్రసీద)!'*** అని కూడా ప్రార్థిస్తున్నాడు. నిగూఢమైన జ్ఞానాన్ని ప్రశ్నించి తెలుసుకొనే వాడే కదా శిక్షణ యోగ్యుడైన శిష్యుడు!

**ఎవరు నీవు ఎవ్వరూ ఎరుగలేరు**
**ఎరిగిన వారు తిరిగి ఎరుక పరచలేరు**
**ఎదను చేరి సొదలన్నీ విందువయ్యా!**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

*పార్థుని ప్రార్థన నాలకించిన పార్థసారథి, తన ప్రవృత్తి దేని నిమిత్తమో వరుసగా మూడు శ్లోకాలలో చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

**కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః ।**
**ఋతేఽపి త్వాం న భవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ॥** 32

***కాలః-అస్మి-లోకక్షయకృత్-ప్రవృద్ధః-లోకాన్-సమాహర్తుం-ఇహ-ప్రవృత్తః***
***ఋతే-అపి-త్వాం-న-భవిష్యంతి-సర్వే-యే-అవస్థితాః-ప్రత్యనీకేషు-యోధాః***

| | | | |
|---|---|---|---|
| లోకక్షయకృత్ | = లోకసంహారకుడనై | యే | = ఏ |
| ప్రవృద్ధః | = వృద్ధి చెందిన | యోధాః | = యోధులు |
| కాలః | = కాలుణ్ణి | ప్రత్యనీకేషు | = ప్రతిపక్ష సైన్యము లందు |
| అస్మి | = అయి ఉన్నాను | అవస్థితాః | = ఉన్నారో |
| ఇహ | = ఇప్పుడు | సర్వే | = వారందరు |
| లోకాన్ | = లోకములను | త్వాం ఋతే అపి | = నీవు లేక పోయినా |
| సమాహర్తుం | = సంహరించుటకు | న భవిష్యంతి | = భవిష్యత్తులో ఉండరు |
| ప్రవృత్తః | = ప్రవర్తిస్తున్నాను | | |





**శ్రీభగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! నేను లోకాలను సంహరించడానికి విజృంభించిన కాలుణ్ణి. ప్రాణులను సంహరించడానికి ఈ ప్రపంచంలో ప్రవర్తిస్తూ ఉంటాను. ప్రతిపక్ష సైన్యము లోని యోధులు నువ్వు యుద్ధం చేయక పోయినా జీవించి ఉండరు.**

**వ్యాఖ్య**

కృష్ణా! నిన్ను గూర్చి ***(భవంతం).*** నీ ప్రవృత్తిని గూర్చి ***(తవ ప్రవృత్తిమ్)*** నేను తెలుసుకోలేక పోతున్నాను ***(న హి ప్రజానామి).*** నీ వెవరో, నీ కార్య మేమిటో నీ నుండే తెలుసుకోవాలి అనుకుంటున్నాను ***(విజ్ఞాతుమ్ ఇచ్ఛామి)*** అని ప్రార్థించిన పార్థునికి, సమాధానం చెబుతున్నాడు భగవంతుడు.

**నేను కాలము - నా పని సంహారము**

అర్జునా! నేను కాలం. నా కార్యము సంహారం **(కాలః అస్మి లోకక్షయ కృత్).** ప్రాణుల సంహారము అనే కార్యము ద్వారా భూభారాన్ని హరించే కాలరూపుణ్ణి నేను అంటున్నాడు భగవంతుడు.

సర్వ ప్రాణి సంహార హేతువు కాల రూపంలో శోభిస్తున్న పరమేశ్వరుడే. కాలం ఆయన స్వరూపము. కాలం భగవంతుని అధీనంలో ఉంది. కాలం లేకపోయినా భగవంతుడు ఉంటాడు. కాలానికి ఆధారమైన తాను స్వరూపతః కాలాతీత చైతన్యంగా భాసిస్తున్నాడు. **ప్రభవః ప్రలయః స్థానం** - సృష్టి లయ స్థితులు తానే నని రాజవిద్యా రాజగుహ్య యోగంలో తెలిపాడు ( *9 వ అ - 18 వ శ్లో* ). సృష్టిస్థితులు తన వల్లనే ఎలా సాగుతున్నాయో పూర్వాధ్యాయాలలో విస్తారంగా ప్రస్తావించిన పరమేశ్వరుడు, ప్రస్తుతం తనను ప్రళయరూపునిగా దర్శింప చేస్తున్నాడు. ప్రస్తుతం అంటే ఇప్పుడు, ఈ సమయంలో, కురుక్షేత్రంలో అని అర్థము **(ఇహ అస్మిన్ కాలే).** ఇంతవరకు సృష్టికర్తగా, స్థితికర్తగా గోచరించిన భగవానుడు, ఇప్పుడు, ఇక్కడ సంహారకర్తగా కనిపిస్తున్నాడు. సంహారము అనేది కాలం లోనే జరగాలి. కనుక భగవంతుడు కాలరూపుడు. కాలస్వరూపుడు **(కాలః అస్మి).**

కబళించే వాటిలో తాను కాలము అంటూ ఇప్పటికే భగవంతుడు తన విభూతిగా కాలాన్ని అభివర్ణించాడు ( *10 వ అ - 30 వ శ్లో* ). ఈ ప్రపంచం కాలంలో తెలుస్తూ ఉంది. కాలంలో కదులుతూ ఉంది. కాలంలో కనుమరు గవుతూ ఉంది. అన్నీ కాలంలో కనుమరు గవుతూ ఉంటే, కాలము కాలరూపుడైన పరమేశ్వరునిలో కరిగిపోతూ ఉంది. అందుచేతనే ఆయన కూడా 'కాలం'గా తెలుస్తున్నాడు **(కాలా లీయతే అస్మిన్ ఇతి కాలః).**

**సర్వం కాలగతం**

కాలం అనిత్యం. కాల స్వరూపుడైన పరమాత్మ నిత్యము. కాలం లోనే అన్నీ ఆవిర్భవిస్తున్నాయి. కాలం లోనే అన్నీ అంతరిస్తున్నాయి. కాలమే నిత్యం కాదు కనుక, కాలంలో ఉన్నవి ఏవీ నిత్యం కావు.

ఏవైనా, ఎవరైనా కాలంలో కొంత కాలమే ఉంటారు. అందరమూ ఒకే కాలంలో పుట్టక పోయినా, కాలం లోనే అందరమూ పుడుతాము. ఎవరు ఏయే కాలాలలో పుట్టాలో నిర్ణయించేది ధర్మరూప నియతి. ధర్మరూపంలో ఉన్నది దైవమే కనుక, నియతిగా తెలుస్తున్నది నియంతే కాబట్టి, సర్వుల పుట్టుకకు కారణం భగవంతుడే.

పుట్టిన వారు ఎవరైనా ఈ ప్రపంచంలో చచ్చేందుకే ఉన్నారు. పుట్టి చావని వాళ్ళు ఉండట మనేది ఊహ కందదు. అది సత్య దూరమైన విషయం. కాని, ఎవరు ఎప్పుడు చనిపోతారు అనేది కాలగతమైన విషయం. అది కాలానికి కూడా అర్థం కాదు. కాలంలో కర్మఫలాల్ని అందించే కాలస్వరూపుడైన పరమేశ్వరునికే అవగతం.

మృత్యువు అనేది కార్యము. అది ఏ కాలంలో ప్రాప్తించాలో నిర్ణయించే కారణాలు ముందే ఉన్నాయి. ఏ

కార్యాని కైనా రూపాన్నిచ్చేవి కారణాలే. కారణాలు మెల్లమెల్లగా కదులుతూ ఒక కాలంలో కార్య రూపాన్ని ధరిస్తాయి. అలాగే కర్మఫలాలు మృత్యు కారణాల రూపంలో కదులుతూ, ఒక దశలో కార్య రూపాన్ని పొందుతాయి. అదే మృత్యువు. కార్యరూప వినాశము.

కారణాలు ఉండి, అవి ధర్మబద్ధంగా కార్య రూపాన్ని దాల్చేటప్పుడు, ఆ కార్యాన్ని జరగకుండా నివారించే శక్తి ఎవరి కుంటుంది? అందుకే మృత్యువు అనివార్యంగా తెలుస్తూ ఉంది. మృత్యువును ఎవ్వరూ ఆపలేరు. మృత్యువును నిలువరించే శక్తి, నివారించే యుక్తి ఎవ్వరికీ ఉండదు. కాల గతాలన్నీ కాలరూప పరమేశ్వరునికి తల వంచి తరలి పోవలసిందే. తరలి పోయే వారందరికీ కారణం ఈశ్వరుడే.

## మృత్యువు దైవాధీనం - మానవులు నిమిత్తం

అర్జునా! ఈ కురుక్షేత్ర సమరభూమిలో కాలు మోపిన యోధు లందరు మరణించడానికే ఉన్నారు. ఎవరైతే మరణిస్తారని నువ్వు కలత చెందావో, ఆ భీష్మద్రోణాదులు ***(భీష్మద్రోణ ప్రభృతయః)*** నువ్వు యుద్ధం చేయక పోయినా ***(త్వా ఋతేఽ పి)*** మిగలరు. నశించి తీరుతారు అంటూ దుర్భర సత్యాన్ని, శతాఘ్నిని పేల్చినట్లు పేల్చాడు భగవంతుడు. ఆ మాట విని అర్జునుని చిత్తము కకావికలై ఉంటుంది. వాస్తవాలు అలాగే ఉంటాయి. అందుకే నిజం నిప్పు లాంటిది అన్నారు పెద్దలు.

ఇంత వరకు తాను చంప వలసి వస్తుందేమో అని కలత పడ్డాడు కౌంతేయుడు *(2 వ అ - 4 వ శ్లో)*. నువ్వు లేకున్నా వారు పోతారు అని గీతాచార్యుడు చెప్పగానే అర్జునుడు దిగ్భ్రాంతి చెందాడు.

అర్జునా! పోయే వారందరికీ కారణం నేనే గాని, నీవు కావు. నువ్వు పొమ్మంటే పోవడానికి వారు నువ్వు రమ్మంటే వచ్చారా? కాలంలో వచ్చిన వారు కాలం తీరితే ఎందుకుంటారు?

చెట్టులో పక్వమైన పండును తోటమాలి కోయవచ్చు. అతడు కోయక పోయినా, పక్వమైన ఫలం దానంతటదే రాలి పోతుంది.

చెట్టులో కాసిన కాయను పండు కాకుండా ఎలా ఆపలేమో, అలాగే పక్వమైన పండును చెట్టు నుండి పతనం కాకుండా నిలుపలేము. ఇక్కడ తోటమాలి నిమిత్తము. కాలమే ప్రధానము.

పక్వమైన ఫలాలు తరువుల నుండి పతన మైనట్లు, కర్మఫలాలు కూడా కాలంలో అందుతాయి. మృత్యుకాలం ఆసన్న మైనపుడు, తరువుల నుండి ఫలాలు రాలినట్లు ప్రపంచంలో మానవులు రాలి పోతారు. ఇదంతా కర్మఫల ప్రస్థానం. చాలా కాలంగా, కదలి వస్తున్న కారణాల ఫలితమే మృత్యువు.

అర్జునా! ద్రౌపది వస్త్రాపహరణ సన్నివేశం ఈ నాటిదా? అలాగని ఒకనాడు జరగనిదా? ఏళ్ళు గడిచి పోయి ఉండవచ్చు. కాని ఫలితం నేడు అందబోతోంది. నువ్వు ఉన్నా, లేకున్నా ఫలితం అందడంలో పెద్ద తేడా ఉండదు. నీవు లేకున్నా ***(ఋతేఽ పి త్వా)***, భీష్మద్రోణాదులు మాత్రం ఉండరు ***(న భవిష్యన్తి)***. వాళ్ళను చంపేది నువ్వు కాదు. నువ్వు లేకున్నా వాళ్ళు మరణిస్తారు. నువ్వు ఉండి వాళ్ళ మరణాన్ని ఆపలేవు కూడా. అదంతా నా కార్యము. కాలరూపుడ నైన నా కార్య వైభవము. అర్జునా! ఇప్పుడు అర్థమైందా! నే నెవరో, నా కార్య మేమిటో!

*తానేమిటో, తన కార్య మేమిటో వివరించిన భగవానుడు, అర్జును డేమిటో, ఆయన కార్య మెలా ఉండాలో కూడా చెబుతున్నాడు.*

**తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూ న్భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్ ।** 33
**మయై వైతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్ ॥**





**తస్మాత్-త్వం-ఉత్తిష్ఠ-యశః-లభస్వ-జిత్వా-శత్రూన్-భుంక్ష్వ-రాజ్యం-సమృద్ధం**
**మయా-ఏవ-ఏతే-నిహతాః-పూర్వం-ఏవ-నిమిత్తమాత్రం-భవ-సవ్యసాచిన్**

| | | | |
|---|---|---|---|
| తస్మాత్ | = అందువలన | భుంక్ష్వ | = అనుభవించు |
| త్వం | = నీవు | ఏతే | = ఈ |
| ఉత్తిష్ఠ | = లే! | మయా ఏవ | = నా చేతనే |
| శత్రూన్ | = శత్రువులను | పూర్వమేవ | = పూర్వమే |
| జిత్వా | = జయించి | నిహతాః | = చంపబడిరి |
| యశః | = కీర్తిని | సవ్యసాచిన్ | = అర్జునా! |
| లభస్వ | = పొందు! | నిమిత్తమాత్రం | = నిమిత్తమాత్రుడవు |
| సమృద్ధం | = సంపూర్ణమైన | భవ | = కా! |
| రాజ్యం | = రాజ్యమును | | |

**సవ్యసాచీ! అర్జునా! లేచి నిలబడు. శత్రువుల్ని జయించి రాజ్యాన్ని అనుభవించు! కీర్తిని పొందు. నా చేతిలో వీళ్ళందరూ గతించారు. నువ్వు కేవలం నిమిత్తంగా ఉండు.**

### వ్యాఖ్య

చంపేది తానే నని, కర్తృత్వాన్ని భుజాని కెత్తుకొని కర్తగా ఊగిపోతూ, గోవిందా! నేను యుద్ధము చేయను అని ***(న యోత్స్యే ఇతి)*** అర్జునుడు రెండవ అధ్యాయంలో కూర్చుండి పోయాడు.

ప్రస్తుతం చావు ఏమిటో, చంపే దెవరో, చచ్చే దెవరో, అన్ని విషయాలు అర్జునునికి పూర్తిగా అర్థమయ్యాయి. కోడి కూయడానికి, తెల్లవారడానికి సంబంధం లేదని తేలి పోయింది. తెల్లవారబోయే సమయంలో కోడి కూయవచ్చు. కోడి కూయకుండా ఆదమరచి కునుకు తీసినా, సూర్యోదయం జరిగే తీరుతుంది. ప్రపంచంలో వెలుగులు విరబూస్తాయి. ఈ సత్యం అర్థం గాక విషాదంతో కూలబడిన కుంతీ తనయుణ్ణి భగవంతుడు వెన్నుదట్టి, అర్జునా! లే, లేచి నిలబడు! **(తస్మాత్ ఉత్తిష్ఠ)** అంటూ కార్యోన్ముఖుణ్ణి చేస్తున్నాడు.

## ధర్మ జీవనం

'అర్జునా! లేచి నిలబడు. శత్రువుల్ని జయించు. రాజ్యాన్ని వరించు. కీర్తిని పొందు' అని ప్రముఖంగా ఈ సందర్భములో భగవంతుడు అర్జునునికి చేసిన బోధను సాధారణ దృష్టితో గ్రహించడానికి వీలు లేదు. అలా గ్రహించే వారే శ్రీకృష్ణుడు యుద్ధాన్ని ప్రేరేపించాడని, శాంతి కాముకుడు కాడని గర్హిస్తూ, అభియోగాలను మోపుతూ ఉంటారు.

ధర్మం అడుగంటి, అధర్మం విలయ తాండవం చేసే టప్పుడు, క్షత్రియుడైన పార్థుడు ధర్మమును పునః సుప్రతిష్ఠం చేయడానికి యుద్ధానికి నడుం బిగించాలి. ఎప్పుడు కూడా కర్మ అప్రధానం. భావనే ప్రధానం. కాని, స్వధర్మాచరణము ద్వారా అర్జునుడు తన ధర్మాన్ని తాను నిర్వహించడంలో ఎవరైనా మరణించ వచ్చు. భగవంతుని అర్చిస్తే, హృదయం నిర్మల మవుతుందని కర్మయోగంలో ఇది వరకే చూశాం.

ధర్మాచరణంలో దోషం లేదు. జ్ఞాని కాని వాడు అహంకారంతో ధర్మజీవనాన్ని విస్మరిస్తే పాడై పోతాడు. ధర్మము పవిత్రమైంది కనుక, ధర్మాచరణంలో కష్టాలు ఎదురైనా, కన్నీళ్ళు యెదను నింపినా, ఈశ్వరానుగ్రహం చేత ధర్మాత్ముడు కష్టాలను దాటి పోతాడు. ధర్మబోధను పట్టించుకోకుండా అహంకారంతో విర్రవీగే వాడు నశించి పోతాడు *( 18 వ అ - 58 వ శ్లో )*. అందుకనే, యుద్ధం చేసి శత్రువు లైన దుర్యోధనాదుల్ని వధించ

మంటున్నాడు వాసుదేవుడు ***(జిత్వా శత్రూన్ దుర్యోధన ప్రభృతీన్).*** శత్రు సంహారం చేసి సమృద్ధము, అకంటకమైన రాజ్యాన్ని అనుభవించ మని ఆశీర్వదిస్తున్నాడు ***(భుంక్ష్వ రాజ్యమ్ సమృద్ధమ్, అసపత్నమ్ అకంటకమ్).***

శ్రీకృష్ణుడు ఇదంతా బోధించింది వాస్తవమే. కానీ, ఇందులో సారభూతమైన విషయం యుద్ధం చేయడం కాదు, రాజ్యం పొందడం కాదు, కీర్తితో శోభించడమూ కాదు. ధర్మాచరణమే ప్రధానమైన, సారభూతమైన విషయం.

ఒకవేళ, దుర్యోధనుడు మనస్సు మార్చుకొని, పశ్చాత్తాపం చెంది, పాండవులకు ఇవ్వవలసిన రాజ్య భాగాన్ని వారి కిచ్చేసి, యుద్ధాన్ని విరమిస్తే, దానిని మీరు అధర్మం అని అంటారా? యుద్ధం క్షత్రియ ధర్మం కనుక, దుర్యోధనుడు యుద్ధాన్ని విరమించడం అధర్మం అని చెబుతారా? ఏది ధర్మం, ఏది అధర్మం? అర్జున దుర్యోధనులు ఇరువురూ క్షత్రియులే అనే విషయాన్ని మరచి పోకండి.

ఇక్కడ, అర్జునుడు యుద్ధం చేయడం ధర్మం. దుర్యోధనుడు చేయడం అధర్మం. దుర్యోధనుడు యుద్ధం విరమించడం ధర్మం. అర్జునుడు విరమించడం అధర్మం. యుద్ధం చేయడం ధర్మం కాదు. అవసరమైతే ధర్మం కోసం క్షత్రియుడు యుద్ధం చేయాలి. ధర్మాచరణమే ముఖ్య ప్రయోజనం.

## అర్థకామాలు అవాంతరాలు

క్షత్రియుడు ధర్మయుతంగా యుద్ధం చేస్తాడు. అంతే. జయాపజయాలు దైవాధీనాలు. కర్మఫలాలు. విజయం వరిస్తే రాజ్యం ప్రాప్తిస్తుంది. ధర్మ కార్యాన్ని నిర్వహించాడు కనుక కీర్తి లభిస్తుంది ***(యశో లభస్వ).*** రాజ్యసుఖాలు, కీర్తిప్రతిష్ఠలు అవాంతర ఫలాలు. ధర్మమే, ధర్మాచరణమే ముఖ్యఫలం. అర్జునా! అర్థం చేసుకో! కర్మ చేయడం లోనే నీకు అధికారం ఉంది. దానిని విస్మరించకు. ఫలితాలు నీ అధీనంలో లేవు. దానిని మరచిపోకు! కర్మఫలాలను నేను అనుగ్రహిస్తాను. నువ్వు కారణం అనుకోకు. అలాగని, కర్మల్ని త్యజించి అప్రతిష్ఠపాలు కాకు *( 2 వ అ - 47 వ శ్లో ).* నీ కర్తవ్యాన్ని నీవు ఆచరించు. నే నిచ్చే ఫలాలను ప్రసాదాలుగా స్వీకరించు. ఇక లే! ***(ఉత్తిష్ఠ)*** నిలబడు! కేవలం నిలబడు చాలు. నీలుగు వద్దు. నిమిత్తమే హద్దు.

## నిమిత్త మాత్రం భవ

అర్జునా! అత్త కొడుకువి. చెప్పిన దంతా బుద్ధిగా హృదయానికి హత్తుకో. నిమిత్తంగా నిలబడు. చాలు. నువ్వు చేసేది ఏమీ లేదు. అంతా నా నిర్వాకమే. నీకు అబ్బిన విద్యే కనుక, గాండీవం ఉండనే ఉంది కనుక, నదీ తీరంలో కూర్చుని, జలాలలో విలాసంగా రాళ్ళు విసిరినట్లు, సమరనదిలో బాణాలు వేస్తూ ఉండు.

నదీ తీరంలో కూర్చున్న వాడు ఏమి సాధించాలని నది లోకి రాళ్ళు విసురుతాడు? సాధించా లనుకుంటే ఎడమ చేత్తో ఎందుకు విసురుతాడు? ఫలితాలు ఆశించని కార్యం కనుక, ఏ చేత్తో నైనా విసురుతాడు.

నువ్వూ అంతే. అనాయాసంగా ఎడమ చేత్తో శరాలు విడుస్తూ, 'సవ్యసాచి' అనే బిరుదును కూడా పొందావు. ఆ పేరును సార్థకం చేసుకో! ***నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్*** - సవ్యసాచీ! అర్జునా! నిమిత్తంగా నిలబడి యుద్ధం చెయ్యి. అంతే.

ఎడమ చేతితో కూడా ***(సవ్యేన)*** బాణాలను ప్రయోగించే ***(సంచితుమ్)*** సామర్థ్యం కలవాడు కనుక, అర్జునుడు సవ్యసాచి. కుడిచేతితో వీరు లెవరైనా శర ప్రయోగం చేయగలరు. కాని, ఎడమ చేతితో కూడా సమాన వేగంతో బాణాలను ప్రయోగించడంలో అర్జునుడిది అందె వేసిన చేయి ***(సవ్యేన వామేనాపి హస్తేన శరాణాం క్షేపాత్ సవ్యసాచీతి ఉచ్యతే అర్జునః).***





జలాశయాలలో గులకరాళ్ళు విసిరినట్లు, కురుక్షేత్రంలో బాణాలు విడుస్తూ ఉంటే, రణరంగ వీరులైన భీష్మద్రోణ కర్ణాదులు మరణిస్తారా? అనే సందేహం కలగవచ్చు. ఆ సందేహాన్ని పరిహరిస్తూ, అదేమీ పెద్ద కార్యము కాదు అంటున్నాడు. ఎందుకని? వాళ్ళు ముందే హతులై ఉన్నారు కనుక.

అర్జునా! ఈ వీరు లందరూ ముందే నా చేత చంపబడి ఉన్నారు ***(మయైవ ఏతే నిహతాః నిశ్చయేన హతాః).*** ఇక నువ్వు చంపే దేముంది? వాళ్ళు చచ్చే దేముంది? వాళ్ళ ప్రాణాలు ఎప్పుడో పోయాయి ***(ప్రాణైః వియోజితాః).*** ఇష్టం లేకపోతే, నువ్వు యుద్ధాన్ని విరమించ గలవు. అంతేగాని పోయిన వాళ్ళ ప్రాణాల్ని తిరిగి పోయగలవా? కాలరూపుడ నైన నా చేతిలో వాళ్ళందరూ ఇప్పటికే గతించారు.

అర్జునా! మరొక ముఖ్యమైన విషయం కూడా నీకు చెబుతున్నా. శ్రద్ధగా విను. వాళ్ళు గతించడానికి, మన ఉభయుల బాంధవ్యానికి సంబంధం లేనే లేదు. నువ్వు నాకు అత్తకొడుకు వని నేను వాళ్ళను వధించలేదు. నీ సుఖానికి వాళ్ళను నేను బలి చేయను. నీకు కీర్తిప్రతిష్ఠలు ఆర్జించి పెట్టాలని నేను వాళ్ళను సంహరించ లేదు.

నువ్వు నాకు ఇష్టుడవు కావచ్చు. సఖుడవు కావచ్చు. భక్తుడివి కావచ్చు. శిష్యుడివి కావచ్చు. నువ్వు అర్హుడివి కనుక, నీపై నాకు ప్రేమ ఉండవచ్చు. నీ మీద నాకున్న ప్రేమ కారణంగా నువ్వు ఆశిస్తే, నీకు విశ్వరూపాన్ని దర్శింప చేస్తాను. అలాగని నీ కొరకు అన్యాయంగా, అధర్మంగా అన్యుల ప్రాణాలను హరించడానికి నే నెప్పుడూ సాహసించను.

వాళ్ళ ఆయుర్దాయం ముగిసింది. వాళ్ళ ప్రాణాలు కాలం యొక్క కబంధ హస్తాలలో చిక్కుకున్నాయి. వాళ్ళు మృత్యువు నుండి తప్పించుకో లేరు. వాళ్ళు కురుక్షేత్రం లోనే ఉండ నవసరం లేదు. కుమ్మరి పాళెంలో ఉన్నా వాళ్ళ కళ్ళు మూతపడి పోతాయి. ఎలాగూ పోయేవాళ్ళు యుద్ధంలో పోతున్నారు. అంతే. యుద్ధం యాదృచ్ఛికమే అని అర్థం చేసుకో! కాలరూప ధర్మంగా నా కర్తవ్యం ఈ యుద్ధంతో ప్రారంభమైంది కాదు. ఈ యుద్ధంతో ముగిసేదీ కాదు. నా కార్యం ప్రవాహ రూపంలో సాగిపోతూనే ఉంటుంది. అనంత కాల ప్రవాహంలో ఒక సమయంలో, ఒక ప్రదేశంలో సాగే యుద్ధాన్ని ఆధారం చేసుకొని నా అనంత వైభవాన్ని అంచనా వేయడం అజ్ఞానమే అవుతుంది.

అర్జునా! అర్థమైందా? భీష్మద్రోణాదులు గతించే కాలం సమీపించింది. అది వాళ్ళ కర్మఫలం. యుద్ధంతో సంబంధమే లేదు. నిన్ను తృప్తి పరచేందుకు నేను వాళ్ళను రథాల నుండి క్రింద పడదోయ లేను. ఇదంతా సృష్టి లోని ధర్మ నియతి. అంతే.

వాళ్ళ మృత్యువును చూశాను కనుక, ఆయుర్దాయం తీరిన ఆ యోధులు గతించారు అన్నాను. ఒకవేళ, మీకే ఆయుర్దాయం తీరి ఉంటే, మీరే గతించారు అని చెప్పి ఉండేవాణ్ణి. ఇప్పుడు అర్థమైంది అనుకుంటాను. మరో పది నిముషాల్లో మరణించే రోగి మాట్లాడుతూనే ఉంటాడు. అందరూ అతడు బ్రతికి పోయా డనుకుంటారు. కానీ, చావు తెలివి ఒక వైపు ప్రదర్శింప బడుతున్నా, అతడు చచ్చిన వాడే నని వైద్యుడికి క్షుణ్ణంగా తెలుసు. అర్జునా! నన్ను మించిన వైద్యు లెవరు? వైద్యు లందరూ నారాయణులే అని అనుకుంటారు. ఎందుకో తెలుసా! నారాయణు డొక్కడే వైద్యుడని తెలియదు కనుక ***(సర్వ విద్యానాం వేదితృత్వాత్ వైద్యః).***

ఇక లే! అర్జునా! అర్థమైంది కదూ? లేచి నిలబడు. యుద్ధం చేసేయ్!

## ఇక నే నెందుకు?

కృష్ణా! వాళ్ళు గతించి పోయారు అని నువ్వే చెబుతున్నావు కదా! ఇక, నేను యుద్ధం చేసేది ఏముంది? ఇది అర్జునుని శంక.

అర్జునా! ఏమీ లేదు కనుకనే, నిమిత్తంగా నిలబడు అన్నాను ***(నిమిత్త మాత్రం భవ).*** 'నింద లేక బొంది పోదు' అనే సామెత తెలుసు కదా నీకు సవ్యసాచీ! బొంది పోవడానికి ఏదో ఒక ప్రత్యక్ష కారణం ఉండాలి కదా! అది నువ్వుగా ఉండు. అంతే. అందుకనే, నీలుగు మాని నిమిత్తంగా ఉండ మన్నాను.

ఇది పదకొండవ అధ్యాయము. త్రిసంధ్యలలో త్రికరణ శుద్ధితో జ్ఞాపకం చేసుకోదగిన పదకొండు అక్షరాల మంత్రము లాంటి వాక్యము కనుక, మూడు మూడు అంటూ ముప్పై మూడవ శ్లోకంలో, ***నిమిత్త మాత్రం భవ సవ్యసాచిన్*** అనే ఏకాదశాక్షరీ మంత్రాన్ని ఈ ఏకాదశాధ్యాయంలో అర్జునుని నిమిత్తంగా చేసికొని భక్తవత్సలు డైన వాసుదేవ భగవానుడు మనందరికి ప్రసాదంగా అనుగ్రహించాడు. ప్రశాంత చిత్తముతో అర్థం చేసుకొని మూడు అవస్థల లోను ప్రసన్న హృదయులమై భగవద్భక్తిలో రమించి తరించెదము గాక!

**ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథాన్యానపి యోధవీరాన్ ।**
**మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్ ॥** 34

*ద్రోణం-చ-భీష్మం-చ-జయద్రథం-చ-కర్ణం-తథా-అన్యాన్-అపి-యోధవీరాన్*
*మయా-హతాన్-త్వం-జహి-మా-వ్యథిష్ఠాః-యుధ్యస్వ-జేతాసి-రణే-సపత్నాన్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మయా | = | నా చేత | యోధ వీరాన్ అపి | = | యోధవీరులను కూడా |
| హతాన్ | = | చంపబడిన | త్వం | = | నీవు |
| ద్రోణం చ | = | ద్రోణుని | జహి | = | చంపు! |
| భీష్మం చ | = | భీష్ముని | మావ్యథిష్ఠాః | = | విచార పడకు! |
| జయద్రథం చ | = | జయద్రథుని | యుధ్యస్వ | = | యుద్ధము చెయ్యి! |
| కర్ణం | = | కర్ణుని | రణే | = | యుద్ధము నందు |
| తథా | = | అలాగే | సపత్నాన్ | = | శత్రువులను |
| అన్యాన్ | = | ఇతరులైన | జేతాసి | = | జయించగలవు |

**అర్జునా! ఇప్పటికే మరణించిన ద్రోణుడు, భీష్ముడు, సైంధవుడు, కర్ణుడు, అలాగే నా చేత హతులైన యుద్ధవీరులను కూడా నువ్వు వధించు. కలత చెందకు. యుద్ధము చెయ్యి. శత్రువుల్ని జయిస్తావు.**

**వ్యాఖ్య**

**కోఱలు తీసిన పాములు**

భీష్మద్రోణాది ప్రభృతులు అతిరథులు. అజేయులు. దేవతలనే ఓడించ గల శక్తిమంతులు. అలాంటి వారిని ఎలా జయించగలం? అనే శంక అర్జునునకు అవసరం లేదంటున్నాడు భగవంతుడు. ఒక వైపు వారి అసమాన పరాక్రమాన్ని సూచిస్తూ పేరు పేరున చెబుతున్నాడు. మరో వైపు యుద్ధము చెయ్యి, విజయం నీదే అంటున్నాడు. అలా చెప్పడం వెనుక కారణ మేమిటో శ్రీకృష్ణ పరమాత్మకు స్పష్టంగా తెలుసు.

ద్రోణాచార్యుడు ధనుర్వేదాచార్యుడు. దివ్యాస్త్ర సంపన్నుడు. ముఖ్యంగా అర్జునుడికి పూజ్యుడైన గురువు ***(ఆత్మనశ్చ విశేషతః గురుః గరిష్ఠః).***

భీష్ముడు స్వచ్ఛంద మరణము కలవాడు. అంటే, తన ఇష్టానుసారం మరణించ గలవాడు. దివ్యములైన శస్త్రాస్త్రములు కలవాడు. పరశురాము డంతటి వాడితో ద్వంద్వ యుద్ధం చేసి, అపజయాన్ని పొందని వాడు ***(పరశురామేణ ద్వంద్వ యుద్ధమ్ అగమత్ న చ పరాజితః).***





ఇక జయద్రథుడు. అతడే సైంధవుడు. అతని తండ్రి ప్రస్తుతం భయంకరమైన తపస్సును సాగిస్తున్నాడు. తన కుమారుడైన జయద్రుథుని శిరస్సును ఎవడు క్రింద పడేస్తాడో, వాడి తల కూడా క్రింద పడుతుంది అనే సంకల్పంతో ఘోర తపస్సు నాచరిస్తున్నాడు **(మమ పుత్రస్య శిరః భూమౌ పాతయిష్యతి యః తస్యాపి శిరః పతిష్యతి ఇతి).**

ఇక వీరుడైన కర్ణుడు. సహజ కవచ కుండలాలతో జన్మించిన వాడు. స్వయంగా ఇంద్రుడు ప్రసాదించిన 'శక్తి' అనే అమోఘమైన ఆయుధం కలవాడు. సూర్యుని పుత్రుడు. కన్యగా ఉండిన కుంతీదేవికి పుట్టిన వాడు కనుక కానీనుడు **(కానీనః).**

**కలత ఎందుకు?**

ఈ కారణాల చేత వీరందరూ యోధులు. యుద్ధవీరులు. అలా ఎందరో ఉన్నారు. వీళ్ళను నేనెలా జయించగలను? అని అర్జునుడు కలత చెంద నవసరం లేదు. అర్జునా! వీళ్ళందరూ ఇప్పటికే నా చేతిలో చచ్చి పోయారు. అన్నీ కాగితపు పులులే. కోఱలు తీసిన పాములే. ప్రాణాలు లేని బొమ్మలే. ప్రాణాలు పోగా దేహాలు నిలబడి ఉన్నాయి. పండుటాకుల్ని గాలి రాల్చేసినట్లు, ప్రాణాలు పోగొట్టుకొని నిలబడి యున్న ఈ వీరుల దేహాలను నీ బాణాలతో క్రింద పడేయ్! కలవర పడకు **(మా వ్యథిష్ఠాః).** కష్టమే లేని కార్యానికి కలవర పడట మెందుకు? అర్జునా! యుద్ధం చెయ్యి **(యుధ్యస్వ).** జయం నీదే **(జేతాసి).** రాజ్యలక్ష్మిని చేపట్టు అన్నాడు గీతాచార్యుడు.

**మోక్షార్థమే**

ఆత్మబంధువులారా! భగవద్గీత మోక్ష శాస్త్రము అని పదే పదే నేను జ్ఞాపకం చేయ నవసరం లేదని భావిస్తున్నాను. ఈ సందర్భంలో దానినే దృష్టిలో ఉంచుకొని అర్థం చేసుకోవాలి.

'యుద్ధం చెయ్యి. రాజ్యాన్ని పొందు' అని శ్రీకృష్ణుడు చెబుతున్న దానిని కేవలం వాక్యార్థంగా స్వీకరిస్తే లాభం లేదు. వాసుదేవ హృదయాన్ని అర్థం చేసుకోవాలి. యుద్ధం చేయమంటే, రాజ్యాన్ని చేపట్ట మంటే, కురుక్షేత్రంలో యుద్ధం చేయమని, కురు సామ్రాజ్య పీఠాన్ని అధిరోహించ మని కాదు. జీవన సమరంలో విజయం సాధించి, మోక్ష సామ్రాజ్యాన్ని అధిష్ఠించ మని అర్థం.

మోక్షాన్ని సాధించాలి అంటే జ్ఞానాన్ని పొందాలి. జ్ఞానాన్ని పొందాలి అంటే అంతఃకరణ శుద్ధి కావాలి. అంతఃకరణ శుద్ధి అనేది రాగద్వేషాలు లేకుండా స్వధర్మాన్ని ఆచరించడం వల్లనే సాధ్య పడుతుంది. అర్జునుడు క్షత్రియుడు. ధర్మయుద్ధం చేయడం స్వధర్మము. స్వధర్మానుష్ఠానాన్ని చిత్తశుద్ధి కొరకు ఆచరించమని చెబుతున్నాడు భగవంతుడు.

**సంజయ ఉవాచ :**

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీతః ప్రణమ్య ॥ 35

ఏతత్-శ్రుత్వా-వచనం-కేశవస్య-కృతాంజలిః-వేపమానః-కిరీటి
నమస్కృత్వా-భూయః-ఏవ-ఆహ-కృష్ణం-సగద్గదం-భీతభీతః-ప్రణమ్య

| | | | | | |
|---|---|---|---|---|---|
| కిరీటీ | = | అర్జునుడు | కృష్ణం | = | కృష్ణునికి |
| కేశవస్య | = | శ్రీకృష్ణుని యొక్క | నమస్కృత్వా | = | నమస్కరించి |
| ఏతత్ | = | ఈ | ప్రణమ్య | = | వినమ్రుడై |
| వచనం | = | వాక్యమును | భీతభీతః | = | మిక్కిలి భయపడుతూ |
| శ్రుత్వా | = | విని | సగద్గదం | = | గద్గద స్వరముతో |
| కృతాంజలిః | = | చేతులు జోడించిన వాడు | భూయః ఏవ | = | మరల |
| వేపమానః | = | వణకుచున్న వాడై | ఆహ | = | పలికెను |

**సంజయుని సందేశము :**

**ధృతరాష్ట్ర మహారాజా! కేశవుడు చెప్పిన మాటలు విని విజయుడు వణకి పోయాడు. భయకంపితు డయ్యాడు. చేతులు జోడించి, వంగి నమస్కరించాడు. గద్గద స్వరంతో మళ్ళీ పలుకు తున్నాడు.**

**వ్యాఖ్య**

కురుక్షేత్రంలో జరిగిన, జరుగుతున్న విషయాల్ని ధృతరాష్ట్రునికి విన్నవించడంతో పాటు, తన సందేశాన్ని కూడా ఈ సందర్భంలో నిగూఢంగా వినిపిస్తూ, చివరగా సంధి ప్రయత్నం చేస్తున్నాడు సంజయుడు.

శ్రీకృష్ణుని విశ్వరూపం చూచి, భీష్మద్రోణాదుల మరణ విషయాన్ని అచ్యుతుని ద్వారా ఆలకించి, దుః ఖంతో చలించి పోయిన అర్జునుడు భయకంపితు డయ్యాడు ***(భయా విప్లస్య దుఃఖాభిఘాతాత్).*** శ్రీకృష్ణుని స్నేహానురాగానికి పులకాంకితుడై హర్షాతిశయంతో కదలి పోయిన అర్జునుని నేత్రాలు ఆనంద బాష్పాలతో నిండి పోయాయి. అశ్రుపూర్ణ నయనుడైన కుంతీనందనుని కంఠం శ్లేష్మ మావరించి గద్గద మైంది ***(అశ్రుపూర్ణ నేత్రత్వే సతి శ్లేష్మణా కంఠావరోధః, సః గద్గదః).*** అర్జునుని రెండు చేతులు ఒక్క టయ్యాయి. ఫలభారంతో పండ్ల చెట్టు వంగినట్లు, భక్తి భావంతో ఫల్గునుడు వంగి పోయాడు. ఇదంతా సంజయుడు వర్ణించడం సాభిప్రాయ మైంది. అంటే, ఇంతవరకు కేవలం కురుక్షేత్రంలో కృష్ణార్జునుల మధ్య జరుగుతున్న సంవాదమును మాత్రమే ధృతరాష్ట్రునకు వినిపిస్తూ వచ్చిన సంజయుడు, ప్రస్తుతం తన అభిప్రాయాన్ని కూడా అంతర్లీనంగా జోడించి ***(అత్ర అవసరే సంజయ వచనం సాభిప్రాయం)*** అంటే. చెబుతున్నాడు. అదే సాభిప్రాయం

ఎలా సాభిప్రాయం అయింది? ***(సాభిప్రాయం కథం?).*** రాయబారం సమయంలో శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని పరమాత్మ ప్రసాదంగా ధృతరాష్ట్రుడు సందర్శించాడు. ప్రస్తుతం అత్యద్భుతమైన దివ్య దర్శనాన్ని సంజయుని ద్వారా ఆలకించాడు. భీష్మ, ద్రోణ, జయద్రథ, కర్ణాదుల మరణం అనివార్య మని తేలి పోయింది. వాళ్ళు నలుగురు మరణిస్తే, ఆ తరువాత దుర్యోధనుని ప్రాణాలను ఎవ్వరూ కాపాడలేరు.

ఇక జయంపై ఆశ లేదని తెలిసి పోయింది కనుక, నిరాశా నిస్పృహలు అలుముకున్న ఈ దుర్దశలో నైనా ధృతరాష్ట్రుడు తలచుకుంటే ఉభయుల మధ్య సంధి కుదురుతుంది. అలా అందరికీ శాంతి లభిస్తుంది అని భావించి, సంజయుడు ధృతరాష్ట్రునికి సాభిప్రాయంగా తన సంధి పిలుపును అందించాడు ***(ధృతరాష్ట్రః జయం ప్రతి నిరాశః సన్ సంధిం కరిష్యతి. తతః శాన్తిం ఉభయేషాం భవిష్యతి ఇతి).*** జరగ వలసింది మరొక విధంగా ఉండటం చేత, ధృతరాష్ట్రునిలో పరివర్తన రాలేదు ***(యదపి న అశ్రౌషీత్ ధృతరాష్ట్రః భవితవ్య వశాత్).*** విధి బలీయంగా ఉంది. జరగ బోయేది బలవత్తర మైనపుడు కానున్నది కాకపోదు ***(భవితవ్యతా బలవతీ).*** ఇక్కడే వ్యక్తి బలహీను డౌతాడు. విధి బలీయ మౌతుంది.





## పార్థుని ప్రార్థనాంజలి

అర్జునుడు పుణ్యాత్ముడు. మహాత్ముడు. మహాభక్తుడు. పరమాత్మ మంజుల మనోహర రూపాన్ని దర్శిస్తూ, ఆయన అడుగు జాడలను అనుసరిస్తూ బ్రతుకును భవ్యంగా తీర్చి దిద్దుకున్న ధర్మాత్ముడు ధనంజయుడు. ఆపద హరణాలు, ఆనంద నిలయాలు అయిన శ్రీకృష్ణ దేవుని చరణ కమలాలను నమ్ముకొని జన్మను సార్థకం చేసుకున్న అదృష్టవంతుడు.

ధర్మము, ధర్మరూపంలో ఉన్న దైవము తప్ప అవనిలో అన్యమైనవి ఆయన బుద్ధిని ఆకర్షించలేక పోయాయి. అచ్యుతుని ఆలోచనల తోనే ఆయన బ్రతుకు నావ సాగి పోయింది. ఆయన ఊహలు, ఊపిరి అన్నీ భగవంతుడే. సదా భగవంతుని యందు భక్తే గాని, భగవంతునికి దూరమై జీవించే శక్తి లేనివాడు. లేకపోతే, ప్రేమావతారమూర్తి, అనంత జ్ఞానజ్యోతి, యదుకుల చక్రవర్తి శ్రీకృష్ణ భగవానుని సహచరుడుగా, సఖుడుగా, బంధువుగా, భక్తుడుగా జీవించే భాగ్యం కలుగుతుందా? భగవంతుని అపార కరుణామృత వృష్టిలో ముద్దముద్దగా తడిసిన పాండునందనుడు కడతేరే సమయం ఆసన్నమయ్యే సరికి తరింప చేసేవాడు ఆయన తేరు లోనే తిష్ఠ వేశాడు. తరించే తీరును తెలిపే మహత్కార్యాన్ని భుజాని కెత్తుకున్నాడు. గుక్క తిప్పుకోకుండా గుట్టు నంతా విప్పి చెప్పాడు. కళ్ళారా నిన్ను చూస్తాను అని ప్రార్థిస్తే, కమనీయమైన విశ్వరూపాన్ని మహాద్భుతంగా ప్రదర్శించి ధనంజయుణ్ణి ధన్యుణ్ణి చేశాడు.

**కస్మైచిత్ అస్మై మహసే తుభ్యం నమః -** 'వర్ణింప శక్యము గాని నీ దివ్య రూపానికి నమస్కారము' అంటూ ఊహలలో ఒదిగి ఉన్న పరమేశ్వరుని తేజోమయ రూపమును ప్రార్థనలలో నింపాలని భక్తులు ప్రయత్నిస్తుంటారు. కాని, విశ్వమూర్తి యొక్క మహాద్భుత రూపాన్ని, పరమాత్మ ప్రసాదంగా లభించిన దివ్య చక్షువులతో దర్శిస్తూ, నోరారా కీర్తించే భాగ్యానికి నోచుకున్నాడు మహాభక్తుడైన అర్జునుడు.

భగవద్గీత మధ్యలో, విశ్వరూప సందర్శన యోగంలో, తన భాగ్యానికి మురిసి పోతూ, పరవశిస్తూ, మేను మరచి, మనసు తెరచి మంగళకరంగా పరమేశ్వరుని స్తుతించే మహత్కార్యానికి సిద్ధ పడ్డాడు కుంతీదేవి ముద్దుల తనయుడు. పదకొండవ అధ్యాయంలో, పదకొండు శ్లోకాలలో పదే పదే ప్రణామాలు అర్పిస్తూ పార్థుడు ఆర్తితో, భక్తితో సమర్పించిన, కీర్తించిన ఈ ప్రార్థనాంజలి భక్తు లందరికీ నిత్యస్మరణీయము. ప్రాతః పఠనీయము.

**అర్జున ఉవాచ :**

**స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్య త్యనురజ్యతే చ । 36**
**రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వే నమస్యన్తి చ సిద్ధసంఘాః ॥**

**స్థానే-హృషీకేశ-తవ-ప్రకీర్త్యా-జగత్-ప్రహృష్యతి-అనురజ్యతే-చ**
**రక్షాంసి-భీతాని-దిశః-ద్రవంతి-సర్వే-నమస్యంతి-చ-సిద్ధసంఘాః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| హృషీకేశ | = | కృష్ణా! | అనురజ్యతే చ | = | అనురాగమును పొందుతున్నది |
| తవ | = | నీ యొక్క | రక్షాంసి | = | రాక్షసులు |
| ప్రకీర్త్యా | = | మాహాత్మ్యము చేత | భీతాని | = | భయపడిన వారై |
| జగత్ | = | జగత్తు | దిశః | = | దిక్కులను గూర్చి |
| ప్రహృష్యతి | = | సంతసిస్తోంది | ద్రవంతి | = | పరుగిడుతున్నారు |

సర్వే = సమస్తమైన
సిద్ధసంఘాః = సిద్ధసంఘములు
నమస్యంతి చ = నమస్కా రము చేస్తున్నాయి
స్థానే = ఇదంతా యుక్తమే

**అర్జునుడు ప్రార్థిస్తున్నాడు :**

**హృషీకేశా! కృష్ణా! నీ వైభవాన్ని చూచి జగతి మురిసి పోతోంది. అనురాగంతో చలిస్తోంది. రాక్షసులు భీతి చెంది దిక్కుల వెంట పరుగులు తీస్తున్నారు. సిద్ధ పురుషులు నమస్కరిస్తున్నారు.**

**వ్యాఖ్య**

పరమేశ్వరుని వైభవాన్ని ఎందరో మహాత్ములు నోరారా మహిలో వర్ణించారు. స్తుతించారు. కీర్తించారు. సుమ సౌరభముతో పుష్పవనము గుబాళించినట్లు, గోవిందుని మాహాత్మ్యాన్ని ఆలకించడం చేత పుడమి భక్తితో పులకరించింది. పరిమళించింది ***(తవ ప్రకీర్త్యా త్వన్మహాత్మ్య కీర్తనేన శ్రుతేన, హే హృషీకేశ! యత్ జగత్ ప్రహృష్యతి).*** స్తుతించి కొందరు తృప్తి చెందితే, ఆలకించి కొందరు సంతృప్తి చెందారు. ఆదిదేవుని ఆనంద స్తోత్రాలతో జగత్తు అనురాగమయ మైంది ***(అనురజ్యతే అనురాగం ఉపైతి).***

ప్రస్తుతం విశ్వమూర్తి విశ్వమోహన స్వరూపాన్ని తిలకించి, వైభవాన్ని దర్శించి జగత్తు పరవశిస్తూ ఉంది. సిద్ధ పురుషులు తమ భాగ్యానికి మురిసి పోతున్నారు. భక్తితో నమస్కరిస్తున్నారు. రాక్షసులు ఆ వైభవాన్ని జీర్ణించుకోలేక పిచ్చి పరుగులు తీస్తున్నారు. సుజనులకు ఆనందాన్ని, అభయాన్ని అనుగ్రహించే పరమేశ్వరుని వైభవము కుజనులకు దుర్భరంగా ఉంది.

అందుకే నిరంతరం భగవంతుని ధ్యానాన్ని భక్తితో కొనసాగించాలి. ధ్యాన హృదయంలో పరమాత్మ దర్శనం సదా ఉంటుంది కనుక, రాక్షస గుణాలు, కామ క్రోధాదులు, వెలుగుల ముందు చీకట్లు నిలువ లేనట్లు పలాయన మవుతాయి.

కస్మా చ్చ తే న నమేర న్మహాత్మన్ గరీయసే బ్రహ్మణోఽ ప్యాదికర్త్రే ।
అనన్త దేవేశ జగన్నివాస త్వమక్షరం సదస త్తత్పరం యత్ ॥ 37

*కస్మాత్-చ-తే-న-నమేరన్-మహాత్మన్-గరీయసే-బ్రహ్మణః-అపి-ఆదికర్త్రే*
*అనంత-దేవేశ-జగన్నివాస-త్వం-అక్షరం-సత్-అసత్-తత్పరం-యత్*

మహాత్మన్ = మహాత్మా!
అనంత = అనంతుడా!
దేవేశ = దేవదేవ!
జగన్నివాస = జగదంతర్యామీ!
సత్ = సత్తు
అసత్ చ = అసత్తును
యత్ = ఏదో
తత్పరం = దానికి పరమైన
అక్షరం = అక్షర బ్రహ్మము
త్వం = నీవు
అసి = అయి ఉన్నావు
బ్రహ్మణః అపి = బ్రహ్మకును
ఆదికర్త్రే = మూలకర్తవు
గరీయసే = గొప్పవాడవు
తే = నీ కొరకు
కస్మాత్ = ఏల
న నమేరన్ = నమస్కరింప కుందురు

**మహాత్మా! నువ్వెంతో గొప్ప వాడివి. బ్రహ్మదేవుని కంటే ముందు నువ్వే ఆదికర్తవు. అనంతా! దేవేశా! జగన్నివాసా! నువ్వు సదసత్తులకు అతీతుడవు. అక్షర స్వరూపుడవు. ఎవరైనా నీకు నమస్కరించకుండా ఎలా ఉంటారు?**





**వ్యాఖ్య**

మొదటి శ్లోకంలో నమస్కార కర్తవ్యాన్ని భక్తులకు తెలిపి, రెండవ శ్లోకంలో భగవంతుని నమస్కార యోగ్యతను చెబుతున్నాడు. మొదటి శ్లోకం లోని **స్థానే** అనే పదానికి ఇది వ్యాఖ్యాన మని భావించ వచ్చు. **స్థానే** అంటే **యుక్తం** అని అర్థం. భగవద్విషయం ఆనందదాయక మనేది యుక్తమే కదా! జగత్తు మురిసి పోవడం సముచితమే కదా! అని అర్థం **(స్థానే యుక్తం, యుక్తః హర్షాది విషయః భగవాన్).**

అనంతుడైన భగవానుడు ఆదికారణంగా కీర్తింప బడుతున్నాడు. ఆయనే ఆదికర్త. బ్రహ్మదేవుడు సృష్టికర్త. దేవుడైన బ్రహ్మకు కూడా ఆయనే దేవుడు. అందుకే ఆయన దేవేశుడు **(హిరణ్యగర్భ స్యాపి).**

ఉపనిషత్తులలో పరమైన అక్షరంగా కీర్తింప బడింది తానే **(త్వం అక్షరం పరం వేదాంతేషు శ్రూయతే).** ఉన్నది సత్. లేదు అనేది అసత్. ఈ సదసత్తులు దేని కైతే ఉపాధులో, అదే అక్షరమైన భగవంతుని స్వరూపము.

ఆది లేని అనంత రూపుడైనా, అక్షరుడై అగమ్య గోచరుడైనా, యుక్తికి దొరకని అచ్యుతుడు భక్తికి వశు డౌతాడు. అందుకే అందరూ ఆయనను ఆశ్రయిస్తారు. సర్వులూ శిరమొడ్చి నమస్కరించి హృదయంలో దాచుకుంటారు.

**నీవు పుట్టిన దెక్కడో తెలియదయ్య**
**పెరుగుతున్నావు నా లోన పుణ్యపురుషా!**
**పట్టలేక నిన్ను నా గుండెలో పెట్టుకొంటి**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.

త్వ మాదిదేవః పురుషః పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వ మనన్తరూప ॥ 38

*త్వం-ఆదిదేవః-పురుషః-పురాణః-త్వం-అస్య-విశ్వస్య-పరం-నిధానం*
*వేత్తా-అసి-వేద్యం-చ-పరం-చ-ధామ-త్వయా-తతం-విశ్వం-అనంతరూప*

అనంతరూప = అనంతరూపుడా!
త్వం = నీవు
ఆదిదేవః = ఆదిదేవుడవు!
పురాణః = సనాతను డవైన
పురుషః = పురుషుడవు
త్వం = నీవు
అస్య = ఈ
విశ్వస్య = విశ్వమునకు
పరం = ఉత్తమమైన
నిధానం = ఆశ్రయానివి
వేత్తా = సర్వజ్ఞుడవు
వేద్యం చ = తెలియదగిన విషయమును
పరం చ = పొందదగిన
ధామ = ధామము
అసి = అయి ఉన్నావు
విశ్వం = విశ్వము
త్వయా = నీ చేత
తతం = వ్యాప్తమై ఉన్నది

**ఓ అనంతరూపా! నువ్వు ఆది దేవుడవు. పురాణ పురుషుడవు. ఈ సమస్త జగత్తుకు ఉత్తమమైన మూల ధనానివి. తెలుసుకొనే వాడివి నీవే. తెలియబడేది కూడా నీవే. నీవే పరంధామము. ఈ సమస్త జగత్తు నీ తోనే నిండి ఉంది.**

### వ్యాఖ్య

అనంతత్వము కూడా నమస్కార యోగ్యత్వమే. దేవతలకు ముందు వాడు కావడం చేత భగవానుడు ఆదిదేవుడు **(త్వమ్ ఆదిదేవః).** ఆదిదేవుడు కనుక పురాతనుడు. చిరంతనుడు. సనాతనుడు **(పురాతనః చిరంతనః పురాణః).** పురాతనుడైన పురాణుడు ఎక్కడో లేడు. మన దేహం లోనే ఉన్నాడు. పురుష రూపంలో ఉన్నాడు. పురము అంటే శరీరము. పురమున శయనించే వాడు పురుషుడు **(పురుషః పురిశయనాత్).** ఆదిదేవుడుగా పురాణుడైన వాడే శరీరాలలో పురుషుడుగా ఉన్నందున, ఆయన పురాణ పురుషుడు. ఆయనే జ్ఞాననిధి. సర్వ జగత్తుకు ఆయనే నిధానము. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు తానే కనుక, తానే వేత్త, తానే వేద్యం. అట్టి అనంత భగవానుడు లేనిది అణువైనా ఈ ప్రపంచంలో లేదు. జగత్తంతా ఆ దివ్య చైతన్యము తోనే పరివ్యాప్తమై ఉంది.

**వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాఙ్కః ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ ।**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః పునశ్చ భూయోఽపి నమో నమస్తే ॥** 39

*వాయుః-యమః-అగ్నిః-వరుణః-శశాంకః-ప్రజాపతిః-త్వం-ప్రపితామహః-చ*
*నమః-నమః-తే-అస్తు-సహస్రకృత్వః-పునః-చ-భూయః-అపి-నమః-నమః-తే*

| | | | |
|---|---|---|---|
| త్వం | = నీవు | తే | = నీ కొరకు |
| వాయుః | = వాయువు | సహస్రకృత్వః | = వేయిసార్లు |
| యమః | = యముడవు | నమో నమః | = నమస్కారములు |
| అగ్నిః | = అగ్నివి | అస్తు | = అగు గాక! |
| వరుణః | = వరుణుడవు | పునః చ | = మరల |
| శశాంకః | = చంద్రుడవు | భూయః అపి | = మరల కూడా |
| ప్రజాపతిః | = ప్రజాపతివి | తే | = నీ కొరకు |
| ప్రపితామహః చ | = ముత్తాతవు | నమో నమః | = నమస్కారములు |

**భగవంతా! నువ్వే వాయువు. యముడవు నీవే. అగ్నివి నీవే. నువ్వే వరుణుడివి. చంద్రుడివి నీవే. నువ్వే బ్రహ్మదేవుడివి. వాడి అబ్బవు కూడా నువ్వే. నీకు వేలకు వేల నమస్కారాలు. మళ్ళీ నమస్కారాలు. మళ్ళీ మళ్ళీ నమస్కారాలు.**

### వ్యాఖ్య

అంతా భగవంతుడే అని పూర్వ శ్లోకంలో కీర్తించిన పార్థుడు, అందరూ భగవంతుడే అని ప్రస్తుత శ్లోకంలో ప్రస్తుతిస్తున్నాడు. ఈ శ్లోకంలో జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక గమ్మత్తు ఉంది.

అక్షరరూపుడు, నిరాకారుడైన పరబ్రహ్మమును పూర్వ శ్లోకంలో కీర్తించిన అర్జునుడు, సృష్టికర్తగా, సర్వ వ్యాపిగా, సర్వజ్ఞునిగా పరమాత్మను స్తుతించాలని భావించి, **ప్రభవః ప్రళయః స్థానం** అని తొమ్మిదవ అధ్యాయంలో పరమేశ్వరుని ద్వారా ఏ సత్యాన్నైతే శ్రవణం చేశాడో, ఆ సత్యరూపుని ప్రస్తుత శ్లోకంలో కీర్తిస్తున్నాడు.

బ్రహ్మదేవుడవు నీవే అంటూ భగవంతుని సృష్టికర్తగా స్తుతించాడు **(ప్రభవః).** సృష్టి లోని ప్రాణులకు ఆధారము నీవే. వాళ్ళను భరించేది, ధరించేది, పోషించేది కూడా నీవే అని చెబుతూ, అలాంటి కార్యాన్ని





నిర్వహించడానికి అవసరమైన వాటిలో తానే ఉన్నాడంటూ, వాయువు, అగ్ని, వరుణుడు, చంద్రుడు నీవే అని స్తుతిస్తున్నాడు. ఇవన్నీ ఉంటేనే స్థితి **(స్థానం).**

సృష్టి స్థితులలో పరమేశ్వరుని ప్రస్తుతించి, లయ కారకుడు కూడా భగవంతుడే అని చెప్పడానికి, యముడివి నీవే అని కీర్తించాడు **(ప్రలయః).** ఈ విధంగా సృష్టి స్థితి లయాలలో ఉన్నది నీవే అని భావగర్భితంగా స్తుతించాడు.

అది సరే బావుంది. ఆ చెప్పే దేదో సూటిగా చెప్పేస్తే పోతుంది కదా! శాస్త్రంలో ఈ భావగర్భితాలు, భాషా గహనాలు ఎందుకు?

అదే అలంకారము. మనకు ఎంత అర్థమైందో గ్రహించడానికి కొలమానము. అంతే కాదు. భగవంతుడు అందరి వాడు కదా! కర్తలే అంతా దోచేసుకుంటే వ్యాఖ్యాత లెలా బ్రతకాలి? కనుక వ్యాఖ్యాతలపై దృష్టి ఉంచి అలా కొంత దాచిపెడతా రేమో! లేక, అంతా చెప్పేస్తే, దేవదేవునికి దిష్టి తగులుతుందని భావిస్తారేమో! భగవంతుని విషయంలో భక్తులకు పట్టని పిచ్చి అంటూ ఉంటుందా? దిష్టి కార్యం అలాగే వచ్చిందేమో!

**మధుర మంజుల మోహన రూపవంతా!**
**కీర్తించినది నీ అందము చరాచర లోకమంతా!**
**సృష్టి కుండను తిప్పెదను దిష్టి తగలకుండా**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!**

అని ముద్దుగా వెన్నముద్దతో దిష్టి తీసింది చిన్నికృష్ణ శతకము.

**నమః పురస్తా దథ పృష్ఠ తస్తే నమోఽస్తుతే సర్వత ఏవ సర్వ ।**
**అనన్త వీర్యామిత విక్రమ స్త్వం సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః ॥** 40

*నమః-పురస్తాత్-అథ-పృష్ఠతః-తే-నమః-అస్తు-తే-సర్వతః-ఏవ-సర్వ*
*అనంత వీర్య-అమితవిక్రమః-త్వం-సర్వం-సమాప్నోషి-తతః-అసి-సర్వః*

| | | | |
|---|---|---|---|
| సర్వ | = సర్వస్వరూపుడా! | అస్తు | = అగు గాక! |
| పురస్తాత్ | = ముందు | త్వం | = నీవు |
| పృష్ఠతః | = వెనుక | అనంత | = అపరిమితమైన |
| తే | = నీకు | వీర్యామిత విక్రమః | = శక్తి సామర్థ్యములు గల వాడవు |
| నమః | = నమస్కారము | సర్వం | = సర్వమును |
| అథ | = అటుపిమ్మట | సమాప్నోషి | = వ్యాపించి ఉన్నావు |
| సర్వతః ఏవ | = అన్ని వైపులను | తతః | = అందువలన |
| తే | = నీ కొరకు | సర్వః | = సర్వ స్వరూపుడవు |
| నమః | = నమస్కారము | అసి | = అయి ఉన్నావు |

**సర్వ స్వరూపా! భగవంతా! ముందున్న నీకు నమస్కారము. వెనక ఉన్న నీకు నమస్కారము. అంతటా ఉన్న నీకు నమస్కారము. అనంత శక్తి సామర్థ్యాలు గల నీవు సమస్తములో వ్యాపించి ఉన్నావు. అందుకే నీవు సర్వ స్వరూపుడవు.**

### వ్యాఖ్య

భగవంతుడు ముందు ఉన్నాడు. ఉన్నది ఏదైనా సూర్యుని వెలుగు లోనే తెలుస్తుంది. అందుచేత, 'ముందు' అనేది వెలుగు లోనే ఉంది. కనుక ముందు అంటే తూర్పు. ముందు తూర్పు ఉంటే, పశ్చిమము వెనుక ఉంటుంది. మనకు కుడి వైపున దక్షిణము, ఎడమ వైపున ఉత్తరము ఉంటాయి. అన్ని దిక్కులలో ఉన్న సర్వేశ్వరుడే, ఆగ్నేయ, నైరుతి, వాయవ్య, ఈశాన్యాలలో కూడా ఉన్నాడు. అంతరాలలో కూడా అతడే. అన్ని దిక్కులలో, అంతటా తానే ఉండేటప్పుడు, ఒక్క దిక్కుకు నమస్కరిస్తే అన్ని దిక్కులలో వ్యాపించి యున్న సర్వేశ్వరునికి నమస్కరించినట్లే కదా! ఎదురుగా నడచి వచ్చే వాడు, వెనుక ఎగిరే పక్షి, ప్రక్కనే ఈదుతున్న చేప, ఆ ప్రక్కనే గంతు లేసే లేడి - అన్నీ తానే. అన్నిటిలో తానే. సర్వమూ తానే. అందుకే ఆయన సర్వేశ్వరుడు. ఇది అర్థమైతే, అంతటా చిద్విలాసమే. చిదానందమే.

*పల్లవి:* **గాలితో కలసి గువ్వ లాగా గంతు లేయాలని**
**నీటిలో చేరి చేప పిల్లనై ఈదు లాడాలని**
*అనుపల్లవి:* **వెన్నెలతో కూడి తారనై తిరగాలని**
**అంతటా నిన్ను అలా చూస్తూ మూయాలని కనులు** **॥ గాలితో ॥**

అని సర్వేశ్వరునికి నమస్కరిస్తూ అంతటా, అన్ని వైపులా తిరుగుతూ పాడింది చైతన్య గీతిక.

**సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి ।**
**అజానతా మహిమానం త వేదం మయా ప్రమాదా త్ప్రణయేన వాపి ॥** 41

*సఖా-ఇతి-మత్వా-ప్రసభం-యత్-ఉక్తం-హే-కృష్ణ-హే-యాదవ-హే-సఖా-ఇతి*
*అజానతా-మహిమానం-తవ-ఇదం-మయా-ప్రమాదాత్-ప్రణయేన-వా-అపి*

**య చ్చావహాసార్థ మసత్కృతోऽసి విహార శయ్యాసన భోజనేషు ।**
**ఏ కోऽథ వాప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్ ॥** 42

*యత్-చ-అవహాసార్థం-అసత్కృతః-అసి-విహారశయ్యాసన భోజనేషు*
*ఏకః-అథవా-అపి-అచ్యుత-తత్సమక్షం-తత్-క్షామయే-త్వాం-అహం-అప్రమేయం*

తవ = నీ యొక్క
ఇదం = ఈ
మహిమానం = మాహాత్మ్యమును
అజానతా = తెలియక
మయా = నా చేత
ప్రమాదాత్ = ఆకస్మికంగా గాని
ప్రణయేన వా అపి = ప్రేమ చేత గాని
సఖా ఇతి మత్వా = స్నేహితుడవని భావించి
ప్రసభం = నిర్లక్ష్యముగా
హే కృష్ణ = హే కృష్ణా!
హే యాదవ = హే యాదవుడా!

హే సఖా = హే మిత్రుడా!
ఇతి = అని
యత్ = ఏది
ఉక్తం = చెప్ప బడిందో
అచ్యుత = అచ్యుతుడా!
విహారశయ్యాసన భోజనేషు = విహారముల యందు, పడక యందు, కూర్చొనుట యందు, భోజనము లందు
అవహాసార్థం = పరిహాసమునకై
ఏకః = ఒంటరిగా ఉన్నపుడు
అథవా అపి = వెనుకను





తత్సమక్షం = పరుల ముందు గాని
అసత్కృతః అసి = అవమానింప బడితివి
యత్ చ = ఏదో
తత్ = దాని నంతయును

అప్రమేయం = అప్రమేయుడవైన
త్వాం = నిన్ను
అహం = నేను
క్షామయే = క్షమము కోరుతున్నాను

**అనంతా! నీ మహిమ తెలియక పొరపాటున చనువుతో నిన్ను మిత్రమా! కృష్ణా! యాదవా! సఖా! అంటూ పూర్వం పిలిచే వాణ్ణి. ఆహార విహారాలలో, ఆసన శయనాలలో పరిహాసానికి అపహాస్యం చేశానేమో! అప్రమేయా! నన్ను క్షమించ మని వేడుకుంటున్నాను.**

### వ్యాఖ్య

ఆరాధనలు, అర్చనలు ప్రయత్నంతో సాగే చోట, అప్రయత్నంగా, అసంకల్పితంగా కొన్ని అపరాధాలు దొర్లుతాయి. అందుకనే, పూజాదికాలు పూర్తి అయిన తరువాత, అపరాధం ఉంటే క్షమించి, తప్పును అప్పుగా ఉంచి, ముప్పును తప్పించి, ఒప్పుగా స్వీకరించి, పెద్ద మనస్సుతో తృప్తి చెందమని భగవంతుణ్ణి ప్రార్థిస్తుంటాము.

**మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వర!**
**యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తు తే ॥**

'భగవాన్! నేను చేసిన పూజలో మంత్రోచ్చారణా దోషాలు ఉండొచ్చు. చేసిన పద్ధతులలో క్రమం తప్పి ఉండొచ్చు. కొన్ని సమయాలలో చిత్త చాంచల్యం చేత, భక్తి శూన్యంగా, యాంత్రికంగా పూజ కొనసాగి ఉండొచ్చు. అయినా, నా పూజనంతా నువ్వు పూర్ణంగా భావించి స్వీకరించు. నన్ను కృతార్థుణ్ణి చెయ్యి' అని ప్రార్థిస్తాము.

ఇదొక సద్భావన. మనస్సు మెత్త పడటానికి అందమైన భావన. పశ్చాత్తాపంతో కూడిన పవిత్ర భావన. ఈ భావసుమం భక్తి పరిమళాన్ని వెదజల్లి పరమేశ్వరుని తృప్తి పరుస్తుంది.

అర్జునుడు అదే చేస్తున్నాడు. ప్రస్తుతం విశ్వరూప దర్శనం ద్వారా భగవ ద్వైభవాన్ని అర్థం చేసుకున్నాడు. ఈ మహానుభావుని వైభవము పూర్వము తెలియని కారణంగా, తెలిసో, తెలియకో, సమయాల ఒడిలో, సందర్భాల సుడిలో చిక్కుకొని, అజ్ఞానంతో వాసుదేవ భగవానుని అపహాస్యం చేశానేమో నని వ్యథ చెందు తున్నాడు. అలాంటిది జరిగే ఉంటే, అజ్ఞాని ప్రలాపంగా భావించి క్షమించ మని దయామయుడైన భగవంతుని దీనుడై ప్రార్థిస్తున్నాడు.

భగవంతా! నేను జ్ఞానం లేని వాణ్ణి. ఇంత కాలం నీ కూడా ఉన్నానే గాని నీ మహాత్మ్యాన్ని తెలియని వాణ్ణి. తెలిసే ఉంటే, ఓయ్ మిత్రమా! ఓ యాదవా! హే కృష్ణా! అని నిన్ను ఏక వచనంతో సంబోధించి ఉండేవాడినా?

నీతో కలిసి నడచే టప్పుడు **(విహారః, విహరణం పాదవ్యాయామః)**. నీ కన్నా ముందుగా అడుగు లేస్తూ నడిచే వాడినా? నీ మంచము మీద, నీ ప్రక్కనే పలవరిస్తూ పడుకునే వాడినా **(శయనం శయ్యా)**? నీతో సమానంగా కూర్చుని భోం చేసే వాడినా **(ఆసనం ఆస్థాయికా)**? నువ్వు తినక ముందే ఆత్రగాడిలా ఆరగించే వాడినా **(భోజనమ్ అదనమ్)**?

ఇంకా ఏమేమి చేశానో! ఏదేది పలవరించానో! ఏకాంతంలో ఏమి మాట్లాడానో! **(ఏకః)**. పది మంది ముందు ఏమి తప్పుగా పలికానో! **(తత్ సమక్షం)**. మహానుభావా! మహాపచారం చేశా నని లోలోన మగ్గి పోతున్నా! సిగ్గుతో నీ ముందు తల ఎత్తలేక పోతున్నా! శ్రీయుతుడ వైన నిన్ను 'శ్రీ' లోపంతో కృష్ణా! అని పిలిచాను. నీ శ్రీ చరణాలకు మ్రొక్కి మన్నించ మంటున్నా!

భగవంతా! పెద్దలు ప్రేమతో చనువిస్తారు. పిల్లలు అజ్ఞానంతో దానిని పాడు చేసుకుంటారు. నా మాతృదేవి పుణ్యఫలంగా నువ్వు నాకు బావ వయ్యావు. అది ఏనాటి పుణ్యమో! అది తెలియక, బావా! బావా! అంటూ పన్నీరు చిలికి వెకిలి చేష్టలు చేశానేమో! జ్ఞాపకం చేసుకుంటున్నా. ఇప్పుడు కన్నీటితో పాదాలు కడుగుతున్నా.

మహానుభావా! నీ వైభవం అర్థం గాక నిన్ను బావా! బావా! అని పిలిచిన మందభాగ్యుణ్ణి. అభాగ్యుణ్ణి. నా అపరాధాన్ని క్షమించు! నా అజ్ఞానాన్ని మన్నించు! నీతో నా సంబంధం బావమరిది సంబంధం కాదని, భక్తుని సంబంధ మని తెలిసి పోయింది. స్నేహ సంబంధం కాదని, శిష్య సంబంధ మని తేలి పోయింది. అనిత్య సంబంధం కాదని, నిత్య సంబంధ మని అర్థమై పోయింది.

**నవ్వి నవ్వించితివి నాడు నీ మాయ తెలిపి**
**నవ్వు పారేసుకున్నాను నేడు నీ మహిమ తెలిసి**
**నవ్వులాటలు ఇక నేను ఆడలేను**
**నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!** అని చిన్నికృష్ణ శతకంలో మరొక వెన్నముద్ద.

పరమేశ్వరుని సారథిగా పొందగలిగిన పార్థుడు సామాన్యుడా? పశుపతితో పోరాడి పాశుపతాన్ని సాధించుకున్న ధీరుడు. ఊర్వశిని తృణీకరించి ఆమె శాపానికి కూడా జంకని పావనాత్ముడు. అట్టి మహాత్ముడే భగవంతుని విషయంలో పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాడు. ఏ తప్పూ చేయని వాడు, చేశానేమో అనే శంకతో పరితపిస్తున్నాడు.

అర్జునుణ్ణి కాసేపు ప్రక్కన పెట్టి, మన విషయాన్ని మననం చేసుకుంటే, తెలుస్తుంది మన చరిత్ర ఏమిటో! తప్పు చేయని అర్జునుడు, ఒక వైపు తపించి పోతున్నాడు. తప్పుల్నే ప్రధానంగా చేసుకొని జీవించే మనం, పరితాపానికి పూనుకోము, క్షమించ మని వేడుకోము. తెలియక కాలు బురదలో పడవచ్చు. అలాగని శుద్ధి చేసుకోక పోవడం బుద్ధిహీనతే అవుతుంది.

**పితాఽసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్ ।**
**న త్వ త్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో లోకత్రయేఽప్యప్రతిమప్రభావ ॥** 43

*పితా-అసి-లోకస్య-చరాచరస్య-త్వం-అస్య-పూజ్యః-చ-గురుః-గరీయాన్*
*న-త్వత్సమః-అస్తి-అభ్యధికః-కుతః-అన్యః-లోకత్రయే-అపి-అప్రతిమ ప్రభావ*

| | |
|---|---|
| అప్రతిమప్రభావ | = అతిశయ ప్రభావము గల ఓ కృష్ణా! |
| త్వం | = నీవు |
| అస్య | = ఈ |
| చరాచరస్య | = చరాచర స్వరూపమైన |
| లోకస్య | = లోకమునకు |
| పితా అసి | = తండ్రివి |
| పూజ్యః | = పూజ్యుడవు |
| గురుః | = గురువు |
| గరీయాన్ చ | = గొప్పవాడవు |
| అసి | = అయి ఉన్నావు |
| లోకత్రయే అపి | = ముల్లోకముల యందు |
| త్వత్సమః | = నీకు సమానుడు |
| న అస్తి | = లేదు |
| అభ్యధికః | = అధికుడైన |
| అన్యః | = ఇతరుడు |
| కుతః | = ఎక్కడున్నాడు? |

**అసమాన మహనీయా! పరమేశ్వరా! ఈ చరాచర ప్రపంచానికి నీవు తండ్రివి. పూజ్యుడివి. గొప్ప గురుదేవుడవు. ముల్లోకాలలో నీకు సాటి అయిన వాడే లేడు. ఇక, నిన్ను మించిన వాడు ఎక్కడుంటాడు?**





**వ్యాఖ్య**

పరమేశ్వరుని ప్రభావము తెలియని కారణంగా పూర్వం ఆయన పట్ల అపరాధాలు, అపచారాలు చేసి ఉంటానేమో అని శంకించి, పశ్చాత్తాపంతో క్షమాపణలు కోరుతూ కుమిలి పోయిన అర్జునుడు, ప్రస్తుతం గీతా ప్రబోధము యొక్క శ్రవణ ఫలంగా, తనకు అర్థమైన పరమేశ్వరుని అసమాన వైభవాన్ని వర్ణిస్తున్నాడు. జన్మ నిచ్చిన తండ్రి, జన్మను కడతేర్చే గురువు, ఉభయులూ పూజనీయుడైన భగవంతుడే అని అభిభాషిస్తున్నాడు.

**పరమారాధ్యుడు**

జన్మ నిచ్చేవాడు తండ్రి. పుట్టించే వాడు **(పితా జనయితా)**. ఎవరు ఎవరికి జన్మ నిస్తారో వారికే వారు తండ్రి. కాని, సర్వ లోకాలు ఆవిర్భవించడానికి కారణమైన వాడు కనుక భగవంతుడు లోకపిత **(లోకస్య ప్రాణి జాతస్య పితా)**. జన్మ నిచ్చిన తండ్రిని దైవంగా భావించి గౌరవిస్తాము. పూజిస్తాము **(పితృ దేవోభవ)**. కాని, దేవుడే తండ్రి అని, అన్ని జన్మలలో తండ్రిగా ఆయనే పూజ లందుకున్నా డని, అందరికీ, అన్ని లోకాల లోని చరాచరాత్మక మైన ప్రాణిజాతానికి తండ్రి తానే అని అర్థమైన వాడు, ఆయన పూజా స్థానము అసమానంగా శోభిస్తుంది. ఆ గురు స్థానము సాధారణ మైంది కాదు. మహాశ్రేష్ఠమైన గురు స్థానము **(గురుః గరీయాన్)**.

**అసమాన తేజోవంతుడు**

భగవంతునితో సమానమైన వైభవము కలవాడు మరొకడు లేడు కనుక, ఆయనిది శ్రేష్ఠమైన గురు స్థానము. ఆదిగురువు తానే కావడం విశేషము. ఆదిగురువు ఆదిదేవుడే. ప్రపంచానికి ఇద్దరు భగవానులు ఉండలేరు. అలాగే ఇద్దరు గురుదేవులూ ఉండలేరు. రెండవ వస్తువు తెలియని అద్వయ స్థాన మది **(ఏక మేవ అద్వితీయం)**. అలాంటి అద్వయ చైతన్యము రెండవది ఉండే అవకాశం లేనందున, భగవంతునితో సమానమైన తేజోవంతుడు మరొకడు ఉండలేడు. ఆయనది అసమాన తేజము. భగవాన్! నీకు సమానులు లేరు **(త్వత్సమః న అస్తి)**. సమానుడే లేనపుడు నీ కంటే అధిక ప్రభావము కలవాడు ఎలా ఉంటాడు? **(కుతః ఏవ అన్యః అభ్యధికః స్యాత్)**. ఏమో! ఆయనతో సరియైన వాడు, సమమైన వాడు మానవ లోకంలో లేక పోవచ్చు. కాని ఇతర లోకాలలో ఉండవచ్చు కదా! అనే సంశయం కలగ వచ్చు. దానిని కూడా పరిహరిస్తూ, ముల్లోకాలలో భగవంతునిదే అసమాన వైభవము అని కీర్తిస్తున్నాడు **(లోకత్రయేఽపి అప్రతిమ ప్రభావః)**.

**తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్ ॥** 44

*తస్మాత్-ప్రణమ్య-ప్రణిధాయ-కాయం-ప్రసాదయే-త్వాం-అహం-ఈశం-ఈడ్యం*
*పితా-ఇవ-పుత్రస్య-సఖా-ఇవ-సఖ్యుః-ప్రియః-ప్రియాయాః-అర్హసి-దేవ-సోఢుం*

| | |
|---|---|
| తస్మాత్ | = అందువలన |
| ఈశం | = ఈశుడవు |
| ఈడ్యం | = ప్రస్తుతింప దగిన వాడవు |
| త్వాం | = నిన్ను గూర్చి |
| అహం | = నేను |
| కాయం | = శరీరమును |
| ప్రణిధాయ | = వంచి |
| ప్రణమ్య | = ప్రణమిల్లి |
| ప్రసాదయే | = అనుగ్రహింప వేడుకొంటున్నాను |
| దేవ | = కృష్ణా! |
| పుత్రస్య | = పుత్రుని తప్పును |
| పితా ఇవ | = తండ్రి వలె |
| సఖ్యుః | = సఖుని తప్పును |
| సఖా ఇవ | = సఖుని వలె |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్రియాయాః | = | ప్రియురాలి తప్పును | సోఢుం | = | సహించుటకు |
| ప్రియః ఇవ | = | ప్రియుని వలె | అర్హసి | = | తగి ఉన్నావు |

**భగవంతా! అందుచేత, ప్రభువు, పూజ్యుడవు అయిన నీకు శరీరాన్ని వంచి నమస్కరిస్తూ, నీ అనుగ్రహాన్ని అర్థిస్తున్నాను. బిడ్డ తప్పును తండ్రి మన్నించినట్లు, స్నేహితుని అపరాధాన్ని స్నేహితుడు క్షమించినట్లు, ప్రియురాలి తప్పిదాన్ని ప్రియుడు విస్మరించినట్లు, దేవా! నా అపరాధాన్ని క్షమించు.**

### వ్యాఖ్య

లోక బాంధవ్యాలన్నీ అనిత్యాలు. లోక బాంధవుడైన భగవంతునితో ఉన్న సంబంధమే నిత్యము. ఈ బంధము తెగనిది. తరగనిది. భక్తునికి భగవంతునితో గల నిత్య సంబంధాన్ని కీర్తిస్తున్నాడు అర్జునుడు. తెలియని దానిని చెప్పడానికి ఉపకరించేవి, సహకరించేవి తెలిసినవే కనుక, భగవంతునితో భక్తునికి గల నిత్య సంబంధాన్ని వివరించడానికి, ప్రపంచం లోని సంబంధాలలో మూడు బాంధవ్యాలను ఎన్నుకొని, వాటి ద్వారా వివరిస్తున్నాడు. భగవంతుని విషయంలో అర్జునునికి గల అవగాహనకు ఈ పోలికలు అద్దం పడుతున్నాయి.

తన అపరాధాలను మన్నించ మని పూర్వ శ్లోకాలలో ప్రార్థించాడు పార్థుడు. ఎలా క్షమించాలో ఇక్కడ చెబుతున్నాడు. (1) కుమారుని తప్పును తండ్రి ఎలా క్షమిస్తాడో ***(పుత్రస్య అపరాధే పితా యథా క్షమతే)***, (2)మిత్రుని అపరాధాన్ని మిత్రుడు ఎలా క్షమిస్తాడో ***(సఖేవ చ సఖ్యుః అపరాధం)***, (3) ప్రియురాలి తప్పిదాన్ని ప్రియుడు ఎలా క్షమిస్తాడో ***(యథా వా ప్రియః ప్రియాయాః అపరాధం క్షమతే ఏవమ్ అర్హసి)***, ఆ విధంగా పరమేశ్వరుడు తనను క్షమించాలి అని విజయుడు వేడుకొంటున్నాడు.

పుట్టుకకు తండ్రి ఎలా కారణమో, తన జన్మకు కారణమైన సర్వ కారణ స్వరూపమైన పరమేశ్వరునితో తనకు గల సంబంధాన్ని గుర్తించాడు.

స్నేహితులు ఎప్పుడూ కలిసి ఉంటారు. ఎన్నడూ విడిపోరు. స్నేహితుల మధ్య రహస్యాలు ఉండవు. స్నేహితుడు తన స్నేహితుని నుండి ఏదీ దాచలేడు. పరమాత్మ చైతన్య స్వరూపంగా, బుద్ధి సాక్షిగా సదా తన తోనే ఉన్నాడు. తన లోనే ఉన్నాడు. పరమాత్మ తనకు దూరంగా లేడు. కనుక, తన విషయాలన్నీ భగవంతునికి తెలుసు అనే సత్యాన్ని గ్రహించాడని స్నేహితుని ఉపమించడం వల్ల స్పష్ట మవుతోంది.

ఇక ప్రియుడు - ప్రియురాలి సంబంధాన్ని ప్రస్తావించి, పరమేశ్వరుని పొందడంలో ప్రాప్తించే పరమ ప్రేమను, పరమానందాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

అంతేకాదు, తండ్రి కన్నా, స్నేహితుడు ఆంతరంగికంగా సన్నిహితుడై ఉంటాడు. స్నేహితుని కన్నా భార్య, లేక ప్రియురాలు మరీ సన్నిహితంగా ఉంటుంది. పరమేశ్వరునితో తన సంబంధము తరతమంగా ఎలా గోప్యమో, గుహ్యమో తెలుపుతూ, అలాంటి భగవంతుని అనుగ్రహాన్ని అర్థిస్తూ సాష్టాంగ ప్రణామం చేస్తున్నాడు. వంగి మరీ ప్రణామం అంటున్నాడు. అంటే, వినమ్రుడై, అహంకార రహితుడై నమస్కరిస్తున్నాడు ***(ప్రణమ్య నమస్కృత్య)*** అని భావం.

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనో మే ।
తదేవ మే దర్శయ దేవరూపం ప్రసీద దేవేశ జగన్నివాస ॥ 45

*అదృష్టపూర్వం-హృషితః-అస్మి-దృష్ట్వా-భయేన-చ-ప్రవ్యథితం-మనః-మే*
*తత్-ఏవ-మే-దర్శయ-దేవరూపం-ప్రసీద-దేవేశ-జగన్నివాస*





| | | | | | |
|---|---|---|---|---|---|
| అదృష్టపూర్వం | = | పూర్వమెన్నడూ దర్శించని రూపమును | దేవేశ | = | దేవదేవా! |
| దృష్ట్వా | = | చూచి | జగన్నివాస | = | జగదాశ్రయా! |
| హృషితః | = | సంతసించినవాడను | మే | = | నాకు |
| అస్మి | = | అవుతున్నాను | తత్ | = | ఆ పూర్వపు |
| మే | = | నా యొక్క | దేవరూపం ఏవ | = | దివ్యరూపమునే |
| మనః | = | మనస్సు | దర్శయ | = | చూపు |
| భయేన | = | భయము చేత | ప్రసీద | = | కరుణించు! |
| ప్రవ్యథితం చ | = | బాధింప బడుతున్నది | | | |

**జగన్నివాసా! జగన్నాథా! ఎన్నడూ చూడని నీ విశ్వరూపాన్ని చూచి పరవశించి పోయాను. నా మనస్సు భయంతో చలించి పోయింది. దేవా! దేవదేవా! వెనుకటి నీ మామూలు రూపం తోనే నాకు దర్శన మిచ్చి నన్ను అనుగ్రహించు!**

### వ్యాఖ్య

అచ్యుతుని అనుగ్రహమును మాత్రమే అర్థిస్తూ ప్రస్తుతం అర్జునుడు ప్రార్థిస్తున్నాడు ***(ప్రసీద)***. ఎవరి అనుగ్రహాన్ని అర్థిస్తున్నాడో, అతడు దేవదేవుడే అనే స్థిరమైన జ్ఞానంతో ప్రార్థిస్తున్నాడు ***(దేవేశ)***. సృష్టి స్థాయి నుండి దేవేశుడుగా, జగన్నివాసుడుగా తెలుస్తున్న భగవానుడు, అనంత స్వరూపుడు అనే అద్వైత జ్ఞానం కూడా కలిగే ఉన్నాడు. కనుకనే ***ప్రసీద దేవేశ! జగన్నివాస!*** అనే వాక్యాలను ఇరవై అయిదవ శ్లోకం లోనే వినిపించాడు. ఆ తరువాత మళ్ళీ ముప్పై ఏడవ శ్లోకం లోను ప్రయోగించాడు. ఇప్పుడు ప్రస్తుత శ్లోకంలో కూడా, దేవేశుడైన జగన్నాథుని అనుగ్రహాన్నే అర్థిస్తున్నాడు.

ఏ దివ్యమైన విశ్వరూపము ప్రస్తుతము తన కళ్ళ ముందు ప్రదర్శింపబడి ఉందో, దానిని **అదృష్ట పూర్వంగా** అభివర్ణిస్తున్నాడు. 'అదృష్ట పూర్వం' అంటే, ఇంతవరకు ఎవరి చేత కూడా చూడబడనిది అని అర్థం. తానే కాకుండా, ఇతరులు ఎవ్వరు కూడా చూడని రూపం అంటున్నాడు. అందుచేత, ఆ దర్శనం తనకు ఎనలేని తృప్తిని ప్రసాదించింది అంటున్నాడు ***(ఇదం విశ్వరూపం మయా అన్యైర్వా దృష్టపూర్వం న, తదహః దృష్ట్వా హసితః అస్మి)***. అదృష్ట పూర్వము, అనితర సాధ్యము అయిన అసమాన విశ్వరూప మూర్తిని చూడటం చేత తాను ఎంతగానో సంతోషిస్తున్నాడు.

ఒక వైపు సంతోషంగా ఉన్నా, భయంకరంగా గోచరిస్తున్న ఆ ఉగ్ర రూపాన్ని దర్శించడానికి భయపడి, తన పూర్వ రూపాన్నే ప్రదర్శింప మని ప్రార్థిస్తున్నాడు.

కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ ।
తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే ॥ 46

*కిరీటినం-గదినం-చక్రహస్తం-ఇచ్ఛామి-త్వాం-ద్రష్టుం-అహం-తథా-ఏవ*
*తేన-ఏవ-రూపేణ-చతుర్భుజేన-సహస్రబాహో-భవ-విశ్వమూర్తే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| విశ్వమూర్తే | = | విశ్వరూపా! | చక్రహస్తం | = | చక్రహస్తుడవు అగు |
| అహం | = | నేను | త్వాం | = | నిన్ను |
| కిరీటినం | = | కిరీటము గల వాడవు | ద్రష్టుం | = | గాంచుటకు |
| గదినం | = | గద గల వాడవు | ఇచ్ఛామి | = | కోరుకుంటున్నాను |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తథా ఏవ | = | అటులనే | తేన | = | ఆ |
| సహస్రబాహో | = | సహస్ర బాహువులు గల వాడా! | రూపేణ ఏవ | = | రూపము తోనే |
| చతుర్భుజేన | = | నాలుగు భుజములు గల | భవ | = | ఉండు! |

**విశ్వరూపా! పరమాత్మా! గదా కిరీటాలతో చక్రధారిగా శోభించే రూపం తోనే నిన్ను చూడా లనుకుంటున్నా సహస్రబాహో! చతుర్భుజ రూపం తోనే నాకు అగుపించు!**

**వ్యాఖ్య**

సౌజన్య సౌకుమార్యాది సుమనోహర దివ్య మంగళ రూపంతో దర్శన మివ్వమని ప్రార్థిస్తున్నాడు. ఒక శిరస్సు, ఒక కిరీటం, శంఖచక్ర గదా ద్యాయుధాలు కలిగిన సుందరమైన చతుర్భుజ రూపమును దర్శించాలనే తన అభీష్టాన్ని వ్యక్తం చేస్తూ ప్రార్థిస్తున్నాడు.

ప్రస్తుతం కనిపిస్తున్న భయంకర రూపమును ఉపసంహరించి, పూర్వం ప్రకాశించిన ప్రశాంతమైన వాసుదేవ రూపంతో కనిపించ మని ప్రార్థిస్తున్నాడు ***(తేనైవ రూపేణ వసుదేవ పుత్ర రూపేణ).*** ఆ రూపము చతుర్భుజ రూపమని తానే చెబుతున్నాడు ***(చతుర్భుజేన).*** చతుర్భుజ రూపము అనేది విష్ణుమూర్తి రూపము. పూర్వ రూపము చతుర్భుజ రూపము అన్న అర్జునుని భావన అనేక వ్యాఖ్యానాలకు అవకాశ మిచ్చింది.

పూర్వము అర్జునునికి శ్రీకృష్ణుడు చతుర్భుజుడు గానే కనిపించే వాడు, అందుకనే ఆ రూపాన్ని చూడాలని అభిలషించాడు అని కొందరు అభిప్రాయ పడ్డారు. అదే వాస్తవ మైతే, ***కిరీటినం గదినం చక్రిణం చ*** అనే పదిహేడవ శ్లోకంలో తాను ప్రథమంగా ఆ రూపమును చూస్తున్నట్లు అర్జునుడు ఆశ్చర్యాన్ని ఎందుకు వ్యక్తం చేస్తాడు?

ఇలా, ఈ వ్యాఖ్యానముతో విభేదించిన మరి కొందరు, విశ్వరూప ప్రదర్శనములో భగవంతుడు మొదట చతుర్భుజుడుగా దర్శనం అనుగ్రహించి నపుడు, ఆ రూపము అర్జునునికి సౌమ్యంగా, మంజులం గానే గోచరించింది. ఆ తరువాత ఉగ్ర రూపంగా పరిణామం చెందింది. కనుక, ఆ భయంకర రూపాన్ని ఉపసంహరించి, ప్రారంభంలో ఉన్న చతుర్భుజ రూపము తోనే అగుపించమని అర్జునుడు అర్థించాడని మరి కొందరు అభిప్రాయ పడ్డారు.

శ్రీ శంకరులు మాత్రం భాష్యంలో ఇవేవీ ప్రస్తావించ లేదు. 'వసుదేవుని పుత్రుడ వైన చతుర్భుజుడుగా ***(వసుదేవ పుత్ర రూపేణ చతుర్భుజేన)***' అని మాత్రమే వ్యాఖ్యానించారు. కారాగృహంలో శ్రీకృష్ణుడు జన్మించి నపుడు, మొదట చతుర్భుజుడుగా దేవకీ వసుదేవులకు దర్శన మిచ్చాడు. ఆ తరువాత, దేవకీదేవి ప్రార్థించగా, ఆ రూపాన్ని ఉపసంహరించి, రెండు బాహువులతో మానవ బాలుడుగా గోచరించాడు అనేది గమనించ దగిన విషయము.

ఏది ఎలా ఉన్నా, చతుర్భుజ రూప మనేది ఉపాసనకు, ధ్యానానికి ప్రత్యేకంగా చెప్పబడిన రూపము. కనుక, ఉగ్రమైన ఈ భయంకర రూపమును త్యజించి, మంగళకరమైన ధ్యానరూపంతో, దైవదీప్తి కలిగిన మానవ రూపంతో గోచరించ మని అర్జునుడు ప్రార్థించి ఉండవచ్చు. అర్జునుని ప్రార్థనను మన్నించి, భగవంతుడు ఏ రూపంగా కనిపిస్తాడో, అదే అర్జునుని అభీష్టమని మనం నిర్ణయించుకోవచ్చు. ఆ విషయాన్ని మున్ముందు చూస్తాం.

ఈశ్వర విభూతుల్ని ఆలకించిన తరువాత, విభూతి వాసుదేవుని విశ్వమయ రూపాన్ని దర్శించాలని అర్జునుడు అభిలషించ వచ్చు. కాని, ప్రస్తుతం ఆ మహా రూపంతో పాటు, భగవంతుని స్వరూపాన్ని కూడా





అర్థం చేసుకోవడం చేత, కనిపించే రూపాలన్నీ ఈశ్వర మాయే నని, వాంఛింప దగినది ఈశ్వర మహిమయే నని విజయుడు భావించే అవకాశము లేక పోలేదు. కనుక పరమేశ్వరుని ఉపాసించి, ధ్యానించి, జ్ఞానం ద్వారా, నది సముద్రాన్ని చేరి శాంతించినట్లు, అర్జునుడు వాసుదేవ చైతన్య సాగరమును చేరాలని ఉబలాట పడుతూ, ధ్యానయోగ్యమైన శాంతరూపమును వీక్షించాలని అభిప్రాయపడి ఉండవచ్చు.

పల్లవి: **నిను మరచి నేను మనజాలరా! తాళ జాలరా!**
**మాయలు చాలురా! మహిమను చూపరా** ॥ నిను ॥

చరణము: **నేనే యమునై కదలి రానా!**
**చరణ కదలికి చేరిపోనా - నీ**
**చరణ కదలికి చేరిపోనా!** ॥ నిను ॥

అని చైతన్య గీతిక.

అర్జునుని ప్రార్థనను శ్రీకృష్ణుడు విన్నాడు. విన్నపాన్ని మన్నించాడు. విశ్వరూపాన్ని ఉపసంహరించాడు. అర్జునునితో ప్రియంగా భాషించాడు.

**శ్రీ భగవానువాచ :**

మయా ప్రసన్నేన త వార్జు నేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వ మనన్త మాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్ ॥ 47

**మయా-ప్రసన్నేన-తవ-అర్జున-ఇదం-రూపం-పరం-దర్శితం-ఆత్మయోగాత్**
**తేజోమయం-విశ్వం-అనంతం-ఆద్యం-యత్-మే-త్వదన్యేన-న-దృష్టపూర్వం**

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర్జున | = | అర్జునా! | న దృష్టపూర్వం | = | ఇంతవరకు చూడబడనిది |
| మే | = | నా యొక్క | పరం | = | పరమైనది |
| యత్ | = | ఏ | ఇదం | = | ఈ |
| తేజోమయం | = | తేజోమయము | రూపం | = | రూపమును |
| విశ్వం | = | విశ్వము | తవ | = | నీకు |
| అనంతం | = | అనంత మైనది | ప్రసన్నేన | = | ప్రసన్నుడ వైన |
| ఆద్యం | = | ఆది యైనది | మయా | = | నా చేత |
| త్వత్ | = | నీ కంటెను | ఆత్మయోగాత్ | = | ఆత్మయోగము వలన |
| అన్యేన | = | ఇతరుల చేత | దర్శితం | = | చూపబడినది |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! నిన్ను అనుగ్రహించాలని నా యోగ శక్తి చేత నీకు ప్రసన్నుణ్ణి అయ్యాను. నా విశ్వరూపము తేజోమయం, సర్వాత్మకం, అనంతం, ఆద్యం. గతంలో ఎవ్వరూ చూడని ఉత్కృష్టమైన ఈ రూపాన్ని నువ్వు చూశావు.**

**వ్యాఖ్య**

తన విశ్వరూపాన్ని దర్శించి భీతి చెందిన అర్జునుని, అనునయ వాక్యాలతో భగవంతుడు ఊరడిస్తున్నాడు. పరమేశ్వరుని భగవంతుని విశ్వరూపము తేజోమయం. దివ్య తేజోమయం **(తేజః ప్రాయం).**

దివ్యానుగ్రహమే ఆ తేజోమయ రూపము. సూర్య భగవానుడు తన తేజమును కిరణాల ద్వారా ప్రసరింప చేసినట్లు, పరమేశ్వరుడు తన అనుగ్రహాన్ని ఆ తేజోమయ రూపం ద్వారా ప్రదర్శిస్తున్నాడు.

అది సామాన్య తేజము కాదు. అస్తమయ మెరుగని ప్రకాశము. అనంతమైన తేజము ***(అనన్తమ్ అంత రహితమ్).*** అన్ని రూపాలు పరమాత్మవే అయినా విశ్వరూపము ప్రథమము, ప్రధానము. అంటే మొదట పుట్టిన రూపము. అందుకే అది ఆద్యము ***(ఆదౌ భవమ్ ఆద్యమ్).*** ముందు విశ్వము ఆవిర్భవిస్తే, ఆ తరువాత విశ్వంలో అనేక రూపాలు ఆవిర్భవించాయి. అన్ని రూపాలు విశ్వం లోనే ఉండటం చేత, అది సమస్త రూపము ***(విశ్వం సమస్తమ్).***

ఇటువంటి అద్భుత రూపము అర్జునుడు తప్ప మరెవ్వరూ గతంలో చూడలేదు అంటున్నాడు. కాని, శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని అర్జునుని కన్నా ముందుగా చాలా మందికి చూపించినట్లు భారత, భాగవత గ్రంథాలు చెబుతాయి.

పుట్టగానే తల్లిదండ్రులైన దేవకీ వసుదేవులకు చతుర్భుజుడుగా దర్శన మిచ్చాడు. గోకులంలో మన్ను తిన్నాడని విని, యశోద నోరు తెరువమని అడిగి నపుడు, తన నోటిలో విశ్వాన్నంతా చూపాడు. కురుసభలో ధృతరాష్ట్ర భీష్మాదులకు విశ్వరూపాన్ని ప్రదర్శించి చూపాడు. యమునా జలాలలో అక్రూరునికి కూడా చతుర్భుజునిగా దివ్య దర్శన మిచ్చాడు. కాని, ప్రస్తుతం అర్జునుడు తప్ప గతంలో ఈ రూపాన్ని ఎవ్వరూ చూడలేదు అంటున్నాడు.

అవును. అవన్నీ వాస్తవాలే. కాకపోతే, అవన్నీ అవాంతర రూపాలు. అర్జునుడు దర్శించిన శ్రేష్ఠమైన రూపం వంటివి మాత్రం కావు అని గీతా తాత్పర్య బోధినీ సంస్కృత వ్యాఖ్యానములో ఉంది. ఈ విధమైన, అరుదైన విశ్వరూప సందర్శనము భగవ దనుగ్రహం చేత భక్తుడైన అర్జునునికి ప్రాప్తించింది. అట్టి దివ్య రూపాన్ని చూచి భయపడ నవసరం లేదని భగవంతుడు అర్జునుని ఊరడిస్తున్నాడు.

**న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై ర్న చ క్రియాభి ర్న తపోభిరుగ్రైః ।**
**ఏవం రూపః శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర ॥** 48

*న-వేదయజ్ఞాధ్యయనైః-న-దానైః-న-చ-క్రియాభిః-న-తపోభిః-ఉగ్రైః*
*ఏవం-రూపః-శక్య-అహం-నృలోకే-ద్రష్టుం-త్వదన్యేన-కురుప్రవీర*

| | | | |
|---|---|---|---|
| కురుప్రవీర | = అర్జునా! | న | = కాను |
| ఏవం రూపః | = ఇటువంటి రూపము | క్రియాభిః చ | = కర్మల చేత |
| అహం | = నేను | న | = కాను |
| నృలోకే | = మనుష్య లోకము నందు | ఉగ్రైః | = తీవ్రమైన |
| త్వదన్యేన | = నీవు గాక ఇతరుని చేత | తపోభిః | = తపస్సుల చేత |
| వేదయజ్ఞాధ్యయనైః | = వేదాధ్యయనము చేతను, యజ్ఞముల చేత | ద్రష్టుం | = చూచుటకు |
| దానైః | = దానముల చేత | న శక్యః | = సాధ్యమైన వాడను గాను |

**కురువీరా! అర్జునా! మానవ లోకంలో వేదాలను, యజ్ఞ విద్యలను అధ్యయనం చేసిన వారు గాని, దానాలు ఆచరించిన వారు గాని, క్రియా తపస్సులు అనుష్ఠించిన వారు గాని ఈ విశ్వరూపాన్ని దర్శించ లేరు. అలాంటి దివ్య రూపాన్ని నువ్వు దర్శించావు.**





**వ్యాఖ్య**

అన్య లెవ్వరూ దర్శించని, దర్శించలేని తన దివ్య రూపాన్ని కేవలం భగవంతుని అనుగ్రహం చేత దర్శించిన అర్జునుడు కృతార్థు డయ్యాడని భగవానుని అభిప్రాయము ***(అత్మనః మమ రూప దర్శనేన కృతార్థః ఏవ త్వం).*** అందుచేత అన్యులకు దర్శింప సాధ్యం కానిది, కేవలం తన ఆత్మయోగ, అనుగ్రహాల చేతనే దర్శింప దగినది అయిన ఆ అలౌకిక అద్భుత రూపాన్ని భగవానుడు స్తుతిస్తున్నాడు ***(తత్ స్తౌతి).***

వేదాధ్యయనాల చేత విశ్వరూపం దర్శింప బడదు ***(న వేదాధ్యయనైః).*** వేదాధ్యయనం వల్ల అధ్యయనం జరుగుతుందే గాని అర్థ బోధకత్వం జరగదు. అలాగే యజ్ఞాధ్యయనాలు కూడా ***(యజ్ఞాధ్యయనైః).*** యజ్ఞకర్మల నాచరించే అధ్యయనాలను చేసి ఉపయోగం లేదు. మీమాంస, కల్ప, సూత్రాదులను కూడా అధ్యయనం చేసి విచారించాలి.

అలాగే గోదాన, భూదాన, కన్యాదాన, తులా పురుషాది దానాల చేత కూడా విశ్వరూప సందర్శనము జరగదు. అగ్నిహోత్రాది శ్రౌత క్రియలు, చంద్రయానాది తపస్సులను ఆచరించే వారి చేత కూడా పొందబడదు ***(న శక్యః).***

అలాగని, ఈ సాధన లన్నీ నిరుపయోగ మని భావించ కూడదు. ఇవన్నీ అవశ్యం ఆచరింప దగినవే. కాకపోతే, ఈ సాధనలు అంతఃకరణ శుద్ధిని మాత్రమే ప్రసాదిస్తాయి. విశ్వరూప దర్శనం కేవలం భగవ దనుగ్రహం తోనే ప్రాప్తిస్తుంది. భగవ దనుగ్రహం అశుద్ధ చిత్తులకు అందుతుందా? అందుచేత, ఈ సాధన లన్నీ ఆచరించాలి. కాని, భగవ దనుగ్రహానికి ముఖ్య కారణమైన భక్తి చేతనే సందర్శనము సంప్రాప్త మౌతుంది అనేది మరువ కూడదు. అట్టి అనుగ్రహాన్ని పొందడం చేత, గతంలో ఎవ్వరూ దర్శించని రూపాన్ని అర్జునుడు దర్శించి కృతార్థు డయ్యాడు.

**మా తే వ్యథా మా చ విమూఢభావో దృష్ట్వా రూపం ఘోర మీదృ ఙ్మమేదమ్ ।** 49
**వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం తదేవ మే రూప మిదం ప్రపశ్య ॥**

*మా-తే-వ్యథా-మా-చ-విమూఢభావః-దృష్ట్వా-రూపం-ఘోరం-ఈదృక్-మమ-ఇదం*
*వ్యపేతభీః-ప్రీతమనాః-పునః-త్వం-తత్-ఏవ-మే-రూపం-ఇదం-ప్రపశ్య*

| | | | |
|---|---|---|---|
| ఈదృక్ | = ఇట్టి | మా | = వలదు |
| ఘోరం | = భయంకరమైన | త్వం | = నీవు |
| మమ | = నా యొక్క | వ్యపేతభీః | = భయము పోయిన వాడవు |
| ఇదం | = ఈ | ప్రీత మనాః | = తృప్తి చెందిన వాడవై |
| రూపం | = రూపమును | మే | = నా యొక్క |
| దృష్ట్వా | = చూచి | తదేవ | = ఆ పూర్వపు |
| తే | = నీకు | ఇదం | = ఈ |
| వ్యథా | = భయము | రూపం | = రూపమును |
| మా | = వలదు | పునః | = మరల |
| విమూఢభావః చ | = చిత్త సంక్షోభమూ | ప్రపశ్య | = దర్శించు |

**అర్జునా! భీకరమైన నా విశ్వరూపాన్ని చూచి భయపడ నవసరం లేదు. కలత చెంద నవసరం లేదు. నిర్భయంగా ఉండు. ప్రసన్నంగా ఉండు. నువ్వు కోరినట్లు నా పూర్వ రూపాన్నే దర్శించు.**

### వ్యాఖ్య

అర్జునా! భయపడకు. మానవ లోకములో ఇంతవరకు ఎవ్వరూ దర్శించని రూపాన్ని చూచే శక్తిని నీకు అనుగ్రహించాను అంటే, నీ మీద నా కెంత ప్రేమో నేను ప్రత్యేకించి చెప్పాల్సిన అవసర ముందా? అలాంటి నన్ను చూచి నువ్వు భయపడట మేమిటి? భయాన్ని విడిచేయ్ ***(మా తే వ్యథా, మా భూత్ తే భయమ్)!*** సంతోషంగా ఉండు ***(ప్రీత మనాః).*** నిర్భయంగా ఉండు ***(వ్యపేత భీః విగత భయః).*** అర్జునా! నీకు ఇష్టమైన రూపాన్ని చూడు అన్నాడు భగవంతుడు.

ఇంతకీ అర్జునునికి ఏది ఇష్టమైన రూపము? చతుర్భుజ రూపము. పార్థా! శంఖచక్ర గదాధర రూపంతో శోభించే నీ ఇష్ట రూపాన్ని దర్శించు ***(చతుర్భుజం శంఖచక్ర గదాధరం తవ ఇష్టం రూపం ఇదం ప్రపశ్య).*** శంఖచక్ర గదాది ఆయుధాలతో ప్రకాశించే పరమాత్మ రూపం అర్జునునికి ఇష్టరూపం. అంటే, ఇష్టదేవతా రూపం. చతుర్భుజుడైన నారాయణమూర్తి అర్జునునికి ఇష్టదేవత. చతుర్భుజ రూపం ఆయన ఇష్టదేవతా రూపం. శ్రీకృష్ణుని విశ్వరూపమును దర్శించిన తరువాత ఆయన సాక్షాత్తు తన నారాయణమూర్తియే అనే జ్ఞానం అర్జునునిలో ధృవ పడింది. స్థిర పడింది. కనుక, తన ధ్యానమూర్తి చతుర్భుజుడైన శ్రీమహావిష్ణువు యొక్క రూపమును దర్శించాలనే అభీష్టంతో అర్జునుడు చతుర్భుజ రూపమును అనుగ్రహించ మని నలభై ఆరవ శ్లోకంలో ప్రార్థించడము లోని అంతర్భావ మేమిటో ప్రస్తుత శ్లోకంలో సుస్పష్ట మైంది. అక్కడ మనం లేవనెత్తిన సంశయం ఇక్కడ నివృత్తి అయింది.

**సంజయ ఉవాచ :**

ఇ త్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః ।
ఆశ్వాసయామాస చ భీత మేనం భూత్వా పునః సౌమ్యవపు ర్మహాత్మా ॥ 50

*ఇతి-అర్జునం-వాసుదేవః-తథా-ఉక్త్వా-స్వకం-రూపం-దర్శయామాస-భూయః*
*ఆశ్వాసయామాస-చ-భీతం-ఏనం-భూత్వా-పునః-సౌమ్యవపుః-మహాత్మా*

| | | |
|---|---|---|
| మహాత్మా | = | మహాత్ముడైన |
| వాసుదేవః | = | శ్రీకృష్ణుడు |
| ఇతి | = | ఈ విధంగా |
| అర్జునం | = | అర్జునుని గురించి |
| ఉక్త్వా | = | పలికి |
| తథా | = | అలాగే |
| స్వకం | = | తనదైన |
| రూపం | = | రూపమును |
| భూయః | = | మరల |
| దర్శయామాస | = | దర్శింప చేశాడు |
| పునః | = | మరల |
| సౌమ్యవపుః | = | సౌమ్య స్వరూపుడు |
| భూత్వా | = | అయి |
| భీతం | = | భయ పడిన |
| ఏనం | = | అర్జునుని |
| ఆశ్వాసయామాస చ | = | ఓదార్చాడు |

**సంజయుడు వినిపిస్తున్నాడు :**

**ధృతరాష్ట్ర మహారాజా! ఈ విధంగా వాసుదేవుడు అర్జునునితో పలికి, అర్జునుడు కోరినట్లు తన పూర్వ రూపాన్ని దర్శింప చేశాడు. మహాత్ముడైన శ్రీకృష్ణుడు మళ్ళీ తన సౌమ్య రూపమును చూపి, భయభ్రాంతులకు గురైన అర్జునుని ఓదార్చాడు.**





### వ్యాఖ్య

**ఆద్యరూపం - సుదర్శనం**

భయంకరమైన విశ్వరూపాన్ని పరమేశ్వరుడు ఉపసంహరించాడు. దివ్యమైన పూర్వ మంగళ రూపంతో సాక్షాత్కరించాడు. దానిని **స్వకం రూపం** అని వర్ణించాడు సంజయుడు. **స్వకం రూపం** అంటే తనదైన రూపం. తన సంబంధమైన రూపం అని అర్థము. అదే పూర్వ రూపం. పూర్వం, అంటే శ్రీకృష్ణావతారంలో ప్రథమంగా అగుపించిన రూపం. అంటే, వసుదేవుని గృహంలో (కారాగారంలో) జన్మించి నపుడు గోచరించిన రూపం ***(స్వకం వాసుదేవ గృహే జాతం రూపం).***

దేవకీ వసుదేవులకు శ్రీకృష్ణుడు అవతరించ గానే, చతుర్భుజుడుగా అగుపించాడని మీకు ముందే నేను తెలియ చేశాను. ఆ చతుర్భుజ మూర్తినే దర్శించాలని అర్జునుడు అభిలషించాడు. ఆ మూర్తినే దర్శింప చేస్తూ శ్రీకృష్ణ పరమాత్మ తన విశ్వరూపాన్ని ఉపసంహరించాడు. ఈ సందర్భంలో శ్రీకృష్ణుని వాసుదేవుడుగా సంజయుడు అభివర్ణించడం విశేషము.

శంఖచక్ర గదాది ఆయుధాలతో, మకర కుండలాలతో ప్రకాశిస్తూ, శ్రీవత్స, కౌస్తుభ వనమాలా పీతాంబరాలతో శోభిస్తూ పరమ దయామయుడైన శ్రీకృష్ణదేవుడు, తిరిగి సౌమ్య రూపమును ధరించాడు.

ఇది శ్రీకృష్ణదేవుడు భక్తుడైన అర్జునుని కరుణించి అనుగ్రహించిన ఇష్టదేవతా రూప దర్శనము. చతుర్భుజుడైన నారాయణమూర్తి దర్శనము. ఆ తరువాత ఆ రూపాన్ని కూడా తిరోహితం చేసి, కమలదళ లోచనుడై, నీలమేఘశ్యాముడుగా అగుపించి, విశ్వరూప దర్శనంలో దిక్కులు తెలియక భయభ్రాంతులకు లోనైన అర్జునుని ఊరడించాడు. అర్జునుని హృదయం ఆనంద సాగర మైంది. మరల **(భూయః)** తిరిగి **(పునః)** అంటూ, మళ్ళీ మళ్ళీ అని రెండుసార్లు పలకడంలో విశ్వరూప ఉపసంహారం క్రమంగా జరిగిం దనేది స్పష్టంగా ధ్వనిస్తోంది.

**అర్జున ఉవాచ :**

దృ ష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీ మస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥ 51

*దృష్ట్వా-ఇదం-మానుషం-రూపం-తవ-సౌమ్యం-జనార్దన*
*ఇదానీం-అస్మి-సంవృత్తః-సచేతాః-ప్రకృతిం-గతః*

| | | |
|---|---|---|
| జనార్దన | = | కృష్ణా! |
| తవ | = | నీ యొక్క |
| ఇదం | = | ఈ |
| మానుషం | = | మనుజ సహజమైన |
| సౌమ్యం | = | ప్రసన్నమైన |
| రూపం | = | రూపమును |
| దృష్ట్వా | = | దర్శించి |
| ఇదానీం | = | ఇప్పుడు |
| సచేతాః | = | ప్రసన్న చిత్తము గలవాడను |
| ప్రకృతిం | = | స్వభావమును |
| గతః | = | పొందిన వాడను |
| సంవృత్తః అస్మి | = | అయితిని |

**అర్జునుని విన్నపము :**

**జనార్దనా! కృష్ణా! మానవాకారంలో ఉన్న సౌమ్యమైన నీ రూపాన్ని చూచి, ఇప్పుడు నేను శాంతిని పొందాను. స్థిమిత పడ్డాను. నా చిత్తం ప్రసన్నంగా ఉంది.**

## వ్యాఖ్య

విశ్వరూప సందర్శనము ప్రారంభమైన క్షణం నుండి ఏదో అసాధారణ పరిస్థితిలో, అనూహ్యమైన వాతావరణంలో ఉండిన వన్నీ ఒక్కసారిగా ఉపశమించి, సామాన్య స్థితికి చేరుకున్నాయి. ఏమిటవి? ఒక్కటైతే కదా! వాటిని మూడు కోణాల్లో దర్శించాలి.

మొదటిది శ్రీకృష్ణుడు. అంతవరకు సౌజన్యం ఉట్టి పడుతూ సౌమ్యమూర్తిగా మనోహర రూపంతో బోధిస్తున్న వాడు, అంత మెక్కడో తెలియని ఉగ్ర రూపాన్ని ధరించి భయంకరుడై కలవర పెట్టాడు. ప్రస్తుతం ఆ రూపాన్ని ఉపసంహరించి, తిరిగి సౌమ్యంగా, సామాన్యంగా దర్శన మిస్తూ స్వస్థతను కలిగించాడు.

రెండవది అర్జునుడు. భీకరమైన శ్రీకృష్ణదేవుని ఉగ్రరూపాన్ని చూచి భయకంపితు డైన అర్జునుడు, తిరిగి పరమేశ్వరుని మానవ రూపునిగా, మంజుల మూర్తిగా దర్శించి, వాసుదేవుని అనునయ వాక్యాల చేత ఊరడించబడి, తిరిగి స్వస్థతను పొంది సామాన్య స్థితికి చేరుకున్నాడు.

మూడవది గీతా శాస్త్రము. ప్రారంభం నుండి అనుష్టుప్ ఛందస్సులో అలవోకగా, అవలీలగా సాగుతూ వచ్చిన శ్లోకాలు, విశ్వరూపం ఆరంభం కాగానే, అనుష్టుప్ ఛందస్సును ఆవల ఉంచి, త్రిష్టుప్ ఛందస్సులో మ్రింగుడు పడని పదాలతో కదం త్రొక్కి, ఇప్పుడు ***(ఇదానీం)*** విశ్వరూపమును ఉపసంహరించ గానే, తాను కూడా తిరిగి సజావుగా అనుష్టుప్ ఛందస్సును అందుకొని మామూలు స్థితికి చేరింది.

*అంతటా స్వస్థత నెలకొనింది. శాంతి పరిఢవిల్లింది. విశ్వరూప దర్శన ప్రాప్తిని గూర్చి భగవంతుడే స్వయంగా చెబుతున్నాడు.*

**శ్రీ భగవానువాచ :**

సుదుర్దర్శ మిదం రూపం దృష్ట వానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః ॥ 52

***సుదుర్దర్శం-ఇదం-రూపం-దృష్టవాన్-అసి-యత్-మమ***
***దేవాః-అపి-అస్య-రూపస్య-నిత్యం-దర్శన కాంక్షిణః***

| | | |
|---|---|---|
| మమ | = | నా యొక్క |
| యత్ | = | ఏదయితే |
| ఇదం | = | ఈ |
| సుదుర్దర్శం | = | చూడ దుర్లభమైన |
| రూపం | = | రూపమును |
| దృష్టవాన్ | = | చూచిన వాడవు |
| అసి | = | అయితివో |
| దేవా అపి | = | దేవతలును |
| నిత్యం | = | ఎల్లప్పుడు |
| అస్య | = | ఈ |
| రూపస్య | = | రూపము యొక్క |
| దర్శనకాంక్షిణః | = | దర్శనమును కోరు వారు |

**శ్రీ భగవానుడు చెబుతున్నాడు :**

**అర్జునా! సులభసాధ్యం గాని నా దివ్య రూపాన్ని నువ్వు దర్శించావు. ఈ దర్శనం కోసం దేవతలు కూడా నిత్యము పరితపిస్తూ ఉంటారు.**

## వ్యాఖ్య

చిత్త స్వాస్థ్యమును పొంది, ప్రసన్న హృదయుడైన అర్జునుని తృప్తి పరచే వాక్యాలను నాలుగు శ్లోకాలలో వివరించి అధ్యాయాన్ని సమాప్తం చేస్తున్నాడు భగవంతుడు.





అర్జునా! చూడశక్యం గాని నా రూపాన్ని నువ్వు దర్శించావు. సుదుర్దశము, సుదుర్లభమైన అద్భుత రూపాన్ని నీవు అవలోకించావు. సులభసాధ్యం కాని కార్యాన్ని సాధించడం నీకే సాధ్యమైంది. ఇదంతా నీ పుణ్యం. నీ భాగ్యం. నీ అదృష్టం. నీ సుకృతం అని భగవంతుడు అర్జునుని ఆశీర్వదిస్తున్నాడు.

దుర్దర్శ మంటే కష్టం మీద చూడ శక్యము అని అర్థము. సుదుర్దర్శము అంటే అతి కష్టం మీద చూడ శక్యము అని అర్థము **(సుష్ఠు దుఃఖేన దర్శనమ్ ఇతి సుదుర్దర్శమ్).** అట్టి రూపాన్ని అర్జునుడు దర్శించాడు **(దృష్టవాన్ అసి).** దేవతలు అందుకోలేని భాగ్యాన్ని అందుకున్నాడు.

ఎత్తైన లోకాలలో, అతిలోక శక్తులతో తేజరిల్లే దేవతలు ఆశించి కూడా అందుకోలేని అదృష్టాన్ని భగవదనుగ్రహంతో, మానవ లోకం నుండే నరుడు ఏకబిగిన ఎగిరి అందుకున్నాడు. సుర జన్మ కన్నా నరజన్మే శ్రేష్ఠమని నిరూపించాడు. సుదుర్లభమైన దానిని సులభతరం చేసేది భక్తి ఒక్కటే నని ఋజువు చేశాడు.

మొగ్గ పువ్వైనట్లు, వత్తి జ్యోతి రూపమై వెల్గొందినట్లు, రాయి విగ్రహ మైనట్లు, జలం తీర్థంగా మారినట్లు, భగవదనుగ్రహంతో భక్తి దివ్యమై అలరారుతుంది. భక్తుడు భవ్యమై శోభిస్తాడు.

పల్లవి: **రాధను - నీ రాధను !**
**ఆరాధన చేసే రాధను !**
**నీ రాధను - నిరపరాధను !**

చరణము:**(1) నీ పద కమలాల అలరారుటకు**
**ఎదురు చూచిన మొగ్గను - నేడు**
**యెద విరబూసిన పువ్వును** **॥ రాధను ॥**
**(2) నీ గుడి ముంగిట వెలుగు చిమ్ముటకు**
**వేచి యుండిన వత్తిని - నేడు**
**కాంతి నింపే జ్యోతిని** **॥ రాధను ॥**

అని భక్తి ఫలాలను ప్రసాదంగా ఆరగిస్తూ సంతృప్తిని త్రేపుతూ పలికింది చైతన్య గీతిక.

నాహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా ॥ 53

***న-అహం-వేదైః-న-తపసా-న-దానేన-న-చ-ఇజ్యయా***
***శక్యః-ఏవం విధః-ద్రష్టుం-దృష్టవాన్-అసి-మాం-యథా***

| | | |
|---|---|---|
| మాం | = | నన్ను |
| యథా | = | ఏ విధముగా |
| దృష్టవాన్ | = | చూచిన వాడవు |
| అసి | = | అయితివో |
| ఏవం విధః | = | ఇట్టి స్వరూపము గల |
| అహం | = | నేను |
| వేదైః | = | వేదముల చేత |
| తపసా | = | తపస్సు చేత |
| ద్రష్టుం | = | దర్శించుటకు |
| న శక్యః | = | శక్యుడను గాను |
| దానేన | = | దానము చేత |
| ఇజ్యయా చ | = | యజ్ఞము చేత |
| న | = | కాను |

**అర్జునా! నువ్వు దర్శించిన నా రూపాన్ని, అదే విధంగా దర్శించడం వేదాల చేత గాని, తపస్సు చేత గాని, దానము చేత గాని, యజ్ఞము చేత గాని సాధ్య పడదు.**

### వ్యాఖ్య

అభ్యసించే విద్యలలో వేదాధ్యయనం శ్రేష్ఠ మైనది. శ్రమ పడే కార్యాలలో తపస్సు శ్రేష్ఠ మైనది. త్యాగం విషయంలో దానం శ్రేష్ఠ మైనది. కర్మలలో యజ్ఞము పవిత్ర మైనది. అయినా, భగవ దనుగ్రహంతో అర్జునుడు దర్శించిన దివ్యరూపము, వేదాధ్యయనాది కార్యాల వల్ల ప్రాప్తించేది కాదు అని భగవంతుడే స్వయంగా చెబుతున్నాడు.

ఈ శ్లోకం పునరుక్తి శ్లోకము. ఈ అధ్యాయం లోనే నలభై ఎనిమిదవ శ్లోకంలో చెప్పబడిన విషయము, తిరిగి అదే విషయాన్ని ఇక్కడ మళ్ళీ చెప్పడం జరుగుతూ ఉంది. దీనిని పునరుక్తి దోషంగా పరిగణించ కూడదు. కేవలం ఐదు శ్లోకాల వ్యవధిలో పునరుక్తి జరిగింది అంటే, దాని విశేష మెలాంటిదో జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

ఈ అధ్యాయాంతంలో మిగిలి యున్న రెండు శ్లోకాలు తదుపరి దర్శన మిచ్చే ధర్మామృత మైన భక్తి సాధానికి, భక్తి యోగ హర్మ్యానికి దివ్యమైన పునాదులు. పునాదిని పటిష్ఠం చేసే కార్యక్రమంలో భాగం గానే ప్రస్తుతం పునరుక్తి పావనోక్తిగా గోచరిస్తూ ఉంది.

ఎవరి ప్రభావమును ***అచింత్యం - అనిర్దేశ్యం*** అని వేదాలు ప్రవచించాయో, అట్టి వేద స్వరూపుని ఏ అధ్యయనాలతో అందుకోగలం? సృష్టిని తపోకార్యంగా నిర్వహించి విశ్వాన్ని సృష్టించిన విశ్వమూర్తిని ఏ తపస్సుతో పొందగలం? ప్రాణదాతను ఏ దానంతో లోబరచుకో గలం? సృష్ట్యాది లోనే సర్వ యజ్ఞాలను ఆవిష్కరించిన యజ్ఞ పురుషుని ఏ యజ్ఞం ద్వారా వశపరచుకో గలం? వేద తపో దాన యజ్ఞాల చేత లభ్యం కానివాడు భక్తికి లభ్య మవుతాడు. ఇదే శ్లోక సారాంశం. ముమ్ముందు దివ్యంగా సాగే అంశం.

***మ॥ ఉపవాస వ్రత శౌచ శీల మఖ సంధ్యోపాస నాగ్నిక్రియా***
***జప ధ్యానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర, ద***
***చ్చపు భక్తిన్ హరిం బుండరీక నయనున్ సర్వాతి శాయిన్ రమా***
***ధిపుం బాపఘ్నుం బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్ ॥***

'ఉపవాసాలు, వ్రతాలు, శౌచాలు, శీలాలు, యజ్ఞాలు (మఖ), సంధ్యా వందనాలు, అగ్ని కార్యాలు, జపాలు, ధ్యానాలు, వేదాధ్యయనాలు మొదలైనవి ఎన్ని ఆచరించినా, పుండరీకాక్షుడు, సర్వాతిశయుడు, రమానాథుడు, పాపహరుడు, పరమేశ్వరుడు, అచ్యుతుడు అయిన శ్రీహరిని నిర్మలమైన భక్తితో కొలవని వారికి ముక్తి లభించదు' అని సాక్షాత్తు బ్రహ్మదేవుడు తన మానస పుత్రుడైన నారద మహర్షికి శ్రీమదాంధ్ర మహాభాగవతము - ద్వితీయ స్కంధములో బోధిస్తాడు.

*మరి, వేదాధ్యయన తపో దాన యజ్ఞాల చేత భగవంతుడు లభ్యం కానపుడు, ఎలా శక్య మవుతాడు?* **(కథం పునః శక్యః ఇతి?).** *అదే చెబుతున్నాడు* **(ఉచ్యతే).**

**భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధో౽ర్జున ।** 54
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ॥**

***భక్త్యా-తు-అనన్యయా-శక్యః-అహం-ఏవం విధః-అర్జున***
***జ్ఞాతుం-ద్రష్టుం-చ-తత్త్వేన-ప్రవేష్టుం-చ-పరంతప***

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరంతప | = అర్జునా! | అనన్యయా | = అనన్యమైన | జ్ఞాతుం | = తెలిసి కొనుటకు |
| ఏవం విధః | = ఇట్టి విశ్వరూపుడ నైన | భక్త్యా తు | = భక్తి చేతనే | ద్రష్టుం చ | = చూచుటకు |
| అహం | = నేను | తత్త్వేన | = యథార్థముగా | ప్రవేష్టుం చ | = ప్రవేశించుటకు |
| | | | | శక్యః | = శక్యుడను |
| | | | | అర్జున | = అర్జునా! |





**అర్జునా! విశ్వరూపుడ నైన నన్ను యథాతథంగా తెలుసుకోవాలన్నా, దర్శించాలన్నా, లేదా నాలో ప్రవేశించాలన్నా, అనన్య భక్తి చేతనే అది సాధ్యం.**

### వ్యాఖ్య

వేదాధ్యయన, యజ్ఞ దాన తపస్సుల చేత లభ్యం కాని విశ్వమూర్తి కేవలం భక్తి చేత పొంద బడతాడు. వస్తువు ప్రత్యక్షంగా ఉన్నా, దానిని చూడటం అంధునికి ఎలా సాధ్యపడదో, అలాగే భక్తి లేని వానికి పరమాత్మ దర్శనము శక్యం కాదు. భక్తి పరమాత్మను పొందే విధంగా సాధకుని సిద్ధం చేస్తుంది.

అర్జునా! సమస్త భూతములు ఎవరిలో ఉన్నవో, సమస్తమైన జగత్తు ఎవరి చేత పరివ్యాప్తమై ఉందో, అట్టి పురుషోత్తముడైన పరమేశ్వరుడు అనన్యమైన భక్తి చేతనే లభ్య మవుతాడు అని భగవంతుడు అక్షర పరబ్రహ్మ యోగములో చెప్పి ఉన్నాడు (***భక్త్యా లభ్యస్తు అనన్యయా***, 8 వ అ - 22 వ శ్లో ).

**అనన్య భక్తి**

అన్యము కానిది అనన్యము. మరొకటి లేనిది, వేరొకటి కానిది, అన్యమైనది తెలియనిది అనన్యము ***(అనన్యయా అపృథగ్భూతయా)***. భగవంతుని కంటే అన్యమైన దాని యందు, భిన్నమైన దాని యందు ఉండని, ఉండలేని భక్తి ఏదో అదే అనన్య భక్తి ***(భగవతః అన్యత్ర పృథక్ న కదాచిదపి యా భవతి సా తు అనన్యాభక్తిః)***.

భక్తునికి భగవంతుని మీద భక్తి లేకుండా ఎలా ఉంటుంది? భగవంతుని యందు భక్తి కల వాడే కదా భక్తుడు! నిజమే. భక్తుడిలో భగవద్భక్తి ఉండొచ్చు. కాని, ఆ భక్తి దేని కొరకు? అనే ప్రశ్న పడినపుడు, ఆ ప్రశ్నకు వచ్చే సమాధానాన్ని బట్టి అది సాధారణమైన భక్తో లేక అనన్యభక్తో నిర్ధారింప బడుతుంది.

భగవద్భక్తి ఉండినా, అది అర్థకామాల కొరకు అయినపుడు, పుణ్యలోక ప్రాప్తి కొరకై నపుడు, అట్టి భక్తి అన్యభక్తి అవుతుందే గాని, అనన్య భక్తి కాలేదు. కేవలం భగవంతుని కొరకే సాగే భక్తి అనన్యభక్తి. పరమేశ్వరుడు తప్ప అన్య విషయముల యందు స్పృహ లేని భక్తి అనన్య భక్తి. అట్టి అనన్య భక్తి లేకుండా భగవంతుని పొందడము సాధ్యపడదు. అందుచేతనే ***భక్త్యా తు అనన్యయా శక్యః*** - అనన్య భక్తి చేతనే భగవంతుడు లభ్య మవుతాడు అంటున్నాడు. ఇక్కడ **తు** శబ్దము అనన్య భక్తి వినా మరో సాధనము చేత పొందబడడు అని చెప్పడానికి ప్రయోక్త మైంది.

శ్రీ శంకరాచార్యస్వామి భాష్యంలో ఈ విషయాన్ని మరీ సుస్పష్టం చేశారు. అనన్య భక్తిని అసమానంగా, అద్భుతంగా, అందంగా ఆవిష్కరించారు. వాసుదేవుని కంటే వేరైనది ఏదీ సర్వేంద్రియాల చేత తెలియబడదో అదే అనన్య భక్తి అని అనితర సాధ్యంగా వ్యాఖ్యానించారు ***(సర్వైః అపి కరణైః వాసుదేవాత్ అన్యత్ న ఉపలభ్యతే యయా సా అనన్య భక్తిః)***. అట్టి భక్తి చేతనే భగవంతుడు లభ్య మౌతాడు ***(తయా భక్త్యా శక్యః)***.

మనకున్న ఇంద్రియాలు ఆయా ఇంద్రియ విషయాల యందు అభిరుచిని, ఆసక్తిని, అనురక్తిని కలిగి ఉంటాయి. చెవులకు కొన్ని శబ్దాలు ప్రియం. నాలుకకు కొన్ని పదార్థాలే మధురం. నేత్రాలకు కొన్ని రూపాలు ఇష్టం. ఇలా ఇంద్రియాలు ఇంద్రియ విషయాలలో తృప్తి చెందుతూ ఉంటాయి.

అనన్య భక్తి కలిగింది అంటే, ఈ విధమైన ప్రత్యేకతలు, ప్రాధాన్యతలు సమూలంగా అంతరిస్తాయి. అన్ని ఇంద్రియాలు ఒకే వస్తువులో, ఒకే విషయంతో తృప్తి చెందుతాయి. అట్టి తృప్తిని ప్రసాదించేదే అనన్య

భక్తి. ఏ ఇంద్రియము కూడా భగవంతుని కన్నా భిన్నమైన విషయాల యందు తృప్తి చెందని పరిస్థితి ప్రాప్తించింది అంటే, అనన్య భక్తి సిద్ధించిందని నిర్ధారణ చేసుకోవచ్చు. అనన్య భక్తి సిద్ధించింది అంటే, భగవంతుడు ప్రాప్తించాడు అని అర్థము.

శా॥ *నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్*
*నీ పేరం బనిసేయు హస్త యుగముల్ నీ మూర్తిపైఁ జూపులున్*
*నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై జిత్తముల్*
*నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరజ పత్రేక్షణా !*

'కమలదళ లోచనా! కృష్ణా! నిరంతరము నీకు సంబంధించిన విషయాలనే శ్రవణం చేసే చెవులు, నిన్ను గురించే భాషించు వాక్కులు, ఏది చేసినా నీ కార్యాన్నే కొనసాగించు చేతులు, నిన్నే వీక్షించు దృష్టి, నీ చరణములపై వాలే శిరస్సు, సదా నీ సేవా భాగ్యానికే నోచుకునే చిత్తము, నీ మీదే ఉండే మనస్సు - వీటినే దయతో మాకు ప్రసాదించు' అని బాలకృష్ణుని చరణ కమల స్పర్శతో శాపవిముక్తు లైన నలకూబర మణిగ్రీవు లనే కుబేరుని ఇరువురు కుమారులు భాగవతము - దశమ స్కంధములో ప్రార్థించారు. ఆ సందర్భమున బాలకృష్ణుడు భాషించిన భవ్యమైన వాక్కులు ప్రాతః స్మరణీయాలు.

క॥ *తమ తమ ధర్మము దప్పక, సములైనను నమ్మి తిరుగు సభ్యులకును బం*
*ధము నన్నుఁ జూడ విరియును, గమలాప్తుడు వొడమ విరియు ఘనతమము క్రియన్ ॥*

'ఎవరైతే (ధర్మరూపంలో ఉన్న దైవాన్ని స్మరిస్తూ) తమ తమ ధర్మాలను నిష్ఠతో ఆచరిస్తూ, సర్వత్ర సమభావంతో చరిస్తూ, నన్నే పరమగతిగా భావించి సంచరిస్తుంటారో అట్టి సద్భక్తులకు, సూర్యోదయంతో దట్టమైన చీకట్లు చెదరినట్లు, బంధాలు విడి పోతాయి. నా దర్శనంతో మోక్షం ప్రాప్తిస్తుంది' అన్నాడు మోక్షప్రదాత బాలముకుందుడు.

అర్జునా! ఈ విధమైన అనన్య భక్తి చేత నా తత్త్వాన్ని యథాతథంగా భక్తులు తెలుసుకుంటారు ***(జ్ఞాతుం తత్త్వేన).*** కేవలం తెలుసుకోవడమే కాదు. ప్రత్యక్షంగా సాక్షాత్కారాన్ని పొందుతారు ***(ద్రష్టుం చ సాక్షాత్కర్తుం తత్త్వతః).*** ఆ తరువాత నా లోనే ప్రవేశించి మోక్షరూపు లవుతారు ***(తత్త్వేన ప్రవేష్టుం చ మోక్షం చ గన్తుం).***

విశ్వమూర్తి అయిన పరమేశ్వరుడు సర్వవ్యాపి. సర్వగతుడు. అలాంటి వానిని పొందడము అంటే, శాస్త్రం ద్వారా, ప్రమాణం ద్వారా అర్థం చేసుకోవడమే ***(జ్ఞాతుం శాస్త్రతః).*** సర్వగతుడు, అనంతుడైన భగవంతుని కన్నా తాను అన్యంగా ఎలా ఉండ గలడు? ఏ కెరటము కడలికి దూర మవుతుంది? ఈ సత్యాన్ని దర్శించడమే సాక్షాత్కారము. కేవలం శాస్త్రము చేత పరోక్షంగా తెలుసుకోవడమే గాక, ప్రత్యక్షంగా అనుభూతిని పొందడము దర్శనము ***(న కేవలం జ్ఞాతుం శాస్త్రతః ద్రష్టుం చ సాక్షాత్కర్తుం తత్త్వతః).*** ఆ స్థితిలో అభేదమే, అద్వైతమే అనుభూతి ప్రకాశ మైనందున ప్రవేశము; ముక్తి సౌధం లోకి ప్రవేశము. అదే మోక్షప్రాప్తి. అభేద జ్ఞానప్రాప్తి. అద్వైత దర్శనానుభూతి. అపరోక్షానుభూతి ***(తత్త్వేన ప్రవేష్టుం చ మోక్షం చ గన్తుం).***

ఇక్కడ ప్రవేశించడము అంటే, ఎలుక కన్నము లోకి, సింహము గుహ లోకి, పక్షి గూటి లోకి, మనిషి ఇంటి లోకి ప్రవేశించినట్లు కాదు. అల సముద్రంలో ప్రవేశించినట్లు, సర్పము రజ్జువులో విలీన మైనట్లు, నగ బంగారును చేరినట్లు అని అర్థము. ఇదే అద్వయ స్వరూపమైన మోక్షము. సర్వోపద్రవ రహిత స్థితి. అభయ స్థితి.

ఇప్పుడు ఆలోచించండి. అర్జునుడు దర్శించిన విశ్వరూప సందర్శనము మోక్షమేనా? మోక్షమే అయితే





భయం ఎలా ఏర్పడింది? మనస్సు ఎందుకు విచలిత మైంది? సౌమ్య రూపాన్ని చూపమని అర్థించడం దేనికి?

విశ్వరూప సందర్శనమే మోక్ష మయ్యేట ట్లయితే, గీత ఇక్కడే సమాప్తం కావాలి. మరో ఏడు అధ్యాయాలు కొనసాగ వలసిన అవసరం లేదు. ఈ సందర్భములో తాత్త్వికంగా సుదీర్ఘమైన చర్చను కొనసాగించే అవకాశం లేనందున, ముక్తసరిగా విన్నవించు కుంటున్నాను.

కర్మ అయినా, ఉపాసన అయినా మోక్షాన్ని ప్రసాదించ లేవు. కర్మాచరణంలో ఉన్న మనస్సే ఉపాసనలో కూడా ఉంది. రెండు చోట్ల **అహం** భావన చెదరకుండా ఉంది. 'అహం' భావన 'అహం' స్వరూపంగా అర్థమైతేనే మోక్షము. 'అహం' భావన ఉన్నంత వరకు భేదం ఉన్నట్లే. ద్వైతం ఉన్నట్లే. సంసార మున్నట్లే. కనుకనే, ఉపాసనా సంబంధిత కర్మ ఫలాలన్నీ సంసారం క్రిందికే వస్తాయి అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీశంకరాచార్య స్వామి ***(సర్వమపి ఏతత్ ఉపాసనా కర్మఫలం సంసార ఏవ! - 1 - 4 - 1).***

విశ్వరూప సందర్శనంలో అర్జునుని భయానికి కారణం ద్వైత దర్శనమే. సర్వమూ సర్వేశ్వరుడే, విశ్వమంతా విశ్వమూర్తే అనే భావనతో వీక్షించ గలిగాడు గాని, విశ్వరూపమును దర్శించే తాను, విశ్వరూపము కన్నా వేరుగా ఉన్నాను అనే భావన మాత్రం పోలేదు. అంతా అనంతుడైన పరమేశ్వరుడే అయినపుడు, అర్జునుడు ఆ అనంత స్వరూపంలో ప్రత్యేకంగా ఎలా ఉంటాడు? ఉన్నాను అనే భావన ఉండటమే భయ కారణము. ఎప్పుడైనా, ఎక్కడైనా ద్వైతమే భయ కారణము. అద్వైతమే అభయ స్వరూపము.

అనన్య భక్తి ద్వారానే అద్వయ రూపుడైన భగవంతుడు అర్థ మవుతాడు ***(జ్ఞాతుం).*** సాక్షాత్కరింప బడుతాడు ***(ద్రష్టుం).*** మోక్షైక స్వరూపుడై శోభిస్తాడు. అక్కడ ద్వైతం అనూహ్యం కనుక, ***(అత్ర ద్వైతం న విద్యతే),*** మోక్షం ప్రాప్తిస్తుంది. ప్రాప్తించి ఉన్నదే ప్రాప్తిస్తుంది.

అనన్య భక్తి ప్రాప్తించనంత వరకు ద్వైతమే రాజ్య మేలుతుంది. అంతా అయోమయమే. గందరగోళమే. ఒకవేళ ఈశ్వరుడు సాక్షాత్కరించినా కూడా ఈసడింపులే ఉంటాయి. ఈతి బాధలే మిగుల్తాయి.

నా మటుకు నాకు ఈశ్వరానుగ్రహం వల్ల భస్మభూషితాంగుడు అర్థ మవుతాడు కాని, ఎంత తల బాదుకున్నా, భస్మాసురుడు మాత్రం అర్థం కాడు. అతడు శివ దర్శనానికి తపస్సు చేయడ మేమిటి? అతడు కోరిన వర మేమిటి? తీరా వరాన్ని అనుగ్రహించిన తరువాత, ప్రయోగించడానికి శివుడే దొరికాడా? లోకంలో ఎన్ని తలలు లేవు! శివుని తల మీదకే శివ మెత్తాలా?

ద్వైతంలో ఏదైనా జరగవచ్చు. ఆశ్చర్యమే లేదు. శివుణ్ణి భయపెడుతూ భస్మాసురుడు వెంట బడ్డాడు. తానే భయపడి అర్జునుడు కూలద్దాడు. అంతే తేడా. అంతా ద్వైత నాటకమే.

గీత మోక్షశాస్త్రము. అద్వైతమే తాత్పర్యము. అద్వైత జ్ఞానమే గీతా సర్వస్వము. ఈ విషయాన్నే ధృవ పరుస్తూ, అనన్య భక్తి అద్వైతానుభూతికి ఎలా మార్గమో తెలియ పరచి ఏకాదశాధ్యాయాన్ని అద్భుతంగా సమాప్తి చేస్తున్నాడు గీతాచార్యుడు.

*అధ్యాయ సారాన్ని సుస్పష్టం చేయడమే గాక, ఇంతవరకు బోధించిన గీతా ప్రబోధాన్ని సారభూతంగా సమన్వయం చేస్తూ, సమస్త గీతా శాస్త్ర సారమైన మోక్షమే ప్రయోజనంగా శోభిస్తున్న విషయాన్ని కూడా సంక్షిప్తంగా అందిస్తూ, మత్కర్మకృత్ అనే శ్లోకంతో అధ్యాయాన్ని సమాప్తం చేస్తున్నాడు భగవంతుడు.*

**మత్కర్మకృ న్మత్పరమో మద్భక్తః సఙ్గవర్జితః ।** 55
**నిర్వైరః సర్వభూతేషు యః స మామేతి పాణ్డవ ॥**

**మత్కర్మకృత్-మత్పరమః-మద్భక్తః-సంగవర్జితః**
**నిర్వైరః-సర్వభూతేషు-యః-సః-మాం-ఏతి-పాండవ**

| | | | | | |
|---|---|---|---|---|---|
| పాండవ | = | అర్జునా! | నిర్వైరః | = | వైరము లేని వాడు |
| మత్కర్మకృత్ | = | నా కొరకు కర్మలు చేయు వాడు | యః | = | ఎవడో |
| మత్పరమః | = | నా యందే ఆసక్తి గల వాడు | సః | = | వాడు |
| మద్భక్తః | = | నా యందే భక్తి గల వాడు | మాం | = | నన్ను |
| సంగవర్జితః | = | సంగమును విడిచిన వాడు | ఏతి | = | పొందుతున్నాడు |
| సర్వభూతేషు | = | సమస్త భూతము లందును | | | |

**పాండుతనయా! అర్జునా! నా కొరకే కర్మ లాచరించే వాడు, నన్నే పరమగతిగా భావించి జీవించే వాడు, నా భక్తుడుగా బ్రతికేవాడు, విషయ సంగత్వం లేనివాడు, సర్వ ప్రాణుల యందు శత్రుత్వము లేనివాడు నన్నే పొందుతాడు.**

**వ్యాఖ్య**

***సర్వ శాస్త్ర మయీ గీతా*** - భగవద్గీత సర్వ శాస్త్ర స్వరూపిణి అని సమస్త శాస్త్రార్థముల నెరిగిన వ్యాస భగవానుడు నిర్ణయించి చెప్పాడు.

ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్న ఏకాదశాధ్యాయము లోని ఈ చరమ శ్లోకము - ***సర్వస్య గీతా శాస్త్రస్య సారభూతః అర్థః*** - సర్వ గీతా శాస్త్రానికి సారభూతమైన విషయము అని భాష్యకారులైన శ్రీ శంకర భగవత్పాదులు అభిప్రాయ పడ్డారు. కేవలం మోక్షమే ప్రయోజనంగా గలది ***(నిశ్శ్రేయసార్థః)*** అని కూడా అభిభాషించారు. కనుక, **మత్కర్మకృత్** అనే ఈ శ్లోకము సర్వ వేదాంత సిద్ధాంత సార సంగ్రహ కాంతి పుంజము.

సర్వ శాస్త్రముల సారము భగవద్గీత అయితే, భగవద్గీతా సారము ఈ **మత్కర్మకృత్** శ్లోకము. ఇంతవరకు మనం అధ్యయనం చేసిన పదకొండు అధ్యాయాల లోని విషయాన్నంతా సింహావలోకన న్యాయంగా ఈ శ్లోకము సంక్షిప్తం చేసి చూపెడుతుంది ***(సముచ్చిత్య ఉచ్యతే).*** అలాగే ఇక మనం అధ్యయనం చేయబోయే ఏడు అధ్యాయాలకు కూడా ఆముఖాన్ని ఆవిష్కరిస్తూ అద్దం పడుతుంది. గీతోపదేశ సారమైన ఈ శ్లోకము సర్వోత్కృష్ట మైనది.

భగవంతుడు మోక్ష స్వరూపుడు. భగవంతుని పొందడమే జీవు లందరి పరమ లక్ష్యము. మరి, భగవంతుని ఎవరు పొందుతారు? ఈ శ్లోకములో తెలిపిన ఐదు సాధనలను ఎవరైతే ఆచరిస్తారో, ఆచరిస్తూ భగవంతుని ఎవరైతే భజిస్తారో, వారు అంతఃకరణ శుద్ధిని, జ్ఞానమును, ఆ తరువాత మోక్షమును కూడా పొంది తరిస్తారు ***(యః సః మామ్ ఏతి).*** ఆ అయిదు సాధన లేమిటో విశ్లేషించుకుందాం.

**(1) మత్కర్మకృత్**

ఏ వ్యక్తి కూడా ఈ ప్రపంచానికి ఒంటరిగా రాలేదు. ప్రారబ్ధాన్ని వెంటబెట్టుకొనే వచ్చాడు. ప్రారబ్ధానికి వశుడై ప్రపంచంలో ప్రవర్తించే వ్యక్తి ప్రారబ్ధము యొక్క ప్రేరణతో కొన్ని కర్మలను అవశ్యం చేస్తూ ఉంటాడు. వాటితో పాటు అవసర నిమిత్తం నిత్యము పురుషార్థంతో మరి కొన్ని కర్మలు చేస్తూ ఉంటాడు. ఇలా కర్మ చేసేవాడు **కర్మకృత్.** కర్మకృత్ భగవంతుని కొరకు కర్మ నాచరిస్తే **మత్కర్మకృత్** అవుతాడు. నా కొరకు, అంటే భగవంతుడి కొరకు చేసే కర్మ మత్కర్మ. మత్కర్మ చేసేవాడు **మత్కర్మకృత్ (మదర్థం కర్మ మత్కర్మ, తత్ కరోతి ఇతి మత్కర్మకృత్).**





మనిషి తన కొరకు, తన వాళ్ళ కొరకు చేసే కర్మలు చాలా ఉన్నాయి. పిల్లలకు సంబంధించిన కర్మలు, భార్యకు సంబంధించిన కర్మలు, మిత్రుడికి సంబంధించిన కర్మలు, యజమానికి సంబంధించిన కర్మలు, అలాగే వ్యక్తిగతంగా తనకు సంబంధించిన కర్మలు - ఇలా చాలా ఉన్నాయి. వాటిని చేసుకుంటూ, బ్రతుకు యాత్రను సాగిస్తూ ఉంటాడు. కాని, ఇక్కడ భగవంతుని కొరకు చేసేదే **మత్కర్మ** అంటున్నాం. ఏది భగవంతునికి సంబంధించిన కర్మ? నేను చేసే కర్మతో భగవంతుని ఇష్టము, లేక అవసరము ముడిపడి ఉందా? ఏ కర్మ భగవంతునికి ప్రియం? ఏ కర్మ భగవంతునికి అవసరము?

ప్రియాలు, అవసరాలు ఉండేవాడు భగవంతుడు కాలేడు. మన కర్మతో గాని, మన కర్మఫలంతో గాని భగవంతునికి సంబంధం లేదు. కాని, భగవంతుని పొందడానికి, అవగా మోక్షార్థం మనం చేసే కర్మే 'మత్కర్మ'.

పూజ, జప, ధ్యాన, సంకీర్తనాదులు లౌకిక కర్మలు కావు. లౌకిక ఫలాలను ఆశించి ఆచరించేవీ కావు. అవి అలౌకిక కర్మలు. చిత్తశుద్ధి నిమిత్తం ఆచరింప బడేవి. అవన్నీ భగవత్సంబంధ మైనవే. ఉపాసన లన్నీ త్రివర్గములను సాధించుటకు కాకుండా, అంతఃకరణ శుద్ధి కొరకు ఆచరిస్తే అవి భగవ త్సంబంధమైన కర్మ లవుతాయి.

**మత్కర్మకృత్** ఆచరించే కర్మలలో స్వార్థం ఉండదు. రాగద్వేషాలు ఉండవు. రాగద్వేషాల స్థానంలో ధర్మాధర్మాలు చేరిపోతాయి. ధర్మ రూపంలో ఉన్నది దైవమే అని భావించి, అర్థకామాల యందు స్పృహ లేకుండా ధర్మాచరణమును సాగించే వాడు **మత్కర్మకృత్.** ఈ ధర్మాచరణము కూడా పుణ్యఫల దృష్టి లేకుండా, పరలోక భోగాల యందు ఇచ్ఛ లేకుండా దైవారాధన గానే కొనసాగిస్తాడు.

ప్రపంచంలో దేనికి సంబంధించిన కర్మను ఆచరిస్తే దానికి సంబంధించిన ఫలమునే పొందుతాము అనేది అందరి అనుభవంలో ఉన్నదే. అలాగే 'మదర్థం' కర్మను ఆచరించే కర్మయోగి **(మత్కర్మకృత్)** భగవంతుణ్ణే పొందుతాడు. కర్మల ద్వారా అంతఃకరణ శుద్ధిని, అంతఃకరణ శుద్ధి ద్వారా జ్ఞానమును, జ్ఞానము ద్వారా మోక్షాన్ని, మోక్ష రూపుడైన పరమేశ్వరుని పొందుతాడు **(యః ఈదృశః మత్కర్మకృత్ సః మామ్ ఏతి).**

**(2) మత్పరమః**

నా కొరకే ***(మదర్థం)*** కర్మ లాచరించే **మత్కర్మకృత్** నన్నే పరమగతిగా సంభావించి ఆశ్రయిస్తాడు. అందుచేత అతడు మత్పరముడు. అంటే నన్నే పరమగతిగా పొందిన వాడు ***(మత్కర్మకృత్ మామేవ పరమాం గతిం ప్రతిపద్యతే ఇతి మత్పరమః).***

భృత్యుడు స్వామి యొక్క కర్మలు చేస్తాడు **(కరోతి భృత్యః స్వామి కర్మ).** అలాగే కర్మయోగి ఈశ్వరుని భృత్యుని వలె **(ఈశ్వర భృత్యవత్)** కర్మలను ఆచరిస్తాడు. భృత్యుడు యజమాని కర్మలను సంపాదన నిమిత్తం ఆచరిస్తాడే గాని, యజమానిని ఆశించి చేయడు. యజమానిని పొందాలని చేయడు. కాని, ఈశ్వర భృత్యుడైన కర్మయోగి దేనినీ ఆశించడు ఈశ్వరుణ్ణి తప్ప. అతడు ఈశ్వరుణ్ణే ఆశిస్తాడు. ఈశ్వరుని పొందాలనే భావిస్తాడు. అందుచేత కర్మఫలాల యందు స్వామి భృత్యుడు చలిస్తాడే గాని ఈశ్వర భృత్యుడు చలించడు. తనకు పరమేశ్వరుడే ఉత్కృష్టమైన, పరమమైన ఫలము.

మత్పరముడు పరమేశ్వరునే ఆశ్రయంగా పొందిన వాడు. ఆశ్రయ స్థానము, ఆసక్తి స్థానము రెండూ అతనికి భగవంతుడే. ఆధార స్థానము, ఆరాధనీయము కూడా భగవంతుడే. అనుగ్రహించే వాడు, ఆదుకొనే వాడు, అండ నిలిచే వాడు, బ్రతుకును పండించే వాడు భగవంతుడే. అతడే మత్పరముడు.

*అందరి గమ్యము ఒకటే అయినా*
*మార్గము లన్నీ ఒకటౌనా?*
*చూపు లందరివి ఒకటైనా*
*చూచే తీరు వేరు కదా!*
*జ్ఞానము కలిగి చరించే వారికి*
*సర్వము ఈశ్వర మయము కదా!*
*రామ రామ జయ రాజారామ్*
*రామ రామ జయ సీతారామ్*

అని రామజోగి చిట్కా.

ఈ విధంగా మత్పరముడు నన్నే పొందుతాడు అంటున్నాడు భగవంతుడు ***(యః ఈదృశీ మత్పరమః సః మామేతి).***

### (3) మద్భక్తః

భగవంతునితో తనకు గల నిత్య సంబంధమును గుర్తించి జీవించు వాడు భక్తుడు. అన్ని విధాల ***(సర్వ ప్రకారైః),*** పూర్ణ హృదయంతో ***(సర్వాత్మనా),*** ఉత్సాహపూరిత మైన నిండు మనస్సుతో ***(సర్వోత్సాహేన)*** భగవంతుని సేవించే వాడు మద్భక్తుడు. మత్కర్మకృత్తు, మత్పరుడు అయిన వాడు తప్పక మద్భక్తుడు కావలసిందే. భక్తుడు ఎవడో కాడు. కర్మయోగియే భక్తుడు. భక్తుడే కర్మయోగి. అలాంటప్పుడు భక్తుడు అని ప్రత్యేకించి చెప్పడ మెందుకు? అనే సందేహము రావచ్చు.

భక్తి అనేది ప్రేమ స్వరూపము. ప్రేమలో ఉత్సాహం ఉంటుంది. అనురాగం ఉంటుంది. నిరంతరాపేక్ష ఉంటుంది. ఇదంతా ప్రవాహ రూపంలో ఉంటుంది. ఇలాంటి భక్తి హృదయం ఉన్నప్పుడే కర్మయోగ మైనా, జ్ఞానయోగ మైనా శోభిస్తుంది. భక్తి లేకుండా ఏ యోగమూ సిద్ధించదు. మోక్షము ప్రాప్తించదు ***(భక్తిః వినా మోక్షో న సిద్ధ్యతి).***

భక్తి అనేది ప్రేమ స్వరూపమే కనుక ***(ప్రేమ రూపా),*** భక్తులు అనేక విధాలుగా ఉంటారు. కొందరు ధన భక్తులు. అంటే, ధనంపై ప్రేమ ఉండేవారు. కొందరు పదవీ భక్తులు. కొందరు భార్యా భక్తులు. కొందరు కీర్తి భక్తులు. ఈ విధమైన భక్తి రూపాలు ఏవీ తమను ఉద్ధరించవు అని తెలిసి, పరమేశ్వరుని యందే పరిపూర్ణమైన భక్తిని ఉంచిన వారు మద్భక్తులు ***(సా తు అస్మిన్ పరమ ప్రేమరూపా).*** మనలో భక్తి ఉంటే చాలు. మనం మద్భక్తులం కాగలిగితే చాలు. ఆ తరువాత అర్జునుని వెంట అచ్యుతు డున్నట్లు, మన వెంటే ఉంటాడు మాధవుడు.

*ఏ పువ్వులో తేనె ఉన్నదో*
*తెలియనిదా మధుపము!*
*ఎవరి కుండలో వెన్న ఉన్నదో*
*తెలియని వాడా కృష్ణయ్య!*
*మనసు వెన్నగా మారిన నాడు*
*మన వెంటే మాధవుడు*
*రామ రామ జయ రాజారామ్*
*రామ రామ జయ సీతారామ్* అని రామజోగి చిట్కా.





భక్తునికి కూడా సంసారం ఉంటుంది కదా! దారాసుతులు, బంధుమిత్రాదులు ఉంటారు కదా! వారిని కూడా ప్రేమించాలి కదా! అలాంటప్పుడు మద్భక్తుడు సర్వాత్మనా భగవంతుణ్ణే ఎలా ప్రేమించ గలడు? ఎలా భక్తి చేయగలడు? చేయగలడు. ఎలా? అతడు సంగవర్జితుడు కనుక.

### (4) సంగవర్జితః

సంగము అంటే స్నేహము, లేదా ప్రీతి. సంగవర్జితుడు అంటే ప్రీతి లేని వాడు ***(సంగః ప్రీతిః తద్వర్జితః సంగవర్జితః).*** మత్కర్మకృత్తు, మత్పరముడు, మద్భక్తుడు సంగవర్జితుడు. అంటే ప్రీతి లేనివాడు. ఏ విషయము నందు ప్రీతి లేని వాడు? భగవంతుని కన్నా అన్యమైన సంబంధాల యందు ప్రీతి లేనివాడు. ధనము, బిడ్డలు, మిత్రులు, భార్య, బంధువర్గముల యందు ప్రీతి లేనివాడు. ఆసక్తి లేనివాడు. అతడే సంగవర్జితుడు ***(ధన పుత్ర మిత్ర కలత్ర బంధువర్గేషు సంగవర్జితః).***

పుత్ర మిత్ర కళత్రాదులు రాగహేతువులే అయినా, ఆ సంబంధాలన్నీ అనిత్యాలే అనే 'అసద్బుద్ధి' ఉండటం చేత, అవి రాగాన్ని భక్తునిలో దించలేక పోతాయి. స్వప్నము లోని సంసారం లాగా, తన బుద్ధిలో సంసారము నిస్సారమై పోతుంది. అందుచేత, పరమేశ్వరుని యందే ఆసక్తిని కలిగి, పరమోత్సాహంతో ప్రేమ స్వరూపమైన భక్తిని మద్భక్తుడు కొనసాగిస్తాడు.

బృందావన గోపాలునికి గోవు లంటే ప్రాణం. చేతిలో వేణువు ఉండాలి. వెంట ధేనువు నిలవాలి. అందుకే ఆయన గోపాలకృష్ణుడు. ప్రియమైన ఆ గోవులిచ్చే క్షీరాన్ని ప్రేమతో పానం చేసేవాడు. దధిని దండిగా జుర్రేవాడు. నవనీతాన్ని దొంగిలించి మరీ ఆరగించే వాడు. ఆయన క్షీరసాగర శయనుడే! ఆయనకు క్షీరము అవసరమా? అవసరం లేకపోవచ్చు. కాని, ధేనువు లిచ్చే క్షీరానికి, క్షీరసాగరం లోని క్షీరానికి పోలికే లేదు. గోకులంలో గోవులు ఇచ్చింది పాలు కాదు. ప్రేమామృతం. భక్త్యామృతం. అందుకనే, అచ్యుతుడు కోరి మరీ పానం చేసేవాడు.

గోకుల ధేనువుల పొదుగులలో పుష్కలంగా పాలు నిండి ఉండేవి. అలాగే ఉంటే వాటిని గోకులవాసులు పిండు కుంటారని, గోవత్సములు త్రాగేస్తా యని, తొందర తొందరగా పాలు పిదుకక ముందే ***(అదుగ్ధాః),*** అవి చెంగుచెంగున గంతులు వేస్తూ బాలకృష్ణుని వద్దకు వెళ్ళి పొదుగులను నోటికి అందించేవి. గోపాలుడు ప్రియంగా వాటిని పానం చేసేవాడు.

భక్త ధేనువులు సంగవర్జితులు కావడం చేత, తమ బిడ్డలైన గోవత్సముల యందు రాగబుద్ధి నశించి, బిడ్డల కివ్వవలసిన క్షీరాన్ని బాలకృష్ణునికి ఇవ్వాలని పరుగులు తీసేవి. అలాంటి అనన్య భక్తిని మనమూ అలవరచుకోవాలి. అట్టి పరమ ప్రేమని ప్రసాదించ మని పరమేశ్వరుని నిండు మనస్సుతో ప్రార్థించాలి.

**అభి త్వా శూర నోనుమో౽ దుగ్ధా ఇవ ధేనవః।**
**ఈశాన మస్య జగతః స్వర్దృశ మీశాన మిన్ద్ర తస్థుషః॥**

ఇంద్రా=ఓ ప్రభూ! పరమేశ్వరా!, శూర=ఓ శూరుడా! కృష్ణా!, త్వా=నిన్ను, అభి=అంతట, నోనుమః=నమస్కరిస్తున్నాము, అస్య జగతః=ఈ జగత్తుకు (జంగమమునకు), తస్థుషః=స్థావరమునకు, ఈశానం= నియామకుని, స్వర్దృశమ్ =ప్రపంచాన్ని ప్రకాశింప చేయు వానిని, అదుగ్ధాః=పాలు పిదుకని, ధేనవ ఇవ=గోవుల వలె (నమస్కరిస్తున్నాము).

'భగవాన్! శ్రీకృష్ణా! స్థావర జంగమాత్మక మైన ఈ ప్రపంచానికి సత్తా స్ఫూర్తి ప్రదాతవైన నిన్ను, పాలు పిదుకని గోవులు ఎలా సేవించాయో, అలాగే మేమూ నిన్ను అంతటా నమస్కరిస్తున్నాము.'

విషయ సంగత్వమును వీడి భగవత్సన్నిధికి భక్తితో ధేనువులు చేరాయి కనుక, ఆయన వాటి క్షీరాన్ని

పానం చేసి మోక్షాన్ని ప్రసాదించాడు. మనం కూడా రాగరహితులమై మన హృదయాల లోని ప్రేమ క్షీరాన్ని పరమాత్మకే సమర్పిస్తే, మన బ్రతుకులు కూడా ఒడ్డుకు చేరుతాయి.

చరణము: **క్షీరసాగర శయనా! క్షీరమె నీకు కావలెనా?**
**వేదము కదిలిన నోటికి వెన్నలు మన్నులు కావలెనా?**
**పాల కడలిలో వెన్నకుండలలో ఉన్నది ప్రేమే చల్లన**
**తేనెల కన్నా తియ్యన!**

పల్లవి: **పావన యమునా జలములు చల్లన!**
**మోహన కృష్ణుడు నల్లన - మన**
**మోహన కృష్ణుడు నల్లన ! ॥ పావన ॥**

అని గోకుల క్షీర వైభవాన్ని కీర్తించింది చైతన్య గీతిక.

## (5) సర్వుల యందు నిర్వైరుడు

పరమేశ్వరుని పొందగోరు వాడు హృదయంలో శత్రు భావము లేనివాడై ఉండాలి. అదే నిర్వైరము. నిర్వైరము అంటే నిర్గత వైరము ***(నిర్వైరః నిర్గత వైరః)***. ఎవరి విషయంలో వైరము లేనివాడు? ఎవరి విషయం లోనూ శత్రు భావన లేనివాడు ***(సర్వభూతేషు శత్రు భావ రహితః)***. బంధుమిత్రాదుల యందు, ప్రియమైన వారి యందు, ఉపకారము చేసిన వారి యందు శత్రు భావన లేకుండా ఉండటం సహజం. కాని, తనకు అపకారం చేసిన అయిష్టుల యందు కూడా శత్రు భావన లేకుండా ఉంటాడా? ఉంటాడు. తనకు ఎంతగానో అపకారం చేయడానికి ప్రయత్నించిన వారి యందు, అలా ప్రవర్తించిన వారి యందు కూడా కించిత్తు వైర భావము లేనివాడు ***నిర్వైరః (ఆత్మనః అత్యన్త అపకార ప్రవృత్తే ష్వపి)***. అంతటా పరమేశ్వర భావన కలిగిన వాడు ఎవరిని ద్వేషించ గలడు? ఎలా ద్వేషించ గలడు? ఉపకారులలో, అపకారులలో ఉన్న ఒకే పరమేశ్వరుని దర్శించే మత్పరముడు మద్భక్తుడు కావడం చేత ఎవ్వరినీ గర్హించలేడు. వైరాన్ని ఊహించలేడు. రాగం ఉంటేనే ద్వేషం ఉంటుంది. ద్వేషం ఉంటేనే వైరము ఉంటుంది. రాగద్వేష రహితుడైన భక్తుడు శత్రుభావ రహితుడయ్యే ఉంటాడని ప్రత్యేకంగా చెప్ప నవసరం లేదు.

పరమేశ్వరుని పొందే వాని లక్షణాలను ప్రస్తుతం మనం అధ్యయనం చేస్తున్నాం. పరమాత్మను పొందాలి అంటే, పరమాత్మ లక్షణాలు అతనిలో కూడా నిండి ఉండాలి కదా!

**సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః**

'నేను సర్వుల యందు సమంగా ఉంటాను. నాకు ద్వేషింప దగిన శత్రువు లేడు. ప్రేమించ దగిన ఇష్టుడు లేడు' అని తొమ్మిదవ అధ్యాయంలో భగవంతుడు ప్రవచించాడు కదా! ద్వేషమే తెలియని భగవంతుని పొందాలి అంటే, మనం కూడా ద్వేష భావం లేని వారమై ఉండాలి.

***కట్టినారు కొందరు కొట్టినారు***
***పట్టినారు కొందరు పెట్టినారు***
***అందరిని సమముగా చూచినావు***
***నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!***

అని చిన్నికృష్ణ శతకంలో ఒక వెన్నముద్ద.





### భగవత్ప్రాప్తి

అర్జునా! నా కొరకే కర్మలు చేయువాడు, నన్నే పరమగతిగా కలవాడు, నా యందే భక్తి కలవాడు, విషయ సంగత్వము పూర్తిగా లేనివాడు, సర్వ భూతముల యందు శత్రుభావము లేనివాడు నన్నే పొందుతాడు అంటూ ఏకాదశాధ్యాయాన్ని సమాప్తం చేస్తున్నాడు భగవంతుడు.

పరమేశ్వరుడు తనకు అత్యంత ప్రియమైన ఉపదేశాన్ని, తనకు అత్యంత ప్రియుడు, భక్తుడు అయిన అర్జునునికి ఉపదేశించాడు. 'పార్థా! నువ్వు తెలుసుకోదగిందే నేను ఉపదేశించాను. నేను ఉపదేశించిందే నువ్వు తెలుసు కున్నావు. నువ్వు అడిగిందే నేను అందించాను. ఇంతకు మించిన వేరే విషయమే లేదు' అంటూ భగవంతుడు విశ్వరూప సందర్శన యోగాన్ని సమాప్తి చేస్తున్నాడు ***(అయం తవ ఉపదేశః ఇష్టః మయా ఉపదిష్టః హే పాండవ! ఇతి)***.

### భక్తియే ముక్తి

గమ్యాన్ని విడిచి మార్గం ఉండదు. ముక్తి సాధానికి భక్తియే సూటియైన మార్గం. భక్తి లేని ముక్తిని ఊహించడం సాధ్య పడదు. ఎన్ని శాస్త్రాలు అధ్యయనం చేసినా, మరెన్ని కఠోర సాధనలు అనుష్ఠించినా, భక్తి లేని వాడు ముక్తిని పొందలేడు.

చిత్రకారుడు తన చిత్రకళా నైపుణ్యము చేత అందమైన కమలాన్ని చిత్రించ గలడేమో గాని, దాని నుండి పరిమళాన్ని ఆఘ్రాణించ గలడా?

సప్తాశ్వముల నమర్చిన రథముపై సూర్య భగవానుడు ప్రకాశిస్తున్నట్లు, సుందరమైన చిత్రాన్ని చిత్రకారుడు గీయగల డేమో గాని, దాని నుండి కాంతిని ప్రసరింప చేయగలడా? ఇదీ అంతే.

భక్తి లేకుండా కేవలం పాండిత్యముతో శాస్త్రాలను హృదయస్థం చేసుకొనే వాడు, శాస్త్ర విషయాన్ని మనోఫలకంపై చిత్రించుకోగల డేమో గాని, బ్రహ్మానందానుభూతిని పొంద గలడా? పొందలేడు. అది అనన్య భక్తి చేతనే సిద్ధిస్తుంది. ఇదే ఏకాదశాధ్యాయం లోని సారభూతమైన విషయము.

***దేవై రపి సుదుర్దర్శం తపోయజ్ఞాది కోటిభిః।***
***భక్తాయ భగవానేవం విశ్వరూపం అదర్శయత్ ॥***

దేవతలకు కూడా చూడ శక్యము కానిది, తపస్సు, యజ్ఞము మొదలైన కోటి సాధనల ఫలితంగా కూడా చూడ నశక్యమైన విశ్వరూపాన్ని భక్తుడు కావడం చేత అర్జునునికి భగవంతుడు చూపించాడు.

ఇక మనం చెయ్యవలసింది, చూడవలసింది మాత్రమే మిగిలి ఉంది. అదే భక్తి. తరువాత ప్రసంగ విషయం అదే.

ఓం.. ఓం.. ఓం..

ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే విశ్వరూప సందర్శన యోగో నామ ఏకాదశోఽధ్యాయః

**ఈ విధంగా ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రము, శ్రీకృష్ణార్జున సంవాదము అయిన భగవద్గీత యందు విశ్వరూప సందర్శన యోగ మనే పదకొండవ అధ్యాయము.**